# సొంపైన తెలుగు

## అరుదైన మాటల సంచికట్టు

డా॥జి.వి. పూర్ణచందు



**SOMPAINA TELUGU**
(The Elegance of Telugu Expressions)

by

**Dr. G.V.Purnachand,**

***Published on the eve of Golden Jubilee Literary Celebnrations of the author***



First Edition : 21st February 2024

Price : **Rs. 100/-**

For Copies :

**Dr. G.V.Purnachand**
Susruta Ayurvedic Hospital
I floor, Satnam Towers
Opp: Buckinghampet Post Office
Governorpet, Vijayawada-520 002
Cell : 94401 72642
Email: purnachandgv@gmail.com

Designed by :
MANU GRAPHICS
Chikkadpally, Hyderabad
Cell: 93 93 83 40 50

Printed at :
SATISH GRAPHICS
Chikkadpally, Hyderabad-20
Cell: 88851 44422

# అంకితం



శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి (విహారి)

మా జన్మపుటొజ్జ! మా సాహితీ యాజ్ఞికుడు!

వచనం పద్యం సేద్యానికి సవ్యసాచి...

సాహితీ సాగరాన్ని కవ్వనం చేసి,

కలం (ఓడ) నడిపించిన కవి పోతనాహుడు(నావికుడు)...!

పలుకులమ్మ నవ్వుతూ పలికిందాయనకి!

తెలుగున రామాయణం పలికించిం దాయనతో!!

అందుకే...

గౌరవము, భక్తి, అనురక్తి ముప్పిరిగొని

ఆయన, ఆయమ్మ

శ్రీ విహారి

శ్రీమతి శ్యామలా దేవి

దంపతులకు ఈ

సొంపైన తెలుగు

అందాయత్తుగా అందిస్తూన్నాం...!

పూర్ణచందు

అరుణాదేవి

# విషయ సూచిక

# THE ELEGANCE OF TELUGU EXPRESSIONS

***Come Along!***
Immerse in immense love
In captivating and unparalleled charm
Of Telugu Expressions!

Having distinctive elegance
And richness in diverse meanings-
Telugu, the Classical one,
Possesses expressive power
And Cultural significance!

Enjoy, Love, and Adore
The nuanced beauty of
The sweet Language,
Our pretty Telugu...
The true treasure to behold!!!

**-Dr. G V Purnachand**

# కోటికొక్కటిగా కొత్త వెలుగుదివ్వె

**డా॥** జి.వి.పూర్ణచందు–పరిచయం అక్కర్లేని ప్రసిద్ధినీ, ప్రాచుర్యాన్నీ పొందిన శతాధిక గ్రంథకర్త, నిత్యపరిశోధకుడు, వ్యాసకర్త, నవలాకారుడు, కథకుడు, 'ముక్కాలు' కవితా ప్రక్రియ సృజనకర్త. తెలుగువారికి 'ఆహారవేదం' అందించిన అపూర్వ యశస్వి. అలాగే, 50పైగా ఆరోగ్య విషయిక గ్రంథకర్త. వీటన్నిటికీ మించి, ప్రపంచ తెలుగు రచయితలకు ఆత్మీయుడైన కార్యకర్త, కార్యదర్శి, కార్యదక్షుడు.

**ఈ పుస్తకంపేరు 'సొంపైన తెలుగు'. ఉపశీర్షిక– 'అరుదైన తెనుగు మాటల సంచికట్టు'.** ఈ 'సంచికట్టు'లోనే పూర్ణచందుకు తెనుగు భాషతో గల 'మమత్వం' వెల్లడవుతోంది. అతని మననధార అహరహమూ తెనుగు 'జాలు'నే వెల్లువెత్తుతూ వుంటుంది. 34 వ్యాసాలు గల సంపుటి ఇది.

ప్రాచీనాధునిక దేశి సాహిత్యంలో తెనుగు నుడి సొబగు వెలిసిపోతున్నదే అని మా పూర్ణచందు సంవేదన. అతనికి ఆ సొంపైన తెనుగు నుడుల్ని మళ్లీ వాడుకలోనికి తెచ్చుకొనేట్టు సాహితీలోకాన్ని ప్రచోదనం చేయాలనే ఆరాటం, తపన. నిజానికి ఈ తపస్సుతో అతడు నిత్యసత్యాన్వేషి, నిత్యాన్వవేక్షకుడు అయినాడు. ఎన్నెన్నో ఆకర గ్రంథాల్ని, కావ్యాల్ని, వచన గ్రంథాల్ని పరిశీలిస్తూ వుంటాడు. ఎన్నెన్నో మరుగున పడిన పలుకుబడుల్ని, నుడుల్నీ, నానుడుల్నీ పరిశోధిస్తూ వుంటాడు. ప్రతిమాటనీ తీసుకుని దాని పుట్టుపూర్వోత్తరాల్ని త్రవ్వుతాడు. ఉదాహరణల కోసం శతసహస్ర గ్రంథాల విషయాల్ని త్రవ్వుకుంటూ పోతాడు. అతని ఈ శ్రమ అంతా ఒక అనితర సాధ్యమైన సాహితీ వరివస్య, చరిత్ర నిర్మాణం కూడా. చరిత్ర మనిషి సాగిపోవలసిన సరళమైన మార్గాన్ని చూపుతుంది. చరిత్ర అభివృద్ధి పంథాను నిరూపిస్తుంది. చరిత్ర బుద్ధివివేకాలకు పదును పెడుతుంది. చరిత్రజాతికి కొత్తశక్తినిస్తుంది' అన్నారు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు. పూర్ణచందు కృషి వెనుక ఈ లక్ష్యం, ఆశయం ఉన్నాయి. ఫలితంగా – ఇవిగో ఇలాంటి అసాధారణ వ్యాసాలు తెలుగు జాతికి అందాయి, అందుతున్నాయి.

**ఈ గ్రంథం ఒక అసామాన్య కృతి. తెనుగు పరిశోధన, విమర్శ సాహిత్యంలో – మొట్టమొదటిసారి పూర్ణచందు ఈ వ్యాసాల్లో భిన్నదృక్కోణాన్ని ఆవిష్కరించిన వ్యాస సంపుటి. వాడుక తెనుగు వాడినీ, వేడినీ–సృజనాత్మక, పరిశోధనాత్మక ప్రతిభతో లోకానికి ఎరుకపరచాడు. ఇదీ అనితర సాధ్యమైన కృషిఫలం!**

'పసదనం' గురించిన మొదటి వ్యాసాన్ని చదవండి. పసన, పసదన, పసదనం, పసపడటం–ఇలా – ఆ మాట– సంతృప్తి, ప్రతిభ, పారితోషికం, కానుక, అన్నం, రుచి పడటంగా – ఎన్నెన్ని అర్థాల్లో ప్రయోగింపబడిందో చెప్పాడు. చెప్పటం మాత్రమే కాక ప్రతి ప్రయోగానికీ ఉదాహరణల్ని చూపించాడు. టేకుమళ్ల అచ్యుతరావు, వెంకట పార్వతీశకవులు, చిన్నయసూరి, వడ్లమూడి గోపాలకృష్ణయ్య, మొసలికంటి సంజీవరావు, సాంబనిఘంటువు, గంగాదేవి, క్రీడాభిరామం, ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ వంటివారి ప్రయోగాల్ని చర్చించాడు.

'తాళాధ్యాయం' వ్యాసాన్ని చూస్తే–ఇందులో ఇంత నిగూఢవిద్య' ఉన్నదా అని విభ్రమం కలుగుతుతుంది. ఆంధ్రవాచస్పత్యం, బ్రౌన్ వ్యుత్పత్తి పదకోశం వంటి ఆకరాల్ని చూపుతూ–మరోవిశేషాన్నీ చెప్పాడు. అది ముదిగంటి జగ్గన్నశాస్త్రి కథ. ఈ వ్యాసం చివర్లో ఈ తెనుగుమాటని మనం ఏఏ సందర్భాల్లో ఎంత విరివిగా ప్రయోగించుకోవచ్చునో చెబుతూ–ఏకంగా 18 సలహాల్ని ఇచ్చాడు. మన తెనుగు పలుకుబడిన విస్తృతంగా వ్యాప్తి చేయగల ఆ సూచనలు ఎంతో సుబోధకంగా, ఆచరణాత్మకంగా కూడా వున్నాయి.

'మీసరంగాసించు' వ్యాసం ఒక అనర్ఘరత్నం. ఈనాటి తెలుగు సాహిత్య వ్యాసాల్లో అనితరంగా, అజరామరంగా నిలిచి వెలిగేరచన ఇది. భాషాచరిత్రకు ఒక మేలికూర్పు నిజానికి ఈ పద గుళుచ్ఛం–'రామునితో కపివరుండిట్లనియె' బాపతుగా తయారుచేయబడిన ప్రయోగం!

'ధగిడీ సమ్మె' వ్యాసంలో పత్రికల పేర్లూ, ప్రచురణ తేదీలూ చెబుతూ ఇచ్చిన ఉటంకింపులు మన బుర్రని గిరికీలు కొట్టిస్తాయి. విషయంపట్ల అవగాహన మాత్రమే గాక, ఆ విషయానికి గల ప్రామాణికతను గవేషణతో పైకితెచ్చి చూపే పూర్ణచంద్ చిత్తశుద్ధికీ, రచనాదక్షతకు 'జయహో' అంటాము.

'శషభిష'లు చదువుతుంటే రచన చేసేటప్పుడు పూర్ణచంద్ మేధలో నిజంగా ఒక సామూహిక భావధార బుగ్గపొంగుతూ వుంటుందేమో అనిపిస్తుంది. ఆ

భావ సమూహమంతా వివిధ గ్రంథాల అధ్యయనం లోతుల నుండి పెల్లుబికిందే. నాదెళ్ల పురుషోత్తమ కవి నుండి కందుకూరి, తిరుపతి వెంకటేశ్వర్లు, గురజాడ, మరాఠా మహరాజు శాహ ప్రభువు వరకూ గల ఎందరెందరో సాహితీవేత్తల ప్రయోగాలు ఉదహరించాడు. విభిన్న అర్థాల్లో ఆ పదం ఎలాంటి మెరుపులీనిందో వివరించాడు. అలాగే, గోల్కొండ పత్రిక, సృజన, వీక్షణం, పత్రికాభాషా నిఘంటువుల్లో ఈ మాట వాడుక వివరాల్ని చూపాడు.

'పాచిపెత్తనం' ఎన్నిరకాలో తెలుసుకుంటే 'అచ్చ తెలుగులో గంగమ్మ' – 50 పేర్లు చదివితే, ముగ్ధులవుతాము. 'ఆహా' అని విభ్రమిస్తాము! – ఇలా, ప్రతి వ్యాసమూ దేనికదే ఒక 'థీసిస్'కి 'మీనియేచర్' అనిపిస్తుంది. మీరుగా అన్నీ చదవండి. అన్నింటి గురించి చెప్పి, మీ పఠనోత్సాహాన్ని అవరోధించను. ఈ వ్యాసాలన్నీ వివిధ పత్రికల్లో 'కాలమ్' శీర్షికల్లో రావటాన, నిడివిపై గల పరిమితివలన – అద్దంలో కొండలా కానవస్తున్నాయి.

నిఖార్సయిన వ్యాసకర్తగా – పూర్ణచందు చాలా వ్యాసాల్లో వాడుక భాషాభివృద్ధికి తనవైన అభిప్రాయాల్నీ, సూచనల్నీ, సలహాల్నీ, నిష్కర్షగా పొందుపరచాడు.

> 'మంచి పెత్తనాలే లేవా? ఉన్నాయి. స్టూడెంట్ యూనియన్ లీడర్ని తెలుగులో 'పెచ్చు' లేదా 'పెచ్చె' అంటారు. బడిలో పెత్తనం చేసే విద్యార్థి అని వ్యుత్పత్తి పదకోశం వ్రాసింది. 'పెచ్చు' పెరగాల్సిన వాడు కదా నాయకుడంటే!
>
> విద్యార్థి సంఘాల ఎన్నికలు లేకపోవటంతో యువతలో పెచ్చెల్లేకుండా పోయారు. నాయకత్వ లక్షణాలు సంతరించుకునే అవకాశాల్లేవు. యువతకు దిశానిర్దేశం కోసం మనం ఏమీ చెయ్యట్లేదు.
>
> కెరీర్ అంటే, విదేశాల్లో ఉద్యోగం చేయటమేననుకుంటున్నారు. యువత. కెరీర్ అంటే జీవనప్రగతి. అది వృత్తి మాత్రమే కాదు, ప్రవృత్తి కూడా! బాధ్యతారాహిత్యం, విదేశీ వ్యామోహం, కుసంస్కారం, భాషాసంస్కృతుల తిరస్కారాలే గొప్పనుకుని, అపమార్గపు బాటలు పరుచుకొంటూంటే, ఊరక చూస్తూ భీష్మద్రోణాదులు చేసిన తప్పునే .... మేధావులు చేసినట్టవుతుంది. మేధావులు పాచిపెత్తనం మానాలి!' (పాచిపెత్తనాలు)

పూర్ణచందు వ్యాస రచనలో సారళ్యాన్నీ, సులభగ్రాహ్యతనీ స్వానుభవంతో సాధించుకున్నాడు. వాటిని అతను ప్రేమిస్తాడు. అతని వచనానికి చక్కటి ధారాశుద్ధి వుంటుంది. ఒక్క ఉదాహరణని చూడండి.

‘ఎండకన్నెరుగకపోతే శరీరం పాలిపోతుంది. రక్తాది ధాతుపోషణ ఆగిపోతుంది. ఎండతగిలితే ధాతుపుష్టి కలుగుతుంది. ఎండ వలన శరీరంలో చెడ్డ బాక్టీరియా నశిస్తుంది. వ్యాధినిరోధకశక్తి పెరుగుతుంది. ఎముక పదార్థం తయారౌతుంది. మానసిక ప్రశాంతత కలుగుతుంది. సూర్యుడు రాని రోజుని దుర్దినం అంటారు అందుకే! తెలుగువారు చంద్రుడు రాని రోజు అమావాస్యని కూడా దుర్దినం గానే భావిస్తారు.

ఈజీమనీ, క్రేజీ లైఫ్ తరహా ఆలోచనా విధానంలో బయటకు రావటమే ఎండకన్ను ఎరగటం అంటే! మనం ద్వేషించవల్సింది కష్టాన్నే గానీ శ్రమని కాదు. శ్రమైక జీవనం సౌందర్యానికి సాటి ఏదీ లేదనే కదా మనం చిన్ననాటి నుండీ నేర్చుకున్న పాఠం (ఎండకన్ను)

అతని రచనా శైలికి ఉదాహరణగా – ‘చురపుచ్చు’ వ్యాసాన్ని చదవండి.

తన వ్యాఖ్యల్లో పూర్ణచందుకు ‘శషభిష’లు లేవు. లక్ష్యశుద్ధి అతన్ని తెనుగు నుడి పర్యాప్తికి దోహదం చేసే ప్రతిపాదనల్ని చేయమని ప్రోత్సహిస్తుంది. అందువలన నూరుశాతం ఈ రచన ప్రయోజనం సాధించుకున్నది.

ఒకొక్కమాట పుట్టుపూర్వోత్తరాల్ని ప్రోవుగా తీసుకుని, దాన్ని తూర్పారపట్టి, గట్టి గింజల్ని మనకందించాడు పూర్ణచందు. ఈ వ్యాస సంపుటి అతని పరిశోధనాధిషణకు ఎత్తిన వైజయంతిక! అతని ప్రజ్ఞా నిధిత్వానిధిత్వంలో ఒక తేజోరేఖ! తెనుగు నుడి పరంగా అతని కృషికీ, అతడు అందిస్తున్న అపూర్వ వ్యాస మణిహారానికి తెలుగుజాతి అతనికి ఋణపడి వుండాలి.

**వివేచనతో కూడిన, ప్రయోజనాత్మక, ప్రయోగాత్మక సాహిత్యవ్యాసం అంటే ఏమిటో ఒక నమూనాని మనముందుంచుతోంది ఈ సంపుటి.** ఆ రచనానైపుణ్యం పూర్ణచందుకు ఎంత స్పష్టంగా, సమగ్రంగా వున్నదో కూడా తెలుపుతోంది.

ఇదొక అసాధారణమైన ‘సంచికట్టు’ మాత్రమే కాదు అపురూపమైన తెనుగు ‘నుడిపట్టు’ కూడా!! పూర్ణచందు తన రచనలతో–నేను ‘శిష్యాదిచ్ఛేత్ పరాజయమ్’ అనుకొనే మహద్భాగ్యాన్ని నాకు అందిస్తున్నాడు. అందుకు అతనికి హృదయపూర్వక అభినందనలు!

శుభాకాంక్షలతో...

హైదరాబాద్ **–విహారి**

# అమ్మనుడుల బువ్వ ఇది!

## డా॥ జి.వి.పూర్ణచందు

తెలుగు నుడుల్ని దక్కించుకోవటం అంటే వాడకంలోంచి జారిపోయేవాటిని నిలుపుకోవటమే! మరుగున పడిన నుడిమణికాల్ని వెలికితెచ్చి వాటితో తెలుగమ్మని అందగించుకోవటం అనేది ఈనాటి అగత్యం కూడా!

పదబంధపారిజాతం లాంటి మంచి కబ్బాలు కొన్ని తెలుగుమరుగుల్ని అందచేసాయి. ఆచార్య తిరుమల రామచంద్ర, డా॥ బూదరాజు రాధాకృష్ణ, శ్రీ చీమకుర్తి శేషగిరిరావు  ఇంకా కొందరు అనేక నుడుల్ని విడమరచి చెప్పే పూనిక కొంత చేశారు. మన కావ్యాలకు వ్యాఖ్యానాలు వ్రాసిన పెద్దలు ఆ యా కవులు వాడిన నుడుల్ని వివరించే టీకలు వ్రాశారు. అయినా, వేనకొలది నుడులు మనకు తెలీనివెన్నో ఇంకా మరుగునే ఉన్నాయి.

వాడకంలో ఉన్న వాటికన్నా మరుగైన అరుదుపలుకుబడులే మిక్కిలిగా ఉన్నాయి. సంస్కృత, ఆంగ్ల నుడులు తెలుగుని కమ్మేశాయి. వాటికి దీటైన  తెలుగు మాటలు ఉన్నా వదులుకుని మనం సంస్కృతాంగ్లాలనే అండ చేసుకుంటున్నాం. అందువలన తెలుగుకి నష్టం జరిగింది. ఇది ఈ నాటి నెపం కాదు. నన్నయ అప్పటికే ఉంది. ఆనాటికే తెలుగు మరుగుల సంఖ్య మితిమీరి ఉంది. మాటలు అన్నీ చాటైపోతున్నా ఇంకా మనభాష ఊపిరాడుతోందంటే అది భాష గెనుపు అంటే పుష్టికి  మూదలిక(Proof).  అంతేకానీ, తెలుగు మాటాడే మన దళగింపేమీ కాదు. మనకు తెలుగు పరువు నిలపాలనే యావ తక్కువే కదా!

తుదముట్టంగ నీకబ్బము<br>
పదిలముగాఁ జదివినట్టి బాలుర కోలిం<br>
బొదలును భాషాజ్ఞానము<br>
కుదొరుం గొద లేక నీతికుశలత్వంబున్” అంటూ నుడుల ఎరుక (భాషా జ్ఞానం) కలగటానికి చిన్నయ సూరిగారు తాను నీతిచంద్రికను వ్రాయాలని

పూనుకున్నట్టు ఆయనే చెప్పుకున్నారు. మరుగున పడిన అనేక తెలుగు మాటలను వెలికితెచ్చేందుకు ఆయన నిలబడ్డారు. నీతిచంద్రికలో అనేక నుడిముడుల్ని (పదబంధాలు) ఆయన మనకు ఎరుక చేశారు. సూరిగారి వచనంలో ఉన్న సొగసుని ఇతరులు తేలేకపోయారు. చివరకు చేతులెత్తి కొరుకుడు పడనట్టు వ్రాశాడంటూ, గ్రాంథికం అని ముద్ర వేశారు, అందువలన ఆయన వెలికి తీసిన మాటల్ని మళ్ళీ మరుగు పరచటమే అయ్యింది. ఇది భాషకు చెడేచేసింది.

మనం లోతుగా గాలిస్తే 'వరువాయి' లాంటి తెలుగు నుడులకు సంస్కృతంలో లేనంత ఎక్కువ లోతుంది. ఇంతటి మన మాటల్ని ఎందుకు వదులుకోవాలి? ఇప్పుడివన్నీ ఎవడిక్కావాలి అనో, ఎవరికి అర్థం అవుతాయనో, ఎంతకాలం పాత చింతకాయ పచ్చడిని తింటాం అనో ఈసడించే వారిని ఈ పుస్తకం కొంత బుజ్జగిస్తుంది. అమ్మనుడుల బువ్వ ఈ పుస్తకం.

సొగసైన తెలుగులో సొంపైన నుడుల లోతుల్ని వాటి మూలాల్ని వెదుకుతోందీ పుస్తకం. ఇది "ఒక్కొకున" వ్రాయగలిగే పని కాదు. ఒక్కడుగా చేయగలిగేదీ కాదు. తెలుగంటే కూరిమి గల అందరూ ఓహరిసాహిరిగా కదలాల్సిన పెద్ద "పాటు" ఇది. గోముగా కూర్చుని చేసే పరిశోధనలు పట్టాల నిస్తాయే గానీ నుడికి పట్టం కట్టలేవు. 'తెలుగు దప్పి' ఉంటేనే అది సాధ్యం అవుతుంది.

ఈ బువ్వలోని వంటకాలన్నీ ఆంధ్రప్రభ దినపత్రిక, అమ్మనుడి మాసపత్రిక, విశాలాక్షి మాసపత్రికలలో అచ్చయినవే! వాటిని గడించే సంపాదకులకు నా దణ్ణాలు.

చిన్ననాటి నుండీ తెలుగంటే నాలో ఎనలేని ఈలువు కలిగించింది మా ఒజ్జ విహారిగారే! ఈ కబ్బానికి మంచి నిల్కడ కలిగించింది కూడా ఆయనే! వారికి ఏమిచ్చినా అప్పు తీరదు. ఈ కబ్బాని కేదైన సొంపు అబ్బి ఉంటే, అది ఆయన ఇచ్చిన పెరిమే! శ్రీ విహారి గారికి ఏటికోళ్లు వేకొలదిగా చెప్పుకుంటూ ఈ కబ్బాన్ని ఆయన చేతిలో పెడుతున్నాను.



# పసదనం

"దళవాయి చల్లా రాజన్నకు సర్వసేనాధిపత్యము, సంగ్రామచకవర్తి బిరుదము పదివేల వరహాలును పసదన" అని పెద్దాపురం ముట్టడి నాటకంలో విజయరామరాజు ప్రకటిస్తాడు. బుద్ధవరపు పట్టాభిరామయ్య రచన ఇది! పసదన అంటే ప్రమాణ ప్రకటన కూడా! అవతలి వ్యక్తి పసని గుర్తించి ఇచ్చే గౌరవం. పారితోషికమో, కూలీయో కాదు. ఇది అచ్చమైన తెలుగు ప్రయోగం.

"సాహిత్య అకాడెమీ పసదనం పొందిన రచయిత" అంటే ఘనమైన విషయమే!" ఇక్కడ పసదన అంటే 'పస'ని చాటుకున్నాడని! పసదనంలో పస తెలుగు పదమే! essence, సారము. Bloom, vigour, brilliancy, నిగ్గు. కాంతి. సత్త, సారస్యము. Abundance, సమృద్ధి. Skill, చాతుర్యము ఇన్ని అర్థాలు 'పస'కున్నాయి. పసని చాటుకోవటం, పసని నిలుపు కుంటానని ప్రకటించటం పసదన!

నాతి చరామి అని పెళ్ళికొడుకు ఇచ్చే హామీ కూడా పసదనే!

"వాగ్దానం ఆశలు గొలుపును, పసదనము లొసంగును" అనే వాక్యంలో పసదనం అంటే భరోసా. మంత్రులు రాజ్యాంగ బద్ధంగా నడుచుకుంటామని చేసే ప్రమాణం 'పసదనం'. ఇంత చక్కని తెలుగు మాట మనకుండగా, మనం ప్రమాణ స్వీకారోత్సవం అని సంస్కృత పదాన్ని ఆశ్రయిస్తున్నాం. మొదటినుండీ ఈ పదాన్నే వాడకంలో పెట్టి ఉంటే జనం నాలుకలమీద ఆడి ఉండేది.

"మనుచరిత్రము కంటెను, పారిజాతాపహరణముకంటెను మైరావణ చరితమునకే ప్రథమాంధ్ర ప్రబంధమను 'పసదనము' ముఖ్యముగా జెల్లవలసి యున్నది" అని టేకుమళ్ల అచ్యుతరావు రాశారు. ఇక్కడ పసదనం ప్రతిభా వ్యుత్పత్తుల్ని సూచిస్తోంది.

"సామాన్యుల జీవితాన్ని చిత్రీకరించటం వలన ఈ కావ్యానికి పసదనం దక్కింది" అంటే పరిపూర్ణత లభించిందని! ఇవన్నీ తెలుగు ప్రయోగాలు.

మన నిఘంటువులు పసదనము అనేది ప్రసాధనము అనే సంస్కృత రూపాన్ని బట్టి ఏర్పడిందని, Adornment, embellishment, అలంకారశోభ. A present of a jewel or cloth, & c, పారితోషికము అనే అర్థాల్లో ఈ పదాన్ని ప్రయోగిస్తారని వ్రాశాయి.

"బట్టు కనకాంబర వస్తువావానాదికములగు పసదనము లనేకములు సంపాదించెను" అనే వాక్యంలో భూరిదానాలు పొందాడనే అర్థం కనిపిస్తోంది.

"....శాంతి శోభావిలస
న్మూర్తులగు ప్రభులఁ గొలిచెడి
కీర్తియే పసదనము మాకకిల్బిషచరితా!"

కావ్యకుసుమావళి రెండవ భాగంలో వెంకట పార్వతీశ కవులు-పసదనాన్ని అలంకారశోభగా చిత్రించారు.

"... తిలకంబుకమ్మపువ్వు
లాదిగా గల మెలిద్రవ్యముల నొప్పు
పసదనము చేసి యుచిత రూపంబు దాల్చి" అనే ప్రయోగంలో పసదనం అంటే చక్కగా అలంకరించటం.

అని! పారితోషికం లేదా బహుమానం అనే అర్థంలో ప్రయోగించినప్పుడు మాత్రమే పసదన సంస్కృత వైకృతపదం. తక్కిన అర్థాల్లో పస నుండి ఏర్పడిన అచ్చతెలుగు పదమే!

"సాధుసాంగత్యము సర్వ శ్రేయములకు మూలము అని సాదరముగా వచియించి యాతనికి బసదనమిచ్చి తన కొడుకులను రప్పించి చూసి, విద్యాగంధము లేక జనుషాంధులవలె నున్నారు. వీరిని గన్ను దెఱపి రక్షించుట మీ భారమని చెప్పి పాటలీ పుత్రపు రాజు సుదర్శనుడు తన కుమారుల్ని విష్ణుశర్మకు అప్పగించాడు. అప్పగించే ముందు పసదనం ఇచ్చాడట.

చిన్నయసూరిగారు ఈ పదాన్ని పారితోషికం, కానుక, భుక్తిగడపటం, సంతృప్తిపరచటం అనే సంస్కృతార్థాల్లోనే ప్రయోగించాడు. ప్రసాధనం అనే సంస్కృత

పదానికి పసదనం వికృతి అని పండితాభిప్రాయం. అంగార, నాళ, ప్రసాధన, ఆకాశ, కర్ణాట, పర్యాణ, విజ్ఞాపన శబ్దములందు ఆకారమునకు హ్రస్వము వచ్చును" అనే సూత్రం ప్రకారం, ప్రసాధన–పసాదనం–పసదనము అనే శబ్దం ఏర్పడుతుందని వైకృత చంద్రికలో శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్య వ్రాశారు.

ఒకే పదం సంస్కృతంలోనూ ఆంధ్రంలోనూ భిన్నమైన అర్థాల్లో కనిపించటాన్ని ఇక్కడ గుర్తించాలి.

"అర్బనుడను గ్రీకు ఒకడు దేశద్రోహియై సుల్తాను నాశ్రయించి గొప్పఫిరంగుల దయారుచేయుట కొడంబడెను, వానికి మహమ్మదు విలువగల పసదనము లొసంగి వేయి పౌనుల భారముగల రాలను విసరు యంత్రము తయారు చేయమనికోరెను" అని 'అంతఃపురము' అనువాద నవలలో శ్రీ మొసలికంటి సంజీవరావు పసదనాన్ని ఈనాము అనే అర్థంలో ప్రయోగించారు.

"...వలను శోభిల్ల నెవ్వాఁడైన వీఁడె యర్జునుడని నా కిప్డు సూపెనేని, పసదనం బేనిచ్చు భంగి" అని కర్ణపర్వంలో ప్రయోగం. వీడె అర్జునుడని చూపిస్తే గొప్ప పసదనం ఇస్తాడట. పట్టుకుంటే పదివేలన్నట్టు! ఇవి సంస్కృత పసదన ప్రయోగాలు.

అయితే, సాంబనిఘంటువు అన్నానికి పసదనం అనే తెలుగుపదాన్ని పర్యాయ పదంగా పేర్కొంది. ఇది సాదము, ప్రసాదము లాంటి పదం అనీ, సంస్కృత రూపమేనని భావించారు. కానీ, మన శరీరానికి పసదనాన్ని (పుష్టిని) ఇచ్చేది అన్నమే కాబట్టి అన్నాన్ని పసదన అనటం కూడా సముచితమే! పసపడటం అంటే రుచి మరగటం. పాజిటివ్ గానే ఈ పదాన్ని తెలుగు పదంగా ప్రయోగించవచ్చు.

"పంచేంద్రియముల పసబడకున్న, ముంచు విధంబున మాయునామాయ" లాంటి కవి ప్రయోగాలున్నాయి.

"అలంకార ప్రియా! పతి నిన్నిప్పు డొకసారి చూచిన నాకు పసదనము" వీరకంపరాయ చరిత్ర అనే శ్రీ మధురా విజయంలో గంగాదేవి పసదనాన్ని సంతృప్తి అనే అర్థంలో ప్రయోగించింది.

క్రీడాభిరామంలో మాచల్దేవి చిత్రశాలలోని ఒక వర్ణచిత్రాన్ని చూసి, చిత్రకారుణ్ణి మెచ్చుకునే సందర్భంలో

"...చిత్రకారుఁడా దయ్యముగాక, వీని పసదనము టిట్లిభ! వీనికిందగున్" ఈ పద్యంలో "వీని పసదనము" అనే మాటని 'నీవి పస దానము" అని వేటూరి ప్రభాకర శాస్త్రిగారు దిద్దారని బండారు తమ్మయ్యగారు విమర్శించారు. పారితోషికం అనే అర్థంలో పసదనము అనేదే మూలపాఠం అని దానానికి 'పస'ని విశేషణంగా భావించి 'పసదానం' అనే ప్రయోగాన్ని కవి చేసి ఉండవచ్చునన్నారు. పసదనం అంటే ప్రతిభ. పస దానం అంటే ప్రతిభను మెచ్చి ఇచ్చే బహుమానం.

"ఈయమ పలుకుబడి పసదనమున కేమైన పసదనము లీయవచ్చు" అని మొల్ల గురించి ఆంధ్రకవయిత్రుల్లో ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు ప్రశంసించారు.

"చేమకూరను పాకముగాచేసి" సెబాసనిపించుకొన్న వేంకటకవి కావ్యసంసారమునకు భావసామగ్రిని పసదనము లిచ్చిన ఉదార కుటుంబిని తిమ్మక్క వస్తుసంపద, ఔదార్యము కొలదు లిడరానిది" అంటూ తిమ్మక్క గురించి భావసామగ్రిని పసదనం (కానుక) ఇచ్చిందని కూడా, లక్ష్మీకాంతమ్మగారు ఘనమైన ప్రశంస చేశారు.

తిక్కన కాలం నుండీ 800 యేళ్లుగా నిలబడి ఉన్న ఈ పదాన్నిమూలన పారేశాం మనం. దాన్ని మళ్ళీ వాడకంలోకి తేవటానికి ఎన్నో అవకాశాలున్నాయి. చక్కని తెలుగు పదాల్ని వెలిసిపోకుండా వాడకంలో నిలిపినప్పుడు మాత్రమే మన పస నిలుస్తుంది.



# మీసరం గాసించు

**1920**లో మెట్రిక్యులేషన్ యస్.యస్.యల్.సి విద్యార్థుల తెలుగు పాఠ్యగ్రంథాల్లో చిన్నయసూరిగారి మిత్రభేదంలో ఒక భాగాన్ని పాఠ్యాంశంగా విశ్వవిద్యాలయం నిర్ణయించింది. గిడుగు రామమూర్తిగారు ఓ పాఠ్యగ్రంథంలో మిత్రభేదం పాఠాన్ని పైపైన తిరగేస్తుండగా, "ఆ కానన మందుఁ బింగళకమను సింహము గలదు. అది పుండరీకముల ఖండించుచు సలుగుల నలుగులం పడఁజేయుచుఁ గాసరముల మీసరముగాఁ జించుచు" అనే వాక్యం ఆయన కళ్లలో పడింది. ఈ వాక్యంలో మిగతా పదాలకు నిఘంటువుల్లో అర్థాలు దొరికాయి. కాని "కాసరముల మీసరముగా జించుట" అంటే ఏమిటో ఆయనకు అన్వయం దొరకలేదు. కిళాంబి రామానుజాచార్యులవారు, కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రులుగారి వంటి పెద్దల్ని చాలా మందిని కలిసి అడిగారు ఎవరికి తోచింది వారు చెప్పారేగాని "మీసరముగా జించుచు" అని చిన్నయగారు ఎందుకువాడాడో సంతృప్తికరంగా సమాధానం రాలేదు.

ఆంధ్రభాషాలక్షణము లెస్సగా తెలిసిన శ్రీ వఝుల చిన సీతారామస్వామి శాస్త్రులుగారిని కలిసి అడిగారు. ఆయన లోపలికి వెళ్లి 1909వ సంవత్సరంలో అచ్చయిన (18వ ముద్రణ) నీతిచంద్రికని తెచ్చి పరిశీలించి చూశారు. అందులో "కాసరముల మీసరము గాసించుచు" అని ఉంది. 'గాసించుచు' అనే క్రియా పదం ఉందన్న సంగతి మరిచిపోయి సూరిగారి భాషా సేవని అర్థం చేసుకోలేని పండిత పరిష్కర్తలు మధ్యలో అరసున్నా చేర్చి 'గాఁ జించుచు' అని అచ్చువేయించారని గిడుగువారు అభిప్రాయపడ్డారు. ఈ ఉదంతాన్నంతా 1924లో చిన్నయసూరి నీతిచంద్రిక అనే వ్యాసంలో ఉదహరించారు.

1856లో చిన్నయసూరిగారు నీతిచంద్రికని స్వయంగా పరిష్కరించి రెండవ ముద్రణ అచ్చువేయించారు.మొదటి ప్రతిలోని దోషాలను ఆయనే సరిచేశారు కాబట్టి ఈ ముద్రణే నిర్దుష్టమైంది. అది దొరికితే, దాంతో

సరిచూసుకుంటే గానీ, ఇప్పుడు మనం చదువుతున్న నీతిచంద్రికలో తప్పులు తేలవు.

"ఆ అడవిలో పింగళకం అనే సింహం ఉంది. అది పుండరీకములను అంటే పెద్దపులుల్ని ఖండించిందట. సలుగులు అంటే అడవిపందులు అని! పందులు పొలాల్లో పడి ముట్టితో మొక్కల్ని కుళ్లగించి దుంపల్ని తింటాయి. పొలాల్లో అధికంగా ఉండే నీళ్ళు బైటకు పోవటానికి తవ్వే పిల్లకాలువల్ని అలుగులు అంటారు. సలుగుల్ని ఈ అలుగుల్లోకి పడదోసేసిందిట పింగళకం. కాసరములు అంటే ఎనుబోతులు. వాటిని "మీసరము గాసించినట్టు" చిన్నయసూరి వ్రాశారు. దీని భావం ఏదో తేలలేదు.

'నీతిచంద్రిక' కృతి ప్రశంస చేస్తూ, చిన్నయసూరిగారు "తుదముట్టఁగ నీ కబ్బము/పదిలంబుగాఁ జదివినట్టి బాలుర కోలిం/ బొదలును భాషాజ్ఞానము/ కుదురుం గొదలేక నీతి కుశలత్వంబున్" అనే పద్యం రాశారు. చివరి పుటదాకా శ్రద్ధగా, ఏకబిగువున చదివితే మానసిక వికాసం, నైతికవర్తనతో పాటు భాషాజ్ఞానం కుదుర్తుందని, కుశలత్వం అంటే నిశితంగా పరిశీలించే నేర్పు పెరుగుతుందని ఆశించి తానీ రచనకు పూనుకొంటున్నట్టు చెప్పుకున్నారు. ఇది నీతిచంద్రికకు లక్ష్యప్రస్తావనచేసిన పద్యం. కావ్యాల్లో పెద్దగా స్థానం పొందకుండా మరుగున పడిపోయిన తెలుగు పదాలను తెలుసుకోవటమే కదా భాషాజ్ఞానం అంటే!

చిన్నయ్య గ్రాంథికాన్ని తెచ్చి జనం మీద రుద్దాడన్న అభిప్రాయాన్ని గిడుగు, గురజాడ కూడా ఒప్పుకోలేదు. అయన వచన శైలికి ఆ ఇద్దరూ ముచ్చటపడ్డారు కూడా! 1924లో 'చిన్నయసూరి నీతి చంద్రిక' అనే వ్యాసంలో "వ్యావహారికభాష తల్లివలె నాకు ప్రేమపాత్రము; ప్రాచీనాంధ్ర భాష మూలపుటమ్మవలె నాకు పూజ్యురాలు" అని గిడుగువారు రాశారు. ప్రాచీనాంధ్ర భాషకు జీవంపోసినవాడిగా చిన్నయ సూరిని ఆయన గౌరవించాడు కూడా!

మూలపుటమ్మభాష(proto telugu)లోని పదాలు జనం వాడుక మరిచినవి కొల్లలుగా ఉన్నాయి.

**"ఆ సురవృత్తము ల్దెలియ కా సురవృత్తి వహించి మించి పె**
**న్గాసర మట్ల మీసరము గాసిలఁ జేయుచు లోక జాలమున్**
**మీసము ద్రిప్పు భూపతుల మెప్పున కిచ్చకమాడి వారికై**
**దోసములాచరించు కడు దుర్మతి దుర్గతి వొంద కుండునే"** అంటూ 1967లో వెలువడిన శ్రీ కన్యకా పరమేశ్వరీ చరిత్ర కావ్యంలో బండ్ల సుబ్రహ్మణ్యకవి చిన్నయసూరి మార్గాన్నే అనుసరిస్తూ ఈ పద్యం వ్రాశారు. ఆసురవృత్తితో అంటే పరమ రాక్షసంగా కాసరాలను (అడవి దున్నల్ని) మీసరం గాసిలచేసినట్లు (హింసించి బాధించినట్లు) ఈ వర్ణన కనిపిస్తుంది.

వెదికినంత మేర చిన్నయసూరి ప్రయోగించిన అర్థంలో మీసరం గాసిలచేయు అనే పదాన్ని ప్రయోగించినవారు ఒక్క ఈ బండ్ల సుబ్రహ్మణ్య కవిగారే కనిపిస్తున్నారు. ఇంకెవరైనా ఇదే అర్థంలో ప్రయోగించి ఉంటే వారికీ నమస్కారం.

మీసరం అంటే సమూలంగా నిర్మూలించటం అన్నంత తీక్షణమైన పదం. కానీ, మన నిఘంటువులన్నీ ముక్తకంఠంతో 'శ్రేష్ఠమైనదిగా చేయు' అనే అర్థాన్నే ఇచ్చాయి. "మీసరము [Tel.] adj. Excellent, fine, grand, శ్రేష్ఠమైన. "మీసరములౌ నీలంపుసరులమర."అని బ్రౌణ్య నిఘంటువులు చెప్తోంది.

మీసరము గాసిలచేయు అన్నప్పుడు 'గాసిలచేయు' అంటే బాధించటం అని! శ్రేష్ఠమైనదిగా చేయటానికి బాధించటానికి పొంతన ఎలా కుదుర్తుంది? ఈ రెండు పదాలను మన నిఘంతువులు ఎలాఅ సమన్వయం చేస్తాయి

తీవ్రమైన లైంగికవాంఛని రిరంస అంటారు. Sweetagony (తియ్యనిబాధ) అనేది దీని సమానార్థకం. తీపు అని తెలుగులో అంటాం మనం. సరిగ్గా ఇలాగే శ్రేష్ఠమైన(మీసరం), బాధ(గాసిల్లచేయు) రెండు పాదాలను కలిపితే శ్రేష్ఠమైన బాధ అనే కొత్తపదం పుడ్తుంది.

నిఘంటువులో ఒక అర్థం కనిపించినప్పుడు వెంటనే దాన్ని ఖండించటం కన్నా, మన సందర్భానికి తగినట్టుగా అన్వయించటం గురించి ఆలోచించటం మంచిది. అందువలన కొత్త ఆలోచనలు కలుగుతాయి. శ్రేష్ఠమైన బాధ అంటే మరణమే! "మీసరం గాసించుచు" అటే, హింసకు తాళలేక కాసరాలు శ్రేష్ఠమైన బాధని తమకు ప్రసాదించమని వేడుకునేంతగ హింసించాడని అన్వయం చెప్పుకోవచ్చు.

శ్రేష్ఠం పదానికి పర్యాయపదాల్లో 'పరమము' కూడా ఒకటి. ఉత్కృష్టమైనది పరమం. పరమపదము అంటే మోక్షం. మీసరం ఈ పరమపదమే ననుకుంటే సూరిగారు కాసరముల మీసరము గాసించుచు అనటంలోని ఆంతర్యం తెలుస్తుంది. ఈ అర్థంలో తీసుకుంటే గాసించాడనే మాటకు మోక్షం లేదా బలవన్మరణం పొందాడని ఒక కొత్త అర్థం వస్తోంది. తరచూ వాడ్తుంటే ఇవే వాడకంలోకొస్తాయి.

మీసరము, గాసించటము రెండూ చక్కని తెలుగు పదాలు! ప్రాచీన కవుల కావ్యాలలో పెద్దగా వాడకంలో లేనివి. సంస్కృతంపై మోజుకొద్దీ పూర్వకవులు జనసామాన్యం వాడిన ఇలాంటి వాడుకమాటల్ని కాలక్రమంలో వదులుకుంటూ వచ్చారు. వాటికి ప్రాణప్రతిష్ఠ చేయాలని సంకల్పించిన చిన్నయసూరిని గ్రాంథికవాదిగానూ, భాషాజటిలుడుగానూ ఈసడించిన వారికి చిన్నయసూరి హృదయం అర్థం కాలేదనే అనుకోవాలి.

"ఇప్పుడిలాంటి మారుమూల పదాల్ని తెచ్చినందువలన ఏం ప్రయోజనం? ఎవరికి అర్థం అవుతాయి?" అని అడిగేవాళ్లూ ఉన్నారు. ప్రయోజనం ఏమంటే పోయిందనుకున్న మన ఆస్తి మనకు దొరికినట్టు. దాన్ని రేపటి తరం కోసం అయినా భద్రపరచటం మన విధి

మీసరం అనే పదాన్ని పై సందర్భాన్ని బట్టి కాలం చేయటం, మోక్షం ప్రసాదించటం అనే అర్థంలో వాడారు చిన్నయసూరి. extirpation అనేది దీనికి సమానార్థకం. Forest elephants in Central Africa have experienced a 65 percent reduction in their populations, and extirpation is imminent if the poaching rate persists. ఇదే విధంగా మీసరం కొనసాగితే మధ్య ఆఫ్రికాలో అడవి ఏనుగుల సంఖ్య 65% తగ్గిపోతుందని ఈ extirpationకు నిఘంటువు లిచ్చిన వివరణ.

సమూలంగా తుడిచిపెట్టటం అంటానికి 'మీసరం' అనే తెలుగు పదం నిఘంటువుల్లో లేని అర్థంలో ఇలా దొరికింది. నీతి చంద్రికలో వెదికితే, ఇలాంటి పదాలు చాలా దొరుకుతాయి. అవి మన అనేక అవసరాలను తీరుస్తాయి కూడా! వాటిని ప్రచారంలోకి తేవలసిన బాధ్యత భాషోద్యమానిదీ, కవులదీ, పరిశోధకులదీ, పత్రికలదీ కూడా!



# లూలామాలం

**శీలంబు న్విడనాడి సిగ్గుచెడి శుష్మీభూతవృత్తిం గడున్**
**వ్యాలోలంబుగ బుద్ధినిం బఱపుచున్ వర్తించుటేగాని యే**
**లీలం జూచిన బారమార్థికపు జోలింబోవ దేమందు? నీ**
**లూలామాలపు జీవిచైదము నిలన్ లోకజ్ఞ! సర్వేశ్వరా!**

శ్రీ పింజల సోమశేఖరరావు వ్రాసిన 'సర్వేశ్వర శతకం'లోది ఈ పద్యం. శీలం, సిగ్గు వదిలేసి, గాలికి తిరుగుతూ, బుద్ధి చాంచల్యంతో గడపటమేగాని, పారమార్థిక చింతన జోలికే పోకుండా లూలామాలపు బతుకు బతకటాన్ని ఈ పద్యం తీవ్రంగా నిరసిస్తోంది. లూలామాలపు బతుకు అంటే మోసంచేసి బతకటం, లూలామాలపు చేష్టలు, మాటలు అసాంఘిక జీవనానికి తొలిమెట్లు.

సాధారణంగా కవిసమ్మేళనాల్లో ఎవరు పట్టుకోగలర్లే అనుకుని ఎవరో రాసిన కవిత తెచ్చి చదవటం లాంటి లూలామాలం పనులు చేసి కొందరు దొరికిపోతుంటారు. తన మీదజాలిపడి శివుడు వ్రాసి ఇచ్చిన శ్లోకం తెచ్చి ఓ పేదకవి రాజ్యసభలో చదివాడు. నత్కీరుడనే విమర్శకుడు దాన్ని ఎర్రచేతుల్తో (రెడ్ హ్యాండెడ్) పట్టుకున్నాడు. ఓ మంచి శ్లోకం చదివితే రాజుగారు ధనసాయం చేస్తాడని ఆశించిన ఆ పేదకవికి నిరాశ ఎదురైంది.

"గిరి తనయా ఘన కచభారంబు సహజ గంధంబు" పార్వతి కేశాలకు సహజమైన గంధపరిమళం ఉంటుంది... అనేది ఆ పద్యం సారాంశం. స్త్రీ కేశాలకు సహజపరిమళం ఉండదు కాబట్టి ఈ శ్లోకానికి బహుమతి యోగ్యత లేదన్నాడు నత్కీరుడు.

దాంతో, శివుడే వచ్చి సాక్ష్యం చెప్పాడు. అయినా, నత్కీరుడు ఒప్పుకోలేదు. 'నేను శివుణ్ణి, నా భార్యగురించి నాకంటే నీకు ఎక్కువ తెలుసా? అంటూ, "తన నిజంబగు రూపం బాలోనఁ దెలుపవలె"నని నిటలనేత్రం అంటే మూడో కన్ను తెరిచిచూపించాడు. దానికీ బెదర కుండా "తల చుట్టువాఱఁ గన్నులు గలిగినఁ బద్యంబు దప్పుగాదన వశమే" తలకాయంతా కళ్లే పెట్టుకున్నా తప్పు ఒప్పు కాబోదన్నాడు.

విమర్శకుడంటే ఎలా ఉండాలో నత్కీరుడు రుజువు చేశాడు. "నత్కీరుడు ప్రదర్శించిన ధైర్యము, అసూయాదోషదూషితులు చేయ గలిగింది కాదు, నత్కీరుని వాదమే సమంజసమైన దనక తప్పదు" అని నోరి నరసింహశాస్త్రిగారు నత్కీరుని వాదనని సమర్థించారు.

తన భార్య జుట్టుకు సహజపరిమళం ఉన్న సంగతి ఒక్క శివుడికి మాత్రమే తెలుసు. ఆ విషయంలో నత్కీరుడికి అభ్యంతరం లేదు. 'కానీ, మనం శివలోకం వాళ్లం కాదు, ఈ లోకానికి అది విరుద్ధమే' ననేది నత్కీరుని వాదన. అలా లోకవిరుద్ధమైంది లూలామాల.

ఒక ప్రాంతానికి చెందిన సంస్కృతి, భాష, ఆచారాలు, వనరులు, అక్కడ పుట్టిన సిద్ధాంతాలు అ ప్రాంతానికే అనుకూలంగా ఉంటాయి. ఏ ప్రాంతానికి చెందిన రోగికి ఆ ప్రాంతంలో దొరికే మూలికలతో వైద్యం చేయాలన్నాడు చరకుడు.

మంచుకొండల్లో జీవించేవారికి చెమట తక్కువ కాబట్టి, ఉప్పు అవసరం కూడా తక్కువే! అక్కడి సిద్ధాంతాన్ని ఆరుగాలం కష్టించే ఉష్ణప్రాంతం రైతన్నలకు, కూలన్నలకు చెప్తే ఉప్పు చాలక కొత్త సమస్యలొస్తాయి. దేశకాలమాన పరిస్థితులు ఎరక్కుండా చెప్పే సిద్ధాంతాలు లూలామాలపు సిద్ధాంతాలే! మన సమాజానికి తగనివాటిని ప్రచారం చేయటం లూలామాలపు పనే అవుతుంది.

తలవంపులు తెచ్చేదంతా లూలామాలమే! తిరుమల కొండకు సూటూ బూటూ వేసుకుని వెళ్ళటం లూలామాలతనమే! ఎప్పుడు ఎక్కడ ఏది చేయాలో అది చేయకపోవటం లూలామాలం. పెళ్ళిలో చావు మేళాలు వాయించటం అలాంటిదే!

**"ఆలాగున గొనిపోయి నృ**
**పాల ప్రియ పాన్పు క్రిందఁ బాదుక లిడి యా**
**లూలామాలపు నాలి గ**
**యాళి తనుం గానిదాని యటువలె నుండెన్"** అని చేమకూర వెంకటకవి సారంగధరచరిత్రలో "లూలామాలపు ఆలి" అనే కొత్త పదం

ప్రయోగించాడు. 'మాయ', 'కల్ల', 'అసత్యం', 'కపటం', 'లటవటం', 'కుటిలం', ' కుత్సితం', 'కూచిమారం' 'మటుమాయతనం', 'మందుమ్రాకు', 'అటమటం' ఇవన్నీ లూలామాలపు గుణాలే నంటుంది ప్రభులింగలీల కావ్యం.

"ఎవడో లూలామాలపు మాట విసిరాడని భార్యను వదిలేస్తారా ఎవరైనా?" అని దుగ్గిసెట్టి వేంకటరమణయ్య 'రమణీయరామాయణం' లో గట్టిగానే అడిగారు.

"కష్టమర్లకు లూలామాలవేసి ఫలానా ఛిట్ ఫండ్ కంపెనీ బోర్డు తిప్పేసింది" అంటే, టోకరా వేసిందని!

"ఎన్నికలొచ్చేసరికి ముక్కూ మొఖం ఎరుగని వాళ్లొచ్చి లూలామాలపు మాటలతో ఊరిస్తారు",

"నిత్యపెళ్లికొడుకు వేసింది వరమాల కాదు లూలామాల" లాంటి మాటలు నయవంచనను సూచిస్తాయి.

రాజకీయాల్లో లూలామాలపు తనం ఎక్కువగా ఉంటుంది. అయినా, ప్రతీసారీ మనం పాపుల్ని క్షమిస్తూనే ఉంటాం.

సెలవు ఇవ్వాలంటే మెడికల్ సర్టిఫికేట్ కావాలంటాడు పై అధికారి. లూలామాలం లేకుండా సర్టిఫికేట్ వస్తుందా?

దరిద్రానికి లూలామాలపుతనం ఉన్నా సాధుసన్యాసులు బిచ్చమెత్తుకు తిరుగుతారు. "పాతకాలంలో సన్యాసులు దారిద్ర్యాన్ని ఆరాధించినట్టే, యుద్ధానికి కూడా ఒక నైతిక ఈక్విలెంట్ లాంటి దేదైనా దొరకనచ్చునని తరచు అనుకుంటాను" అంటారు ఆచార్య తిరుమల రామచంద్ర, "20వ శతాబ్ది అమెరికాలో మతం" అనే అనువాద గ్రంథంలో!

పైకి 'అలాయిబలాయి'గా కన్పించినా, లోపల 'లూలామాలం లడాయి'గా ఉంటాయి కొన్ని వ్యవహారాలు. లూలామాలమానుష విగ్రహ రూపుల లీలలు కొల్లలు. 1971లో 60 లక్షల చెక్కు మీద ఇందిరాగాంధీ సంతకాన్ని లూలామాలం చేసిన రుస్తుం సోరబ్ నగర్వాలా అనే ప్రబుద్ధుడి గురించి కథలుగా చెప్పుకునేవారు. ఇందిరాగాంధీ అంటే గిట్టని వాళ్లు ఈ లూలామాలానికి ఆమే మూలం అంటారు.

ఒకప్పుడు ఈ లూలామాలం బాగా వాడుకలో ఉన్న పదమే! అనేక అర్థాల్లో ప్రయోగించేవారు.

ఇప్పటి రోజుల్లో పెద్ద పెద్ద స్కాములు ప్రభుత్వాలకు సహజ భూషణాలయ్యాయి. పెద్దపెద్దస్కాముల్ని లూలామాలం అని మనమూ పిలవొచ్చు.

మీడియా వాళ్లు ఇలాంటి లోతైన భావాన్ని అందించే చక్కని తెలుగు పదాల్ని వాడకంలో పెడితే జనానికి అలవాటవుతాయి. లేకపోతే, వాడకంలోంచి తప్పుకుని 'డీలాయమానం'లో పడుతుంది భాష!



# తాళాధ్యాయం

**హస్త ద్వయస్య సంయోగే వియోగే చాపివర్తతే ।**
**వ్యాప్తి మాన్యో దశప్రాణ స్సకాలస్తాళసంజ్ఞకః ॥**

హస్తద్వయం అంటే రెండు అరచేతుల సంయోగ వియోగాలు. అంటే ఒకసారి కలిసి విడిపోయేందుకు పట్టే కాలాన్ని దశప్రాణాలుగా విభజించారు. పాడేప్పుడు, ఆడేప్పుడు ఈ దశప్రాణాల కాలపరిమాణమే తాళం. దరువు వేయటం, చప్పట్లు కొట్టటం తాళాలే! తాళం యొక్క కాలాన్ని 'లయ' అంటారు. చేత్తో తాడిస్తూ వేసే తాళాన్ని 'చేతాళం' అని, నాట్యానికి వేసే తాళాన్ని గిరగిటలు(గిర్గటలు) అంటారు.

గాయకులు వేరొకరి సహకారం లేకుండానే తాళం వేసుకుంటూ పాడగలరు. కానీ వాద్యకళాకారులు, నర్తకులు స్వయంగా తాళం వేసుకునే అవకాశం ఉండదు. తాళం వేసేవారు లేనప్పుడు "దక్షిణేతాళధారీచ పార్శ్వ ద్వంద్వే మృదంగికః" సూత్రానుసారం మృదంగాన్ని అనుసరిస్తారు. నర్తకులకైతే "హస్తేనార్థం ప్రదర్శయేత్" సూత్రం ప్రకారం చేతులు ఆ గీతంలోని భావాన్ని ప్రదర్శిస్తాయి కాబట్టి, మృదంగ వాద్యాన్ని అనుసరించి పాదంతో తాళం వేయాలని 'సంగీతమార్తాండము' 'తాళాధ్యాయం'లో ఉంది.

పుచ్చా వెంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ఈ గ్రంథానికి వ్యాఖ్యానం వ్రాశారు. చేత్తో తాళం వేసేప్పుడు కలిగే శబ్దం కంటే పాదంతో తాళం వేసేప్పుడు ఎక్కువ శబ్దం పుడ్తుంది కాబట్టి, కాలికి గజ్జెలు కట్టుకోవాలన్నారు. తాళహీనుల గురించి ఈ గ్రంథం కఠినంగానే వ్రాసింది.

చేత్తో తాడిస్తూ వేసే తాళం, దాని గురించి చెప్పే తాళాధ్యాయం రెండూ అర్థవిపర్యయం చెంది, కొట్టడం అనే అర్థం వ్యాప్తిలోకి వచ్చింది. 'ఆంధ్రవాచస్పత్యం' తాళాధ్యయం అంటే తన్నటం, కొట్టటం అనే అర్థాలు కూడా ఇచ్చింది. "ఇవాళ ఈ పాఠం అప్పచెప్పకపోతే తాళాధ్యాయం తప్పదు" అంటే వీపు విమానం మోత మోగుతుందనటమే! తాళ అంటే తాడిచెట్టు. తాళాధ్యాయం అంటే తాటిమట్ట ప్రయోగం అని!

కన్యాశుల్కం నాటకంలో గిరీశం అగ్నిహోత్రావుధాన్లింట్లో కుదిరాక వెంకటేశంతో అంటాడు:

"యీవాళో పెద్ద పెళ్లి నీకు తల వెంట్రుకంత వాసి తప్పిపోయింది. యీ శలవులాఖర్లోగా తాళాధ్యాయం కాకుండా తప్పించుకుంటే నువ్ పూరా ప్రయోజకుడివే, యిహ నిజమైన పెళ్లా? యింత చదువూ చదువుకుని నీ తండ్రి కుదిర్చిన యేవీఁ యరగని చిన్న పిల్లకా పుస్తె కడతావ్? మాంచి యెఱ్ఱిగా బుఱ్ఱిగా వున్న యంగ్విడోని నువ్ పెళ్లాడకపోతే ఐ షుడ్బి యషేమ్డాఫ్యూ" అని! వెంకటేశం పరీక్షలో తప్పిన సంగతి కప్పెట్టి, పాసయ్యాడని బొంకి తాళాధ్యాయం తప్పించాడు గిరీశం.

బ్రౌన్ నిఘంటువు తాళం వెయ్యటం అనే పదానికి ఎగగొట్టడం, తప్పించుకోవటం అనే అర్థాలిచ్చింది. "ఆ సంగతికి మబ్బు తాళము వేసినాడు" అనే ఒక ప్రయోగాన్ని(He eluded or evaded the question) కూడా ఉదహరించాడు. వాడికి అప్పిచ్చావంటే ఆ డబ్బుకు మబ్బుతాళం వేసినట్టే లాంటి ప్రయోగాలున్నాయి. "వాడు మబ్బుతాళం వేశాడు" అంటే జంప్ జిలానీ అయ్యాడని అర్థం. అర్హుడికి మబ్బుతాళం వేయటం, రికమెండేషనుకు పెద్దపీటవేయటం సహజంగ జరిగే విషయాలే కదా!

కొందరు జీడిపాకోపన్యాసకులుంటారు. వాళ్లు ప్రసంగించేప్పుడు ప్రేక్షకులు లేదా శ్రోతలు చప్పట్లు కొట్టటం మొదలు పెట్టారంటే ఇంకచాలు బాబో...అని అన్వయార్థం. తెలుగు వ్యుత్పత్తి పదకోశం తాళాధ్యాయం = చప్పట్లు చరుస్తు గేలిచేయటం అంది!

"ఇనుప పెట్టిని చూచి యూటలూరుచు, కాగితపు కట్టలను 'లెక్కి0చు కొనుచు, రూపాయి దొంతరలను మోగించుకొనుచు వెట్టి కాపలా కాయుచు నితడు జీవయాత్ర గడుపుచుండును, ఇంతలో కొడుకులు తిరుగబడి తాళాధ్యాయముచేసి యతని కళ్లెదుటనే యావదాస్థిని తుడిచి వేసిరి" అంటూ ముదిగంటి జగ్గన్నశాస్త్రిగారు ఓ పీనాసివాడి కథ చెప్పారు. "త్యాగరాజులు శాశ్వతులు. కాని, భోగరాజులు కాదు" అంటారాయన. పిసినారి సొమ్ము నక్కలపాలు కాక తప్పదు. కొడుకులో, దొంగతత్తుకొడుకులో ఎవరో ఒకరొచ్చి తాళాధ్యాయమో, గట్టితాళమో వేస్తారు.

సంగీత నాట్యశాస్త్రాల పరమైన ఈ తాళాధ్యాయం, తాళం వేయటాలు చివరికి చావకొట్టి చెవులు మూయటంలోకి మారిపోయాయి. మొన్నటిదాకా ఈ పదాన్ని వ్యంగార్థంలో బాగా వాడేవారు కూడా! ఇటీవలి రచనల్లోగాని, వార్తాపత్రికల్లోగానీ ఈ పదం కనిపించట్లేదు.

లాకప్పులో పెట్టి పోలీసులు మూడో డిగ్రీ ప్రయోగించి నిజం చెప్పించారని వ్రాయటానికి "పోలీసుల తాళాధ్యాయంతో నిజం కక్కేశాడు" అనవచ్చు. ఫలానా పార్టీకి ప్రజలు తాళం వేశారంటే ఆ పార్టీని తిరస్కరించారని అర్థం. ఇక్కడ తాళంవేయటం అంటే locked అని కాదు, blocked అని! గిరగిటలు (పాదతాళాలు) పడతాయన్నమాట. చాచి తంతారు జనం అనదగిన సందర్భంలో తాళాధ్యాయం జరగ్గలదని హెచ్చరించవచ్చు.

"చప్పట్లోయ్ తాళాలోయ్...దేవుడి గుడిలో బాజాలోయ్" అని బాలల గేయంలో చెప్పినట్టు, ఎన్నికల దాకా చప్పట్లే కొట్టినా, జనం ఎన్నికల రోజున తాళాలు వేస్తారు. ఓటరు దేవుడికి తెలుసు బాజా భజంత్రీల్ని ఎలా ఉపయోగించాలో!

అధికారం శాశ్వతం అనుకునేవారు పగ్గాలు తమ చేతుల్లో ఉన్నాయనుకుంటారు. కానీ, తాళాలు ప్రజల చేతుల్లోఉంటాయి!!



# గోరోజనం

**ఒ**కప్పటి ఆర్యుల జీవనం గోవుల చుట్టూనే తిరిగింది. గోకుడు, గోధనం, గోష్పాదం, గోపాల, గోపురం, గోమతి, గోరోజనం, గోదురు, గోధూళి, గోచరం, గోచారం, గోకర్ణం ఇలా దైనందిన జీవన వ్యవహారాలన్నింట్లోనూ గోవు ఉండేది. వీటిలో గోరోజనానికి వాడకం ఎక్కువ.

ఆవు కాలేయం పైన గాల్‌బ్లాడరు (పిత్తాశయం) చిన్న సంచీలా ఉంటుంది.. దాన్ని ఎండబెడితే లోపల ఉండే పైత్యరసం (bile) ఎండి గోరోజనం అనే పలుకులుగా అవుతుంది. ఇది  పింగళ లేదా కపిలవర్ణంలో అంటే, పసుపు ఎరుపు నీలం కలిసిన ఇటుకరాయి రంగులో మెరుస్తూ ఉంటుంది. లివర్ జబ్బుల్లోనూ, జీర్ణకోశవ్యాధుల్లోనూ పనిచేసే ఔషధం. కామెర్ల మందుల్లో బాగా వాడతారు.

"గోవును చంపి గోరోజనం రోగుల కిచ్చినట్లు" అనే సామెత ఉంది. గోరోజనం కోసం గోవుని చంపవద్దని అంతరార్థం. 'జోరీగల గొడ్డుకు గోరోజనం మెండు' అనే సామెత కూడా ఇలాంటిదే. జోరీగలు ముసిరాయంటే ఆ ఆవు కాలం చేసిందని లెక్క. అది మరణించినా దాని గోరోజనం విలువైనదే కదా!

ఈ మరణానంతర ప్రయోజనాలు ఇతర జంతువులకూ ఉంటాయి. కానీ, ఆవు గోరోజనానికి ఔషధపరంగా విలువెక్కువ. గోరోజనం దాని గర్వానికి హేతువు.

గోరోజన వర్ణంలో ఉన్న కపిలగోవుని పుల్లావు అంటారు. "మొదవులలోనెల్లఁ గపిల మొదవు వరిష్ఠంబు" అంటూ, నన్నయగారు ఆదిపర్వంలో దానం ఇవ్వటానికి ఆవుల్లోకెల్లా కపిలగోవు శ్రేష్ఠం అన్నాడు.

అందుకు ఓ కథ చెప్పారాయన. ఒకసారి దేవతలకు ఆకలేస్తే, బ్రహ్మగారు అమృతం ఇచ్చి త్రాగమన్నాడట. ఆ అమృతం వాసన లోంచి కామధేనువు, దాని సంతతిగా గోవులు ఏర్పడ్డాయి. ఒక లేగదూడ నెమరవేస్తుంటే దాని మూతిమీంచి నురుగు ఎగిరివెళ్ళి శివుడి పైన పడింది. శివుడు ఆగ్రహించి చూసే సరికి అక్కడున్న తెల్లని ఆవులన్నీ కపిలవర్ణంలోకి మారిపోయాయి.

ఇంతలో బ్రహ్మగారు వచ్చి 'చంద్రుడు అమృతం ఇచ్చినట్టు ఆవులూ పాలు ఇస్తాయి. కాబట్టి, వాటి దూడలు తాగిన పాలు కూడా అమృతాలే" అని నచ్చచెప్పాడట. శివుడు మెచ్చి, గోరోజన వర్ణంలో ఉన్న కపిలగోవులకు శ్రేష్ఠత్వాన్ని అనుగ్రహించాడు. అలా గోరోజనం శ్రేష్ఠతకు ప్రతీక అయ్యింది.

రోచస్సు అంటే కాంతి. గోరోచస్సే గోరోజనం అయ్యింది. "శ్రీగంధం చందనో పేతం। కస్తూరేణ సమన్వితం। గోరోజనంచ్చ కర్పూరం పంచద్రవ్యాణి నిక్షిపేత్" ఐదురకాల పూజాద్రవ్యాల్లో గోరోజనం కూడా ఒకటి!

"మెరుపులో గోరోజనం కలిపితే ఎలావుంటుంది రంగు... అదిగో అలా వున్నాయి హనుమంతుడికళ్ళు" అని హనుమతుడి తోకను భీముడు కదల్చలేకపోయిన సన్నివేశంలో శ్రీ పురిపండా అప్పలస్వామి వర్ణిస్తారు. అలా అతిశయాన్నీ, ఆత్మవిశ్వాసాన్నీ, మనోబలాన్నీ సూచించేందుకు గోరోజనం అనటం మొదలైంది.

"ఆ కాలంలో నాలో ఎక్కడలేని చొరవా, ఆఘాయిత్యమూ వుండేవి, ఎవరైనా నన్ను కొంచెం "ఆ" అన్నారంటే, చెయ్యెత్తి మాట్లాడే టంత గోరోజనం వుండేది. చివరికి హనుమంతరావు నాయుడు గారు కూడా నన్ను, అదిలించలేని స్థితి వచ్చేసింది" అని వ్రాసుకున్నారు 'నా జీవితయాత్ర'లో టంగుటూరి ప్రకాశం గారు. ఎవ్వరూ అదిలించలేనితనం 'గోరోజనం' అన్నమాట.

"ఎదుటివాడికన్న నేను గొప్పవాడిని! నా కొకడు చెప్పవచ్చేవాడా అనే సర్వజ్ఞత్వం, అంటే ఒక విధమైన గోరోజనం హక్కుభుక్తం చేసుకున్న మనుషులు అన్ని కాలాల్లోనూ ఉంటారు" అని కృష్ణాతీరం నవలలో శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి సర్వజ్ఞతని 'గోరోజనం' అన్నారు!

"ఈ చింతామణికి ఏరాడ కొండంత గోరోజనం. ఆ సావిత్తిరికి ఆరకు లోయంత ఏడుపు! దీని ఫలితం చూశావురా మామా" అని లతగారు 'మహానగరంలో స్త్రీ' నవలలొ ఆత్మవిశ్వాసం అనే అర్థంలొ ప్రయోగించారు.

"అంత గోరోజనం ఉంటే అప్పుకెందుకూ బయలు దేరటం?" అనే వాక్యంలో గోరోజనం ఆత్మగౌరవాన్ని ప్రతిబింబిస్తుంది.

'రారా పెళ్ళి చేస్తానూ అంటే యీడికి గోరోజనం యెక్కు వైనాది. యీడికి పెద్దపెళ్ళాం కావాలట" అని శ్రామికుడు కథలో శ్రీ బలివాడ కాంతారావు ఎదగాలనే తపనని గోరోజనం అన్నారు.

"వాడు మనకన్నా పదిమెట్లు పైనున్నా డన్నమాట. ఆ గీర, గోరోజనం వాడికుంది..." అని 'పణుకులవాగు' కథలో చా. సో. గారు వ్యక్తుల వ్యక్తిత్వాన్ని గోరోజనం అన్నారు.

ఎదుటివ్యక్తిలో గుణాత్మకతే గోరోజనం. దాన్ని మెచ్చనివాళ్లు గోరోజనం అంటారు. నచ్చినవాళ్లు దాన్నే ఆత్మగౌరవం అంటారు.



# అక్కలవాడ-అరకూడు

**ఆహార విహారములకో**
**యాహారంబునకునో విహారంబునకో**
**బేహారము మీ కీ సం**
**దేహారంభంబు మాకు దెలియగ వలయున్"**

ఓ సీనయ్య ఆదారినే వస్తున్న మరో దానయ్యని ఆపి, "పూటవంటకంబుల వృత్తాంతం " అడిగాడు. అంటే ఇప్పటి భాషలో చెప్పాలంటే దగ్గర్లో ఏదైనా భోజన హొటలుందా? అని! క్రీడాభిరామంలో చిత్రితమైన దృశ్యం ఇది. 800 యేళ్ల నాటి సంఘటన.

"ఆహారం కోసమా? విహారం కోసమా? లేక ఆహార విహారాలు రెండింటి కోసమా? నీసందేహారంభం నాకు తెలిస్తే కదా నీకు ఫలానా చోట అని చెప్పటానికి!" అని ఎదురు ప్రశ్నించాడు ఆ దానయ్య. 'భోజనం ఎక్కడ?' అనడిగితే వాడు భోజనం కావాలా? అమ్మాయిలు కావాలా? భోజనమూ, అమ్మాయిలూ రెండూ ఉన్నవి కావాలా? అని అన్నాడంటే వాడిగురించి వేరే చెప్పనవసరం లేదు. మొత్తం మీద బ్రోకరేజి అనేది ఆకాలం నాడే ఉందని, అప్పట్లో అన్నీ దొరికే సమాంతర వ్యవస్థ ఒకటి నడిచేదనీ అర్థం అవుతోంది.

కేవలం భోజనం మాత్రమే పెట్టేవీ, ఇతర వ్యవహారాలు ఉండేవీ, భోజనం, వ్యవహారం రెండూ దొరికేవీ ఇలా మూడు రకాల హొటళ్లు తమ కాలంలో ఉండేవని 21వ శతాబ్ది ప్రజలకు అర్థం కావటం కోసం క్రీడాభిరామకర్త కావాలని ఈ పద్యం వ్రాసినట్టు కనిపిస్తుంది. నీకు ఎలాంటి హొటలు కావాలో చెబితే కదా ఎక్కడుంటుందో నేను చెప్పడానికి అనడుగుతున్నాడా ఆగంతకుడు.

ఆ వ్యక్తిని చూడగానే మొత్తం స్కానింగ్ చేసినట్టు అతని గురించి అర్థం అయిపోయింది మన సీనయ్యగారు "వీడిదె తెల్లనాకులను వీడెము సేయుచు వీథి వచ్చుచు/న్నాడు మదించి తిండి తినినాడు చుమీ" అని ఆ దానయ్య తత్త్వాని

స్కానింగ్ చెయ్యసాగాడు. నాణ్యమైన విడెము కావాలంటే ముదురు ఆకుపచ్చ రంగులో కొంచెం నల్లగా ఉన్న ఆకులు కావాలి. వీడు తెల్లనాకుతో తాంబూలం వేసుకున్నవాడిలా కనిపించాడట. అంటే పరమ దిక్కుమాలిన వాడని భావార్థం. మదించి తిని, ఏ జారస్త్రీనో తేరగా అనుభవించి వస్తున్న పరమ బేవార్సుగాడిలా ఉన్నాడని చూడంగానే అనిపించిందట. అరకూడు మెక్కేబాపతు మనుషులు ఇలా ఉంటారు.

ఆ కాలానికి కేవలం పూటకూడు అంటే డబ్బులు తీసుకుని భోజనం పెట్టే వ్యవస్థ మాత్రమే ఉండేది. క్రీడాభిరామంలోదే ఈ పద్యం ఇందుకు సాక్ష్యం ఇస్తోంది.

**"కప్పురభోగి వంటకము కమ్మని గోధుమపిండి వంటయున్**
**గుప్పెడు పంచదారయును క్రొత్తగ కాచిన యాలనే, పెసర**
**పప్పును, గొమ్మునల్లనటి పండ్లును, నాలుగునైదు నంజులున్**
**లప్పలతోడ క్రొంబెరుగు లక్ష్మణవర్ఝులయింట రూకకున్."** లక్ష్మణవర్ఝుల వారి పూటకూటి వ్యవస్థలో అంటే హెూటల్లో ఒక రూక చెల్లిస్తే ఇప్పటి బాసుమతి బియ్యం లాంటి నాణ్యమైన కప్పురభోగి బియ్యంతో వండిన అన్నం కమ్మని గోధుమపిండి వంటకాలు, గుప్పెడు పంచదార, తాజా నెయ్యి, పెసరపప్పు, ఒక అరటి పండు, నాలుగైదు రకాల పచ్చళ్లు, లప్పలు అనే ఒక రకం స్వీటు ఇన్ని వడ్డించేవాళ్లట.

క్రీడాభిరామం తరువాత 200 యేళ్లకు కృష్ణదేవరాయలవారి ఆముక్త మాల్యద వచ్చింది. రాయల కాలానికి విజయనగరంలో అక్కలవాడలు బాగా అభివృద్ధి చెందాయి. సుష్టుగా తద్దినం భోజనం చేసినా ఆకలి తీరక, అక్కలవాడకు పోయి అక్కడ అరకూడు తిన్న ఒకడి వర్ణన కనిపిస్తుంది. అరకూడు అంటే, ప్లేటు భోజనం.

19వ శతాబ్ది ఫ్రెంచి భాషలో రెస్టారర్ అనే పదం 'భోజనం కల్పించే చోటు' అనే అర్థంలో రూపుకట్టుకుంది. ఇంగ్లీషు వాళ్లు దాన్ని రెస్టరెంటుగా మార్చేశారు. కొంతమంది రెస్టు-రెంటు పదాలుగా విడదీసి, ప్రయాణ బడలిక

తీర్చేందుకు కొంత అద్దె తీసుకుని అక్కడే, అన్ని రకాలుగా ఉల్లాసాలూ దొరికే వ్యవస్థగా దాన్ని భావించారు.

రాజధాని నగరంలో దేశ విదేశాలనుండి ఎందరో ప్రముఖులు వచ్చి పోతుంటారు. కాబట్టి, వారికి సకల సదుపాయాలూ అక్కలవాడలో ఉండేవి. అక్కడ హాయిగా, సుఖంగా ఆనందంగా, తృప్తిగా విశ్రాంతి తీసుకునేవారు. అక్కలు అంటే, జాణలు అనే అర్థంలోనే అది అక్కలవాడ– అంటే, రెడ్'లైట్ ఏరియా అనే అర్థంలోకి పరిణమించింది. లక్ష్మణవర్ఘుల వారి భోజన హెూటల్లాంటి ఆనాటి గొప్ప వ్యవస్థ 200 యేళ్ల కాలంలో ఇలా అక్కలవాడగా భ్రష్టుపట్టింది.

అక్కలవాడలో అరకూడు మెక్కటానికి వేరే అర్థం కూడా ఉంది. ఒక జాణని రోజంతా తన ఆధీనంలో ఉంచుకున్నది ఫుల్ మీల్స్ అయితే, ఆ కాసేపు అయ్యాక పంపించేసేది అరకూడు. పూటకూళ్ళది పుణ్యమునకు జాలదు – అనే రాయలవారి వాక్యం15వ శతాబ్దినాటి అక్కలవాడల్లోని అకృత్యాలకు సాక్షి... "వండలేనక్కకు వలపులు బలుమెండు"సామెతలాగా!

ఆ రోజుల్లో విదేశీ యాత్రికులు, రాజ్యాధికారులు, వర్తకులు వృత్తి వ్యాపకాల మీద వచ్చినప్పుడు వారికి ఈ వ్యవస్థ అనేక రకాలుగా తోడ్పడేది. పెద్ద నగరాలలో 5 నక్షత్రాల సంస్కృతి అవసరం అని రాయలకాలానికే గుర్తించగలిగారు కాబట్టే అక్కడ అక్కలవాడలు వెలిశాయి. ఫ్రెంచివాడు దాన్ని ఆదర్శంగా తీసుకున్నాడు కూడా!

అక్షవాటిక అంటే జూదం ఆడే చోటు. అక్షవాడ అంటే మల్లయుద్ధం లేదా కుస్తీపోటీ జరిగే చోటు. అక్కడ ఇలాంటి సౌకర్యాల ఏర్పాటు కూడా ఉండేది కాబోలు. వాటికోసం అక్కడకు వెళ్లే వాళ్లు కూడా ఉండేవారు కామోసు. మనం ఇలాంటీ కుస్తీ పోటీలు, బహిరంగ వ్యభిచారం లాంటివి ఇంగ్లీషు సినిమాల్లో చూస్తుంటాం. అక్కలవాడలోనూ అదే సీను ఉండేదన్నమాట.

కన్నడంలో "అక్కఱ" అంటే అనురాగం. కానీ తెలుగులో ఇది 'అవసరం'గా మారింది. అక్కజణ గొను = ఆశించడం. అక్కఱ తీర్చు = కోర్కె తీర్చడం. అక్కఱ గత్తె = తీవ్రవాంఛ గల జాణ! అక్కఱగండడు – అవసరం తీరాక దులుపుకు పోయేవాడు. వీళ్ళంతా అక్కలవాడలో దర్శనం ఇస్తారు.

హరివంశంలో గౌరనకవి చెప్పిన అక్కరగండడు పెద్ద వడ్డీవ్యాపారి. నిర్దయుడు. కాబూలివాలా లాంటివాడు. గౌరన కవి శ్రీనాథుడి సమకాలికుడు. రాయలవారికన్నా 200 యేళ్ల ముందువాడు. ఆ అక్కఱ గండడికి అక్కలవాడలో పనేమిటంటే అవసరం తీరటానికి అప్పులిచ్చి ఆదుకునేవాడన్నమాట.

"అక్కజకు రాని చుట్టము" అనే సుమతి శతకం పద్యంలో "అక్కఱ" అంటే శుభత్కార్యమే! కానీ "అక్కఱ తీరాక అల్లుడుగతి" అనే సామెతలో అక్కఱకు కొంచెం లోతెక్కువే! ఆ శోభనం ఏదో జరిపించేస్తే అమ్మాయి మోజులో చెప్పుకింద తేలులా పడివుంటాడని అంతరార్థం!

విడిపోయేటప్పుడు చెల్లుచీటీలు రాసుకున్నట్లే, వివాహ సంబంధాలు కలుపుకునేటప్పుడు రాసుకునే నిశ్చయ పత్రాన్ని 'అక్కర చీటీ" అంటారు!

అకారకరభ అనే వనమూలిక వుంది. ఇది లైంగికోత్తేజాన్ని 'పెంపొందించేందుకు ఉపయోగపడ్తుంది. దీన్ని తెలుగులో 'అక్కఱకర్ర' (లేక) ''అక్కలకర్ర" అనడంలో తెలుగువారి కొంటెతనం తేలికగానే అర్థం అవుతోంది.

అక్క అమ్మతో సమానం. కానీ అమ్మలక్కల బూతులు తిట్టేప్పుడు అమ్మ గుర్తుకురాదు.



# ఎమ్డెన్



ఎమ్డెన్ యుద్ధనౌక

**1953** లో శ్రీ గణేష్ వాసుదేవ్ మావలాంకర్ మరణానంతరం లోక్‘సభ స్పీకర్ పదవికి శ్రీ మాడభూషి అనంతశయనం అయ్యంగార్ పేరును ప్రతిపాదించి ఏకగ్రీవంగా ఎన్నికయ్యేలా నెహ్రూ తోడ్పడ్డారు. మాడభూషివారు భారత లోకసభకు తొలి ఉపసభాపతి. తర్వాత సభాపతి అయ్యారు. బీహారు గవర్నరుగా కూడా పనిచేశారు. పదారణాల తెలుగువాడు. తిరుచానూరులో పుట్టాడు. తిరుపతి, మద్రాసుల్లో చదువుకున్నాడు. లెక్కలమాష్టారుగా, లాయరుగా చేసి, రాజకీయాల్లోకి వచ్చి సభాపతి స్థానానికి ఎదిగారు.

“సున్నితమయిన హాస్యంతో సభను అలరించేవారు. మాటల కెన్నడూ తడబడని వారి ‘వాగరి’కి ముగ్ధులయిన హెచ్. వి. కామత్, మాడభూషి వారిని “అనంతవచనం అయ్యంగార్” అనేవారు. నిమిషానికి 180 పదాలు చకచకా వరదలా వెలువడే వాగ్ధోరణికి చకితులయిన సభ్యులు వారిని ‘ఎమ్డెన్’ తో పోల్చేవారు” అని శ్రీ కోసూరి హనుమంతు ‘తిరుపతి పట్టణ ప్రముఖులు’ గ్రంథంలో వ్రాశారు.

**ఎమ్డెన్ అంటే?**

మా చిన్ననాటి వరకూ అంటే షుమారుగా 1970ల వరకూ చురుకైన వాళ్లని "గొప్పగా చేశావురా...ఎమ్డెన్ లాగా" లాంటి ప్రశంసల్తో ఈ పదాన్ని బాగా వాడేవాళ్లు. ఎమ్డెన్ లాంటి వాడంటే ఆషామాషీ రకమో, కంకురుకుంకో కాదని అర్థం.

ఎమ్డెన్ అనేది ఒక జర్మనీ యుద్ధనౌక. తూర్పుహంస (swan of the east) అని దీని ముద్దుపేరు. వాయువ్య జెర్మనీలో ఏమ్స్ నదికి సమీపాన ఎమ్డెన్ పారిశ్రామికనగరం ఉంది. ఓక్స్ వాగేన్ కంపెనీ అక్కడిదే! మొదటి ప్రపంచ యుద్ధం కోసం ఇక్కడ తయారైన యుద్ధ నౌకకు ఎస్ ఎమ్ ఎస్ ఎమ్డెన్ అనిపేరుపెట్టి, 28 జులై, 1914న మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభం కాగానే రహస్యంగా సముద్రంలోకి వదిలారు. కెప్టెన్ కార్ల్ వాన్ మూల్లర్ అనే దయాహీనుడు దీని కెప్టెను. సముద్రంలో శత్రునౌక ఏదీ లేకుండా చేయటం ఎమ్డెన్ కర్తవ్యం.

ఎమ్డెన్ అనేది ఒకటి ఉందని ప్రపంచ దేశాలు తెలుసుకునే సరికే,మొదటి 3 నెలలలోపే అది శత్రువుల 20నౌకల్ని ముంచేసింది. 22 ఫిరంగుల్తో దూసుకొచ్చి శత్రునౌకల పైన, నౌకాస్థావరాల పైన నిప్పులు కురిపించేది.

ఆనాడు జర్మనీ, ఆస్ట్రియా హంగరీ, టర్కీలకు వ్యతిరేంగా జట్టు కట్టిన మిత్రదేశాల కూటమిలో ఫ్రాన్స్, బ్రిటన్, రష్యా, ఇటలీ, జపానూ ఉన్నాయి. బ్రిటన్ మనల్ని పాలిస్తోంది కాబట్టి మనం కూడా జెర్మనీ శత్రువులయ్యాం.

**మద్రాస్ హార్బర్'పై దాడి**

యుద్ధ వ్యూహాలన్నీ మధ్య ఆసియా, యూరోపులకు మాత్రమే పరిమితంగా ఉన్నాయి. భారతదేశం వైపు దాడి ఊహే ఎవరికీ లేదు. మద్రాస్ హార్బర్ కాపలాదారు ల్లేకుండా హాయిగా నిద్రపోతోంది.

1914 సెప్టెంబర్ 22 అర్ధరాత్రి అది రాజహంసలాగా బంగాళాఖాతంలోకి నిశ్శబ్దంగా వచ్చి, మద్రాస్ హార్బర్ వైపు దూసుకొచ్చింది. 125 మిలియన్ టన్నుల కిరోసిన్ నిండి ఉన్న బర్మా ఆయిల్ కంపెనీ టాంకర్లమీద ఎడాపెడా నిప్పులు కురిపించింది. హార్బర్ దాటి ఊళ్లో జనావాసాల మీద కూడా గుళ్లు వచ్చి పడసాగాయి. మద్రాస్ హైకోర్టు క్కూడా ఫిరంగి గుళ్ళు తగిలాయి. ఊరు ఊరంతా

భయభ్రాంతులకు లోనయ్యింది. జనం హాహాకారలు చేస్తూ సముద్రానికి దూరంగా పరువులెత్తారు. అదొక బీభత్స భయానక అనుభవం.

ఎమ్డెన్ మద్రాస్ మీదకొచ్చి 110 యేళ్లు గడుస్తున్నాయి. ఇప్పటికీ ఆ పీడకలని తమిళులు, మళయాళీలు మరిచిపోలేదు.

ఎమ్డెన్ అంటే వారి దృష్టిలో యమదూత అని! "యమ అండన్" అని వాళ్లు దాన్ని ఇప్పటికీ పిలుస్తారట.



*మద్రాస్ హార్బర్ పైన తగలబడ్తున్న బర్మా ఆయిల్ టాంకులు*

9 నవంబర్ 1914న ఒక రష్యన్ ప్రయాణీకుల నౌకని, ఒక ఫ్రెంచి వారి పడవని ముంచేసి ఎమ్డెన్ విజయగర్వంలో ఉంది. దాని విషపు చూపు కోకోన్ ద్వీపం దగ్గరున్న ఆస్ట్రేలియా వారి సిడ్నీ నౌకమీద పడి అటువైపుకు ప్రయాణం దౌడు తీసింది. నవంబర్ 23న బ్రిటిష్ ప్రభుత్వం అధికారికంగా ఎమ్డెన్ నౌకని కూల్చిన తీరుని వివరిస్తూ విడుదలచేసిన కథనాన్ని ఆంధ్రపత్రిక ప్రచురించింది.

ఎమ్డెన్ నౌక కోకోను ద్వీపాన్ని సమీపిస్తోందని నవంబరు 9 ఉదయం 7 గంటలకి తీగలేని టెల్లిగ్రాం ద్వారా సిడ్నీనావకు బ్రిటన్ తెలిపింది. వెంటనే వేగంగా ఎమ్డెన్ వైపు సిడ్నీ దూసుకువెళ్లింది. 9 గంటల 40 నిమిషాలకు ఎమ్డెన్

ఫిరంగుల్ని పేల్చటం మొదలు పెట్టింది. ఎమ్డెను ఫిరంగి గుండ్లు సుమారు 6 మైళ్ల దూరంలో ఉన్న సిడ్నీనావ మీద గురిగా పడ్తున్నాయి. ఓడలో ఓ యంత్రం పగిలిపోయింది. సిడ్నీకూడా ఫిరంగులు పేల్చటం మొదలు పెట్టింది. ఎమ్డెన్ పొగగొట్టాలు మూడూ కూలిపోయాయి. ఎమ్డెను వెనుకవైపు అంటుకుని తగలబడసాగింది. నూరుగొడ్లను తిన్న రాబందులా ఎమ్డెన్ ఆత్మరక్షణలో పడి పక్కకు తప్పుకోవాలని చూసింది.

ఈ లోగా, ఎమ్డెను వెంట రాక్షసిబొగ్గును వేసికొని తిరుగుతూ ఉండే బురెస్కు అనే స్టీమర్ అక్కడకొచ్చింది. సిడ్నీ వేసిన రెండు ఫిరంగి గుండ్లకు ఈ స్టీమరు కుప్పకూలింది. మునిగిపోతున్న బురెస్కులో కళాసీల్ని తన ఓడలోకి తీసుకుపోయి సిడ్ని నావికులె రక్షించాల్సి వచ్చింది.

తప్పుకుపోవాలని చూసిన ఎమ్డెన్ లోతులేని ప్రాంతంలోకి పోయి ఇసుకలో ఇరుక్కుంది. అయినా సిడ్నీ మీద ఎదురుదాడి ఆపలేదు. శక్తిమేర అది పోరదుతూనె ఉంది. సాయంత్రం నాలుగున్నరకు ఎమ్డెన్ని నీట ముంచివేసే కార్యక్రమం చేపట్టిన సిడ్నీ నావకు పూర్తి విజయం సాధించటానికి 4-35 లు పట్టింది. శృంగభంగం తప్పలేదు ఎమ్డెన్ నావకి! అలా ముగిసింది ఎమ్డెన్ కథ.

చడీ చప్పుడూ లేకుండా వచ్చి కావాల్సిన పని సాధించుకునిపోయేవాణ్ణి ఎమ్డెన్ అని తెలుగువాళ్లు వ్యవహరించారు. క్రమేణా జనవ్యవహారంలో ఈ పదం అద్భుతానికి పర్యాయపదం అయ్యింది. ఒకప్పుడు జనం బాగానే ఈ పదాన్ని వాడారు. కానీ, రచయితలు రచనల్లో ప్రజలభాషను ప్రతిబింబించకపోవటం వలన, నిఘంటు కర్తలు పట్టించుకోకపోవటం వలన తెలుగు భాషలో ప్రవేశించిన ఈ పదం నిలవకుండా వెలిసిపోయింది. పరభాషాపదమైనా, తెలుగులో ఒకప్పుడు రాణించిన ఇది తిరిగి వాడకంలోకి తేదగినదే!

కత్తిలా ఉంది, అదిరింది, సోపు, మస్త్ మస్త్ లాంటి అతిశయోక్తులకు బదులుగా ఎమ్డెన్ చక్కగా అతికినట్టు సరిపోయే పదం!



# పత్తిత్తులు

**“నేను లల్లని! తెల్లగా విచ్చుకున్న పత్తిపువ్వుని!**
**దూది వలిచేవాడు వచ్చి నన్ను బాది దుమ్ము దులుపుతాడు**
**నూలుగా వడికే ఆవిడ కదురు మీద దారంలా పేనుతుంది**
**నేత నేస్తం మగ్గాని కెక్కించి బట్టగా నేస్తాడు**
**ఆ పైన బండకేసి బాది దయలేకుండా నన్ను ఉతుకుతారు**
**దర్జీ వచ్చి కత్తిరించి సూదులు గుచ్చి చొక్కా కుడతాడు**
**దర్జాగా ఎవడో దాన్ని తొడుక్కు తిరుగుతాడు**
**ఇన్ని బాధలు నేను భరిస్తేనే ఇంత కుదిరింది...**
**ఆ వేలుపు నన్ను కలుపుకోవాలంటే ఇన్నీ తప్పవు కదా!”**

9-10 శతాబ్దాలనాటి కాశ్మీరీ కవయిత్రి లల్లేశ్వరి వాక్కులివి! కాశ్మీరులో శాంతిప్రియులైన హిందూ ముస్లింలు సమానంగా ఆరాధించే శైవ కవయిత్రి లల్ల. లాల్ దేద్, లల్ల ఆయీ, లల్లతల్లీ ఇలా పిలుస్తారామెని. లల్లాయి పదాలు తెలుగునాట ప్రసిద్ధి. పత్తివిత్తు జీవనయానం స్వచ్ఛంగా, నిరాడంబరంగా, నిస్వార్థంగా సాగటాన్ని ఆమె ఈ వాక్కులో వివరించింది. లోకోపకారి కావటమే భగవంతుని చేరే మార్గం అంటుందామె! పత్తివిత్తు మొలకెత్తి, మొక్కగా ఎదిగి, పూలు పూస్తే, ఆ పూలు కాయలౌతాయి. కాయల్లోని పత్తితో బట్టలు నేస్తే, దర్జీ చొక్కా కుడితే, మనం బట్టకట్టి తిరుగుతున్నాం. ఇంత చేసినా పత్తివిత్తుకి కించిత్తు గర్వంలేదు. అదీ ‘పత్తిత్తు’ తనం అంటే! పత్తిత్తు అంటే పత్తివిత్తు అని! ఈ అందమైన పదాన్ని మనం వ్యంగ్యార్థంలో ప్రయోగిస్తున్నాం. అలాంటిదేమీ తెలీని విరాగి పత్తిత్తు.

‘మ్లేచ్ఛరాగం’ అనే కథలో భార్యాభర్తల సంయోగం తరువాత ఆమె రతిపారవశ్యంలో మైకంగా పడుకుంది. పిలిచినా పలకక పోయే సరికి చనిపోయిందని భయంతో ఆమె భర్త పరిగెత్తడాన్ని చూసి నవ్వుతున్నట్టున్నాయిట కొంచెం పగిలిన పత్తికాయలు. ‘ప్రత్తికాయ విధాన పగిలిన పెదవితో కొమరారె

ప్రత్తేరు కూలి పడుచు" పత్తిని ఏరేందుకు వచ్చిన కూలిపడుచు పగిలిన పత్తికాయలా నవ్వు పెదాలతో ఉందని విశ్వనాథవారు వర్ణిస్తారు. "...మడుల్లో చక్కగా విచ్చిన లోటాల్లాంటి పసుపు పచ్చని ప్రత్తిపూలు రామనాధాన్ని చూసి పగలబడి నవ్వాయి" అని రేగడి విత్తులు నవలలో చంద్రలత రాశారు. కళ్ళు విప్పారి చూస్తుంటే పత్తిగుడ్లేసుకొని చూస్తోన్నాడంటారు.

'పత్తిత్తు'లు పత్తి ఉత్పత్తికే కాదు, దాని ఆకులు, పూలు, గింజలు, వేళ్లు కూడా ఔషధ ప్రయోజనం కలిగినవే! లేత పత్తి ఆకులతో కూర వండుకుంటారు. గింజలతో టీ కాచుకుంటారు. పత్తిగింజలు, పత్తి ఆకుల టీ 'గ్రీన్ టీ' లలో ఉత్తమమైంది కూడా! పత్తి కాయల్లో పత్తిని అంటుకుని గింజలుంటాయి. ఈ పత్తిగింజల్ని వేయించి వలిస్తే లోపల తెల్లటి పప్పు ఉంటుంది. ఇది చలవ చేస్తుంది. వాంతివికారాల్ని, రక్తంతో కూడిన జిగట విరేచనాల్ని తగ్గిస్తుంది. గుండెల్లో మంట, నొప్పి ఉబ్బసం, దగ్గు, విషదోషాల్ని హరిస్తాయి. 'సిద్ధమకరధ్వజం' అనే ఆయుర్వేద ఔషధం తయారు చేసేప్పుడు ఆ ఔషధాన్ని పత్తిగింజల్తో నూరి పుటం పెడతారు. కఠిన లోహాలు, పాషాణాల్లో ఉండే దోషాలను పత్తిగింజలు హరిస్తాయి. పత్తిగింజల పప్పుని దంచి పాలలోకలిపి రోజూ బాలింతలకు ఇస్తే తల్లిపాలు పెరుగుతాయి. గుండెజబ్బులకు మంచిది కాబట్టి దీన్ని 'హృద్బలకారిణి' అన్నారు. రక్తాన్ని పలచబరచే యాస్పిరిన్ లాంటి ఔషధాలతోపాటు దీన్నీ వాడుకోవచ్చు.

పక్షవాతం, నడుంనొప్పి, మెడనొప్పి, కీళ్లనొప్పుల్లో పత్తివిత్తులతో చేసిన "కార్పాసస్త్యాది తైలం" మర్దన చేస్తారు. లేత పత్తికాయలు, ఆకుల్ని సన్నగా తరిగి, నీళ్లలో ఉడికించి చేత్తో గట్టిగా పిండి తాలింపు పెట్టి కొద్దిగా చింతపండు రసం కలిపి పులుసు కూరగా వండిన ఇగురుకూర జీర్ణకోశ వ్యవస్థను బలసంపన్నం చేస్తుంది. ఆకలిని, అరిగించుకునే శక్తినీ పెంచుతుందని క్షేమశర్మ క్షేమకుతూహలం పాకశాస్త్ర గ్రంథంలో పేర్కొన్నాడు. పత్తిలాగే లోకోపకారకాల్ని సద్వినియోగపరుస్తూ, 'శ్రీపత్తిత్తు'(శ్రీ 420)లకు దూరంగా మనగలగాలి.



# ధగిడిసమ్మె

‘**బం**డగులాములు యాచక/తడంబుల కియ్యలేరు తము చండించే ముండల కిత్తురు ధగిడీ/గండలు మరి కుందవరపు కవి చౌడప్ప...’ అంటూ వెలయాంద్ర కోసం ఎంతైనా ఖర్చుపెడతారుగాని, బిచ్చగాడికి పట్టెడన్నంపెట్టని ధగిడీల గురించి కవి చౌడప్ప వ్రాశాడు. ఇక్కడ ధగిడీ అంటే విటుడు అని! చౌడప్ప క్రీ. శ. 1580 నాటి కవి. తంజావూరు వాడు. షుమారుగా 5-6 వందల యేళ్ళనుండీ ఈ ధగిడీ అనే తిట్టు మన వ్యవహారంలో ఉందని దీన్ని బట్టి గ్రహించవచ్చు.

“దాతను వాజులు జెరివే దబ్బిలి తలమీదనె సొడ్డుచెయ్యి” అనే పల్లవితో సారంగపాణి పదాలలో ఓ గమ్మత్తయిన పాట ఉంది.

**“ధాతువ తెలియని వైద్యముజేసే ధగిడి కొక సొడ్డు**
**గట్టిగ పనిలేకను పొరుగిండ్లకు తిరిగే పణతికి వక సొడ్డు**
**చెప్పిన మనవులు భూపతి కెరుగించని దుర్మంత్రికి వక సొడ్డు**
**గట్టిగ కలిగియుండి పొట్టకు దినజాలని కఠినుని కొకసొడ్డు**
**తన వెలదిని పరపురుషుల తార్చే మగ వెధవకు వకసొడ్డు**
**గట్టిగ లంచము దిని పనులు చక్కసేయని లండికి వక సొడ్డుమాట”** ఇలా సాగుతుందీ పదం. తెలిసి తెలీని వైద్యం చేసే ధగిడిక్కూడా

సొడ్డు వేస్తున్నాడీ సారంగపాణి కవి. ఇక్కడ ధగిడీ అంటే అసంపూర్ణప్రజ్ఞావంతుడనే అర్థం కనిపిస్తోంది. ఈయన చౌడప్పగారికన్నా 100 యేళ్ల తరువాతి వాడు. క్రీ.శ.1680 నాటి వాడని భావిస్తారు. “ధర్మకార్యముల కడ్డము బలికే దబ్బిలి దొక బ్రతుకా?” అంటూ దబ్బిలి అనే మరో తిట్టుపదాన్ని కూడా సారంగపాణిగారే దగాకోరు అనే అర్థంలో ప్రయోగించాడు.

సముఖం వెంకట కృష్ణప్పనాయకుడు తన అహల్యా సంక్రందనం కావ్యంలో కుబేరుడి కొడుక్కీ, చంద్రుడికీ మధ్య వివాదాన్ని వర్ణిస్తూ, ధగిడీ పదాన్ని నీచుడనే అర్థంలో ప్రయోగించాడు. సముఖం వారు మధురనాయక రాజుల కాలంలో

చొక్కనాథుడి దళవాయి. షుమారుగా 1660 ప్రాంతంవాడు.

సుల్తాన్ల ఏలుబడిలో ఉన్న ఆంధ్రప్రాంతంలో సైనికాధికారులు ప్రజల్ని పశువులకన్నా హీనంగా చూస్తూ, కించపరుస్తూ ధగిడీ లాంటి పదాలను ఊతపదాలుగా వాడుతూ నోరు పారేసుకునేవాళ్లు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరించిన వెంకటేశ్వర లఘుకృతులు గ్రంథం (కవి పేరు తెలీదు)లో ఒక పద్యం ఆనాటి పరిస్థితికి అద్దం పడ్తుంది.

**"గరిమనరే గజూగోండూ యనకపోరు**
**భువి నెట్టి యాచార్య పురుషునైన**
**సొలసి యనే భేటీచోదా యనకపోరు**
**'వెలపించి షట్ఛాస్త్ర వేత్తనైన**
**దర్పితులై యరే ధగిడీ యనకపోరు**
**కడు సోమయాజుల కొడుకునైన**
**మీఁటి యరే హారాంకోరా యనకపోరు బహువేదశాస్త్ర సంపన్ను నైన..."**

ఇలా ఆనాటి పాలకులు మహాపండితుల్ని, గురువుల్ని, షట్ఛాస్త్ర వేత్తల్ని, బహువేద శాస్త్రసంపన్నుల్ని కూడా గజూగోండూ, భేటీచోదా, ధగిడీకే, హరాంకోరా... ఇలా 'అరె ఒరే' భాషలో నోటికొచ్చినట్టు మాట్లాడుతూ కించపరిచేవారని ఆ కవి ఈ పద్యంలో వాపోయాడు. తమని పాలించే ప్రభువులు తమని అవమానకరంగా చూస్తున్నారనే ఆవేదన ఆయన మాటల్లోవ్యక్తం అవుతోంది. మాటలు గాలికి పోతాయి, వాటికి సాక్ష్యాలు ఉండవనుకోకూడదు. ఎక్కడో ఒకచోట ఇలా గ్రంథస్థం అవుతాయి. చరిత్రకి నిలువెత్తు సాక్ష్యాలౌతాయి.

శ్రీపాద కృష్ణమూర్తి గారి బొబ్బిలి యుద్ధం నాటకంలో రంగారావు కుమారుని రక్షించబోయిన ఓ సేవకిని పట్టుకుని : "దొంగా ధగిడీ ఇద్ది దీన్కి పట్టీకొయ్య చాలా వుంది" అంటాడు. అదీ ఆనాటి పరిపాలకులు ప్రజలతో మాట్లాడిన తీరు. ఇప్పటికీ ఇలాంటి అవమానకరమైన భాషని కొందరు అధికారులు వదులుకున్నారనుకోలేము.

**"రామభజన శేయరా లమిడికా, నీ తామసమణచర ధగిడీ కా",**

"భాంచెతు నేనెంతో చెప్పిన, చంచలమడుగవు ఛీ...ఛూ...మనసా" లాంటి తత్త్వాలు హాస్యంకోసం రాసినవి కాదు. మనల్ని కించపరచిన ఆ ధూర్తుల ఈ తిట్టు పదాల్ని యద్దేవా చేయటానికే!

ధగడమియ్యా అంటే అసాధ్యుడు అనే మరో అర్థం ఉంది. 1980ల్లో అరుణ్ గాలీ అనే మాఫియా నాయకుడు 'డాడీ' పేరుతో మహారాష్ట్రలో ఒక వెలుగు వెలిగాడు. అతని కథని 2015లో దగాడీ చావల్ అనే హిందీ సినిమాగా తీశారు. గాడ్ ఫాదర్, నాయకర్'ల కోవకు చెందిన సినిమా ఇది. 2017లో 'డాడీ' పేరుతో ఇంకో సినిమాకూడా వచ్చింది. హిట్లర్, స్టాలిన్ పేర్లని ఉద్ధారకులుగా మన సినిమాల్లో చూపించినట్లే, మరాఠీవాళ్లు ధగడమియా పేరుతో ఆ నరహంతకుణ్ణి ఎదురులేని మనిషిగా చిత్రించారు.

'చమత్కార కవిత్వము' గ్రంథంలో "గాడేపల్లి వీరరాఘవశాస్త్రిగారు ధగిడీ భిక్షయే గాని, దైన్యభిక్ష యెప్పుడు ఎఱుగరు" అని మద్దులపల్లి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వ్రాశారు. ఇది చదవగానే ఒకింత ఆశ్చర్యం వేసింది. 'ధగిడీ భిక్ష' ఏమిటీ? పోరాడి సాధించింది లేదా ప్రతిభతో గెల్చుకుందనే అర్థంలో ఈ ప్రయోగం చేశారాయన. ఇలాంటి ప్రయోగాల్ని మనం చేజార్చుకోకూడదు.

సుల్తాన్ల కాలంలో ధగిడీ పదాన్ని మనల్ని కించపరిచేందుకు వాడినా, ఆ పదాన్ని దుష్టత్వంలోంచి శిష్ట్వానికి మార్చి, సత్తాచాటటం అనే అర్థంలో ప్రయోగించటం విశేషం. ఇలాంటి ప్రయోగాలు చాలా జరిగాయి:

1946 డిసెంబర్ 13న ఆంధ్రపత్రిక: "1500 రైల్వేపనివాండ్ల ధగిడీ సమ్మె" అని ఓ వార్త వ్రాసింది. ఉదయం 7 నుంచీ 9 వరకూ రైల్వే కార్మికులు మెరుపు సమ్మె చేసినట్టు ఈ వార్తలో ఉంది. ధగిడీ సమ్మె అనేది ఓ కొత్త ప్రయోగం.

1947 జూన్ 16 ఆంధ్రపత్రిక: పొగాకు ఫ్యాక్టరీలో కార్మికులు ధగిడీ సమ్మె చేశారని వార్త వ్రాసింది, ఫ్యాక్టరీ లోపలే రేయింబవళ్లు కార్మికులంతా ఉండిపోయి సమ్మె నిర్వహించినట్టు ఈ వార్త సారాంశం.

తొలిదశలో ధగిడీ అంటే కులట అనే అర్థంలో స్త్రీ వాచకంలోనే ఈ పదప్రయోగం ఎక్కువగా జరిగింది. పోటదుర్తి గొల్లకలాపంలో 'ధగిడీ' అనే పదం ముండ అనే తిట్టుగా కనిపిస్తుందని ఆచార్య యస్ వి జోగారావు వ్రాశారు.

ధగరి అంటే హిందీలో కులట! మరాఠీ భాషలో డగరా లేదా డగిరి అంటే బజారుస్త్రీ! తరువాతి కాలంలో రంకుమొగుడు (ఉపభర్త) అని పురుష వాచకంగా దీన్ని వాడటం మొదలు పెట్టారు. అన్యపురుషుడి వలన కలిగిన పిల్లల్ని ధగిడీలన్నారు.

కానీ, ఆధునికయుగంలో ఇదే పదం అర్థవిపరిణామం పొందింది. పట్టు విడవకుండా గట్టిగా ఎదిరించటానికి వాడటం విశేషం. నిరసన తెలియజేయటం అనే మన హక్కుని గుర్తు చేసేదిగా ఆంధ్రపత్రిక లాంటి స్వాతంత్రోద్యమ పత్రికలు దీన్ని మార్చగలిగాయి. భాష పరంగా ఇలాంటిమార్పులు అవసరమే!

తెలుగు వ్యుత్పత్తి కోశంలో ధగిడి పదానికి 'అడ్డంగా కూర్చోవటం' అనే అర్థం కూడా ఇచ్చారు. ధగిడీసమ్మె అనేది ధర్నా చేయటానికి తెలుగులో ప్రయోగించదగిన పదం. స్త్రీలనో పండితులనో కించపరిచే అర్థంలో ఒక తిట్టుగా కాకుండా ఇలా ఎదిరించే పదంగా వాడకంలోకి తేవటం గొప్ప. కొన్ని భాషా పదాల్ని గౌరవప్రదమైనవిగా మారిస్తేనే వాటి పరిరక్షణ సాధ్యం!

వ్యవసాయ చట్టాలను రద్దు చేయాలని డిల్లీలో రైతులు జరిపిన చారిత్రాత్మక ఆందోళన 'ధగిడిసమ్మె' అనే పదం సూటిగా సరిపోతుంది. ఏలికల్లో గాంధారితనం పెరిగినప్పుడు ప్రజల్లో ధగిడీతనం పెరక్క తప్పదు.



# పాచిపెత్తనం

సాగినంతకాలం నా అంతవాడు లేడంటూ సాగించుకునేది పెత్తనం! పెద్దతనం అనేమాట పెత్తనం అయ్యింది. పెద్దతనాన చేసేవి శుభాలే! కానీ, ఈ పెత్తనంలోంచి పెద్దతనం మాయమవటం వలన అది ప్రమాదకరం అయ్యింది. పెత్తనాలు అనేకం ఉన్నాయి. వాటిలో పాచిపెత్తనం ఒకటి. ప్రొద్దున నిద్రలేస్తూనే బయల్దేరి వాళ్లకి వీళ్లకీ పాచికబుర్లు చెప్తూ, ఇతరుల పనులు చెడగొడుతూ, వీరివి వారికీ వారివి వీరికీ చేరేస్తూ ఊరంతా చాంద్రాయణం తిరిగే సొల్లురాయుళ్లది పాచిపెత్తనం. 'పాచిపెత్తనం–పదిఘళ్యా' అని సామెత. పదిఘళ్య అంటే

పదింటి దాకా చేసే పనికిమాలిన పని పాచిపెత్తనం. ఇలాంటి పనికిరాని పెత్తనాలకు తెలుగువాళ్లు ఈ సడింపు పేర్లు ఎన్ని పెట్టారో చూడండి:

**మిట్ట పెత్తనం/ గట్టుపెత్తనం:** తాను శ్రమించకుండా శ్రమించేవాళ్లను అదమాయించేది.

**కర్రపెత్తనం:** దండనీతి. తెలివి తేటలు అవసరం లేని పెత్తనం. పోలీసు రాజ్యం, రాజ్యహింస, ప్రజాస్వామ్యం లేని పాలన.

**కాపెట్టు పెత్తనం:** ఆఫీసర్ గారి గది బైట కావలి ఉండే వాడి ఆమ్యామ్యా పెత్తనం.

**కారుబారు:** అసలు ఆఫీసరుకి బదులుగా తాత్కాలిక(acting) అధికారి చేసే పెత్తనం. హెూదా ఉంటుంది, కర్రపెత్తనం ఉంటుంది కానీ, ఏ నిర్ణయమూ స్వంతంగా తీసుకోలేని పెత్తనం. కార్బారు, ఖారుబారు అని కూడా పిలుస్తారు.

**గుడిపెత్తనం:** గుడి పవిత్రత కాపాడటం. గుడిమణియం. స్థానపత్యం అంటారు. స్థానపతులూ, స్థానాపత్యమూ లేని కాలం ఇది..

**గుడ్డిదర్బార్:** రాయబారిగా వచ్చిన కృష్ణణ్ణి బంధించిన సమయంలో ధృతరాష్ట్రుడు మేదినీవిభుడ(రాజు)నైనా తనకు పెత్తనం లేదు కాబట్టి, ఇందులో తన దోషం లేదంటాడు. గుడ్డిదర్బారు అలాంటిది. తిక్కరాజ్యం. అడ్డాదిడ్డి పాలన.

**ఆడపెత్తనం:** మాతృస్వామ్య వ్యవస్థకు ప్రతిరూపం. రాముడు రాజయితే పెత్తనం కౌసల్య చేతికి వెళ్తుందంటుంది మంధర.

**విధవ పెత్తనం:** ఇంట్లోమగదిక్కు లేకుండాపోవటం.

**పేను పెత్తనం:** పేనుకి పెత్తనం ఇస్తే తలంతా తెగకొరికిందని సామెత.

**డబ్బు పెత్తనం:** చేతిలో వెత్తం ఉన్నవాడిదే పెత్తనం. మనిషి అదుపులో ఉండాల్సిన ఉత్పత్తి ప్రక్రియ మనిషిపైన పెత్తనం చెయ్యటం.

**శ్రామికపెత్తనం:** కార్మికరాజ్యం అనే కల నెరవేరినప్పుడు సాధ్యం.

**ఇంటిపెత్తనం:** స్త్రీ మనుగడని తండ్రికి, భర్తకు, కొడుకుకి మనువు అప్పచెప్పాడు. దీన్ని పెత్తనం అని మనువ్యతిరేకవాదులు, అది బాధ్యత స్వీకరించటం అని మనువాదులు అంటారు.

**పిట్ట పెత్తనం:** పిల్లిపోరు పిల్లిపోరు పిట్ట తీర్చిందన్నట్టు ఇద్దరినీ కొట్టుకోనిస్తే ఉభయులూ నీరసించాక ఇద్దరి మీదా పెత్తనం చేయొచ్చనే ఆలోచన.

**చైనాపెత్తనం:** ప్రభుత్వాలను లోబరచుకుని నాణ్యత లేని సరుకులతో ప్రపంచ మార్కెట్టుని కబళించటం.

ఇంకా అగ్రరాజ్యాల పెత్తనం, కార్పోరేట్ల పెత్తనం, మాఫియాల పెత్తనం లాంటివి చాలా ఉన్నాయి. పెద్దతనం లేని పెత్తనాలివి. మరి,

మంచి పెత్తనాలే లేవా? ఉన్నాయి. స్టూడెంట్ యూనియన్ లీడర్ని తెలుగులో 'పెచ్చు' లేదా 'పెచ్చె' అంటారు. బడిలో పెత్తనం చేసే విద్యార్థి అని వ్యుత్పత్తి పదకోశం వ్రాసింది. 'పెచ్చు' పెరగాల్సిన వాడు కదా నాయకుడంటే!

విద్యార్థి సంఘాల ఎన్నికలు లేకపోవటంతో యువతలో పెచ్చెల్లేకుండా పోయారు. నాయకత్వ లక్షణాలు సంతరించుకునే అవకాశాల్లేవు. యువతకు దిశానిర్దేశం కోసం మనం ఏమీ చెయ్యట్లేదు.

కెరీర్ అంటే, విదేశాల్లో ఉద్యోగం చేయటమేననుకుంటున్నారు యువత. కెరీర్ అంటే జీవనప్రగతి. అది వృత్తి మాత్రమే కాదు, ప్రవృత్తి కూడా! బాధ్యతారాహిత్యం, విదేశీ వ్యామోహం, కుసంస్కారం, భాషాసంస్కృతుల తిరస్కారాలే గొప్పనుకుని, అపమార్గపు బాటలు పరుచు కొంటూంటే, ఊరక చూస్తూ భీష్మద్రోణాదులు చేసిన తప్పునే... మేధావులు చేసినట్టవుతుంది. మేధావులు పాచిపెత్తనం మానాలి!

# ఎండకన్ను

ఎండకన్నును నీడ కన్నెరుగకుండ/గరిమ నుండుదుఁదలపువ్వు గందకుండ
నెలఁత నన్నేలు చిరసుఖాన్వితుని జేసి/ నిన్ను నే ప్రొద్దుఁ దలమీఁద
నిలుపుకుందు

కూచిమంచి తిమ్మకవి శివలీలావిలాసము(1-132) కావ్యంలో సొగసైన పద్యం ఇది. ఎండకన్ను అంటే సూర్యుడు. నీడకన్ను అంటే చంద్రుడు తలపువ్వు అంటే నెలవంక. స్వామికి ఒక కన్ను సూర్యుడు. ఒక కన్ను చంద్రుడు. వీరి గతులు చెడకుండా గంగ తన నేలుకుంటే నెత్తిన పెట్టుకుని చూసుకుంటానని ఆమెకు వాగ్దానం చేస్తున్నాడు.

ఎండ కన్నెరుగ కుండా నీడ కన్నెరుగ కుండా అంటే శ్రమ తెలియకుండా అని అంతరార్థం. నిజానికి పెళ్లికొడుకులు చేసే 'నాతిచరామి' వాగ్దానం కన్నా ఎండకన్నెరుగ కుండా చూసుకుంటాననటం పెద్ద వాగ్దానం. నిన్ను వదిలి పెట్టననటానికి కష్టం తెలీకుండా చూసుకుంటాననటానికి తేడా లేదూ...?

"కష్టములు ఎండకన్నును నీడకన్నెఱుంగకున్న పుట్టుభోగికి" సారంగధర చరిత్రంలో ఈ ప్రయోగం ఎండకన్నెరుగకుండా జీవించటం పుట్టుభోగులకే సాధ్యం' అంటుంది. పుట్టుభోగులు బంగారుచెంచా నోట్లోపెట్టుకుని పుడతారు. వాళ్లకు శ్రమ తెలీదు. "ఎండకన్ను వానకన్నెఱుఁగని పురంధ్రులెల్ల అక్కురు వృద్ధుఁజూడ" అంటూ ఆశ్రమపర్వంలో తిక్కనగారు మొదటగా ఈ పదాన్ని ప్రయోగించాడు. ఎండకన్ను, వానకన్ను తెలియని పురంధ్రులు (హౌస్ వైఫులు అని ఇప్పటి కాలం వాడుక) ధృతరాష్ట్రుని చూడటానికి వచ్చారట.

"ఈ మహా జైత్రయాత్ర సంరంభాన్ని ఇనుమడింపజేస్తూ ఎండకన్నెరుగని సంపన్న కుంటుంబాలవారు, మధ్యతరగతి బాలబాలికలు, శ్రామికజనం కూడా ముస్తాబులై జై ఆంధ్ర బ్యాడ్జీలు ధరించి వస్తూ యిక్కడి బందరు ఏలూరు రోడ్లమధ్య ప్రాంతమంతా తిరణాలుగా మార్చి వేశారు"( జనవరి 1973-ఆంధ్రపత్రిక).

"ఎండకన్నెరుగని నా జనాభానంతా ఆ గోభీమృగాలకు వప్పగించి వూరుకోవలసిందేనా?" తెన్నేటి సూరి చంఘీజ్ ఖాన్.

"నెతి నెండకన్నును నీడకన్నెపుడు/నెఱుంగనివాఁడయ్యు నెలరాల నెండ"బీ కన్నియ తుది నెండకన్నును నీడకన్ను నెఱుఁగని కమ్మపూఁబోఁడి" అంటూ అన్నమయ్య అనేక పదాలలో ఎండకన్ను ఎరగకపోవటాన్ని సౌకుమార్యానికి గుర్తుగా వ్రాశాడు. వావిలికొలను సుబ్బారావుగారు 'వాల్మీకి రామాయణం'లో సాముగరిడీలతోనూ, వేటాడటాలతోను గట్టిపడిన దేహం కలవాడుగా శ్రీరాముణ్ణీ, ఎండకన్నెరుగకుండా పెరిగిన సుకుమారిగా సీతాదేవినీ వర్ణిస్తారు.

నిజానికి ఎండపొడ వానపొడ తెలీకుండా పెరిగితే మనిషి అర్థాయుష్కుడై పోతాడు. "ఎండకన్నెఱుఁగని యీ రాజచంద్రు డవని శాత్రవులకు నర్పించి పెక్కు గానలఁ ద్రిమ్మరి కాయంబు డస్సి" అని పల్నాటి వీరచరిత్రలో వర్ణన. ఎండకన్నెరుగని ఓరాజు శత్రువులకు రాజ్యాన్ని అప్పగించి దేశాలమీద పడి తిరిగి అలిసిపోయాడట. ఎండకన్నెరుగకపోతే రాజులకే కాదు బంట్లకు కూడా ఇదే గతి! ఎండకన్నెఱుఁగని యింద్రుని యిల్లాలు పలు పంచలను జాలిఁబడియె నేఁడు"కూడా ఇలాంటి వర్ణనే! పడకకుర్చీకి పరిమితం అయిన వేదాంతుల గురించి అయ్యో అనుకోవలసి వస్తుంది చివరికి.

ఎండకన్నెరుగకపోతే శరీరం పాలిపోతుంది. రక్తాది ధాతుపోషణ ఆగిపోతుంది ఎండతగిలితే ధాతుపుష్టి కలుగుతుంది.ఎండ వలన శరీరంలో చెడ్డ బాక్టీరియా నశిస్తుంది. వ్యాధినిరోధకశక్తి పెరుగుతుంది. ఎముక పదార్థం తయారౌతుంది. మానసిక ప్రశాంతత కలుగుతుంది. సూర్యుడు రాని రోజుని దుర్దినం అంటారు అందుకే! తెలుగువారు చంద్రుడు రాని రోజు అమావాస్యని కూడా దుర్దినం గానే భావిస్తారు.

ఈజీమనీ, క్రేజీ లైఫ్ తరహా ఆలోచనా విధానంలో బయటకు రావటమే ఎండకన్ను ఎరగటం అంటే! మనం ద్వేషించవల్సింది కష్టాన్నే గానీ శ్రమని కాదు. శ్రమైకజీవన సౌందర్యానికి సాటి ఏదీ లేదనే కదా మనం చిన్ననాటి నుండీ నేర్చుకున్న పాఠం.

వారం రోజుల ముసురు తరువాత సూర్యుడు కనిపిస్తే ఎండకన్నెరిగిన

మనసుకు పండగ అనిపిస్తుంది. "ఇవ్వాళే ఎండ కన్ను చూశాను" అంటే మంచాన పడి కోలుకున్నాను" అని చెప్పటం. ఎండకన్నెరుగ కుండా చూసుకుంటాననంటే ఐసియూలోపెడతానని కాదు కదా! ఎండమీద కన్నేయాల్సిందే! ఎండ తగాలాల్సిందే శరీరానికి.

నెల్సన్ మండేలాని రోబెన్ ద్వీపంలో కారాగారంలో బంధించి, 27 యేళ్ల తరువాత అంతర్జాతీయ ఒత్తిళ్ళకు తలొగ్గి ప్రిటోరియా ప్రభుత్వం విడుదలచేసింది. 27 యేళ్ళ తరువాత ఎండకన్నెరిగాడాయన.

లవకుశ సినిమాలో ఏనిమిషానికి ఏమి జరుగునో పాటలో కొసరాజు గారు **"ఎండకన్నెరుగని ఇల్లాలుకు ఎందుకో ఈ వనవాసాలు" అంటాడు.**

**"సీతగాలి వీచినప్పుడు లేత ఎండలా**
**ఎండకన్ను సోకినప్పుడు మంచు కొండలా**
**ఆదుకొనే వెచ్చని మమత**
**ఆవిరయ్యే చల్లని ఎడద**
**ఒకటే శృతి! ఒకటే లయ! ఒకటే స్వరము"** అనే వేటూరి వారి పాటలో ఎండకన్ను ఎంతచక్కగా అమరిందో చూడండి.

"ఎండకన్ను తెలియనీయని వృక్షమవుతుంది" అంటూ అమ్మ గురించి గొప్పభావ వ్యక్తీకరణ చేసింది కవయిత్రి జ్యోతి.

పదాలపైన పట్టు ఉంటేనే భాష బతుకుతుంది. అందమైన పదబంధాల్ని పారేసుకోవటం విజ్ఞత కాదు. వాడకపోవటం ఘనతా కాదు.



# ఉలుపాలు

**కొ**న్ని లోతైన అర్థాలుండే పదాలకు నిఘంటువులు స్థూలంగా భావం మాత్రమే చెప్తాయి. ఒకటి రెండు కవి ప్రయోగాలిస్తాయి. నిఘంటువుల్ని అలవాటుగా చదివే శ్రమ మనకు తక్కువ. సంస్కృతం నేర్పేప్పుడు "యస్య జ్ఞానగుణదయాసింధో" అంటూ మొదట అమరకోశాన్ని బట్టీయం పట్టిస్తారు. అంత శిక్ష(ణ)ను భరించలేని వాళ్లు "గోడ దూకితే అదే సందో" అని తప్పించుకోవాలని చూస్తారు. తెలుగులో భావపుష్టి కలిగిన చాలా మాటలు తెలీకుండానే రచన చేయటం, రచన చదవటం జరిగిపోతున్నాయి. తెలుగు నేర్వాల్సిన పని లేదనే భావన పెరిగింది. లోతైన పదబంధాల అవసరం తప్పిపోయింది. ఏ నుడినైనా వాడకపోతే ఆ మేరకు భాష మరణించినట్టే కదా!

**"పరిణయమౌట కేఁగుగతిఁ బౌరు లనేకులు వెంటరా శుభో**
**త్తరముగ నయ్యెడం గడలి తద్దయుఁ దాలిమి మీఱ ధర్మత**
**త్పరుఁడయి యందునందు నులుపాలు నృపాలు రొసంగఁగా నిరం**
**తరమును బుణ్యతీర్థములఁ దానములాడుచు నేఁగి, యవ్వలన్"** ఇది చేమకూర వేంకటకవి విజయవిలాసంలో

"ఉలుపాలు నృపాలు రొసంగఁగా" నృపాలురు (రాజులు) అర్జునుడికి ఉలుపాలు ఇచ్చుకున్నారని వ్రాశాడు. ఉలుపాలు అంటే కానుకలు. తపస్సుకి వెళ్లే అర్జునుడి వెంట సమస్త పరివారమూ, పురజనులూ ఒక పెళ్లి ఊరేగింపులాగా అనుసరించి వెడ్తుంటే, సామంతరాజులు దారిలో ఇచ్చే ఉలుపాల్ని అర్జునుడు స్వీకరిస్తూ వెళ్ళాడట. తపస్సుకు పోయేవాడికి కానుకలు దేనికి? ఒక సమ్రాట్టు ఆ దారిన పోయేప్పుడు సామంత ప్రభువులు ఆయనకు సమస్త గౌరవమర్యాదలూ చేసి, తమ విధేయతను చాటే ఉలుపాల్ని (కానుకలు) అందించటం సహజం. పైస్థాయిలోని వారు ఇంకా ఆ పైస్థాయిలోని వారికి బహుళ ప్రయోజనార్థం ఇచ్చే కానుకలివి. మామూలు జన్మదిన కానుకలు, వరుడి కట్నకానుకల్లాంటి చిన్నవిషయాలు 'ఉలుపాలు' అనదగినంతవి కావు.

నిజానికి, ఈ పదాన్ని మొదట ప్రయోగించినవాడు కృష్ణదేవరాయలు. “ఉలుపాల్పట్టిన యిండ్ల మజ్జన నృపార్హోదారభుక్తి క్రియో/ జ్జ్వలులై రే హరి కొల్వునన్” అని ఆముక్తమాల్యదలో పాండ్యరాజు రాజులకు తగిన భోజనం పెట్టే ఇళ్ళలో, అదీ తనకు ఉలుపాలు ఇచ్చిన వారి ఇండ్లలో పాండ్యరాజు భోజనం చేశాడంటారు ఈ పద్యంలో రాయలవారు. ఒక్కో సందర్భానికి ఒక్కో స్థాయి ఉంటుంది. ఎక్కువ స్థాయిని వర్ణించేందుకు ఆస్థాయి కలిగిన పదాలు వాడితేనే భావం నిండుగా ప్రతిబింబిస్తుంది.

రాచరిక వ్యవస్థ అయినా, భూస్వామ్య వ్యవస్థయినా, అస్పష్ట ప్రజాస్వామిక వ్యవస్థ అయినా అధికారంలో ఉన్నవారితో పనులు జరగాలంటే ఉలుపాలు తప్పనిపరిస్థితిలో నాటికీ నేటికీ మార్పు లేదు. కార్యార్థంగా, అక్రమంగా, రహస్యంగా ఇచ్చిన సొమ్ము లంచం. ఇంతకన్నా అత్యున్నత స్థాయిలో ఉన్న వ్యక్తులకు ఇచ్చేవి ఉలుపాలు. ఇంత నిండైన అర్థం ఇచ్చే పదం ఉండగా ‘ముడుపులు’ అనే భక్తికి సంబంధించిన పవిత్రమైన పదాన్ని అన్యాయంగా తెచ్చి ఇక్కడ ఇరికించి, లంచం అనీ, ఒక పని చేసిపెట్టినందుకు గాను ప్రతిఫలంగా ముట్టచెప్పే సొమ్ము అనీ అర్థాల్ని కిట్టించారు. అందమైన తెలుగు పదాల్ని మరిచిపోవటం వలన కలిగిన అపకారం ఇది.

ఒక పెద్ద కాంట్రాక్టు దక్కాలంటే అందులో సగంపాలు ఉలుపాలు కిందే ఖర్చవుతుంది. మిగతా సగంలో అసలు ఖర్చులు పోనూ మిగిలిందే కాంట్రాక్టరుకు దక్కుడు. ముత్యాలముగ్గు సినిమాలో కాంట్రాక్టరు “ఆనక మా సెగట్రీ మీతో మాట్లాడతాడండీ” అంటాడు. అంటే ఉలుపాలు ఆయన ద్వారా ఇవ్వటమో పుచ్చుకోవటమో జరుగుతాయన్నమాట.

ఉలుప లేదా ఉలుపా అనేది ఏకవచనం. వేదం వెంకటరాయశాస్త్రిగారు ఇది ‘ఉలుఫా’ అనే అన్యదేశ్య పదం అన్నారు. హిందీలో ‘ఉలఫతా’ అంటే స్నేహం, ప్రేమ అని అర్థం. ఉలూఫా దీనికి సంబంధించిన పదమే కావచ్చు. ఈ పదాన్ని తమిళ కవులు కూడా స్వీకరించారు. తమిళ లెక్సికాన్ “ఉలుప్పాయ్” అంటే presents of articles of food, fruits etc., furnished gratis to a great personage on a journey అని ఈ పదానికి అర్థాన్నిచ్చింది. తెలుగు తమిళ

రచయితలు దీన్ని తమతమ కావ్యాల్లో చక్కగా అతికినట్టు వాడుకున్నారు. కానీ, ఈ పదం తెలుగు ప్రజల నాలుకల మీదకు చేరలేదు.

ఊరిపెద్దల ఇంట శుభకార్యాలు జరిగేప్పుడు ఊరంతా వరుసగా తెచ్చి ఇచ్చిన చదివింపుల్ని ఒక పట్టీగా రాస్తారు. ఈ ఆచారాన్ని "ఉలుపాయ్ కట్టు" అని తమిళంలో పిలవటం ఉంది. ఇలాంటి కట్టు ఈనాటికీ మనకుంది. మైకు పెట్టి ఫలానావారు ఇంత ఇచ్చారని ప్రకటిస్తూ ఉంటారు కూడా! కానీ, 'ఉలుపాలకట్టు' అనే వ్యవహారంగా దీన్ని పిలిచినట్టు కనిపించదు.

ప్రభుత్వ పథకాలద్వారా ఇచ్చే కానుకలు ఉలుపాలు కావు. జరిగిన పనికో, జరగబోయే పనికో కృతజ్ఞతగా పెద్ద మొత్తం చెల్లింపులు జరిగిన కుంభకోణాలకు ఈ పదం వర్తిస్తుంది. "a favor for a favor" ని లాటిన్ భాషలో Quid pro quo అంటారు. భోఫోర్స్, లాక్ హీడ్, రాఫేల్ యుద్ధ విమానాల వివాదాలన్నింటి వెనకాల ఉలుపాలు పెద్ద మొత్తంలో చేతులు మారాయని ప్రతిపక్షాలు గగ్గోలు పెట్టాయి. "ఇస్తినమ్మ వాయినం, పుచ్చుకుంటినమ్మ వాయినం జరిగిందని స్పష్టమవుతున్నది" అన్నంత అర్థాన్ని "ఉలుపాలు అందాయి" అనే పదం ఇస్తోంది. ఇది ముడుపులు అనటం కన్నా స్పష్టమైన అర్థాన్ని ఇస్తోంది కూడా. ఉలుపాలిచ్చిన వాడికన్నా పుచ్చుకున్నవాడే ఎక్కువ నేరస్థుడు.సందర్భానికి తగిన పదాలను వెదికి వ్రాయటానికి మనం అలవాటు పడాలి. అంతే!



# కుళ్ళాయిగబ్బాయి

**మొ**ఘలాయీల రాజోచిత వేషధారణలో కొంత పర్షియన్/అరబ్బీ, కొంత బారతీయత కలగల్సి ఉండేవి. ఇప్పటి సూటూ బూటూ తరహా యూరోపియన్ వస్త్రధారణ పై మనకున్న మోజులాగే, విజయనగర రాజుల్లో కొందరు మొగలాయీల వస్త్రధారణనే అనుసరించేవాళ్లు. ఒకసారి శ్రీనాథుడు కర్ణాట రాజ్యాధీశుడైన ప్రౌఢదేవరాయుడి దర్శనార్థం వెళ్ళాడు. ఎంతకీ రాజదర్శనం కాలేదు. అక్కడికీ "కుల్లా యుంచితి గోక సుట్టితి మహా కూర్పాసనమున్ దొడ్గితిన్" అంటూ రాజుగారి దర్బారుకు డ్రస్ సిద్ధం చేసుకున్నాడట కూడా!

ఈ 'డ్రస్ కోడు'లో మూడు అంశాలున్నాయి: కుల్లా అంటే టోపీలా పెట్టుకునే తలపాగా ధరించాడు. కులాహ్ అనే పర్షియన్ పదానికి టోపీ అని అర్థం. పటురచితమకుటము.. రెండు జానలంత పొడవైనవీ, నెత్తికి నిండుగా, చెవులు, చెంపలు మూస్తూ, గొంతు క్రింద కట్టుకోవటానికి వీలుగా బొందులతో ఉండేవీ ఈ కుల్లాలు రెండు రకాలని సురవరం ప్రతాపరెడ్డి గారు ఆంధ్రుల సాంఘిక చరిత్రలో వ్రాశారు. 15వ శతాబ్ది నాటి తాళ్ళపాక చిన్నన్న ముదుత కుళాయి, కెంబట్టు కుళ్ళాయిల్ని ప్రస్తావించాడు.

రెండోది కోక చుట్టుకోవటం. అంటే లుంగీ లాగా పంచె కట్టుకోవటం. మూడోది మహాకూర్పాసం తొడగటం. కూర్పాసం మనదే! కాళిదాసు "మనోజ్ఞ కూర్పాసక పీడిత స్తనాః" అంటూ మనోజ్ఞమైన కూర్పాసాన్ని ధరించి దాని బిగువుకు పీడించబడిన ఆమె స్తనాలను వర్ణిస్తాడు. ఈ కూర్పాసాన్నే (an outer, upper garment, with or without sleeves) నెహ్రూ జాకెట్టు అని, మోడీ జాకెట్టు అనీ పిలుస్తున్నాం. కానీ, నిజానికిది కాళిదాసు జాకెట్టు. కాదంటే శ్రీనాథుడి జాకెట్టు. మహాకూర్పాసం అంటే, ఈ జాకెట్టుకి చేతులుండి మోకాళ్ల దాకా జారి, రత్నాలు, ముత్యాలు పొదిగినది కావచ్చు!

"నవపుష్పవనము నానామణుల్ గ్రుచ్చిన పచ్చపట్టుఁగ" అన్నట్టు చక్కగా మెరిసే కుర్తా, పైజమా వేసుకుని పైన కూర్పాసం తొడిగితే స్త్రీపురుషుల్లో రాజసం

తొణికిసలాడుతుంది. ఆ రోజుల్లో పురుషులు ఏ చొక్కా లేకుండానే కూర్పాసాన్ని ధరించేవాళ్లు. విజయాలు సాధించినప్పుడు రాజులు యోధుల్ని సత్కరించి, 'మేలు కుళ్ళాయి గబ్బాయి కొమ్మంచు నొసగి" (పరమయోగి విలాసము తాళ్ళపాక తిరువేంగళనాధుడు) నాణ్యమైన కుళ్ళాయిని, కబ్బాయిని బహుకరించేవారట.

**"తాళి చౌకట్లు కుళ్ళాయి తగు కబాయి**
**మీఱు వలువలు మేలికస్తూరితోడ**
**వక్కలాకులు పెట్టి సప్తాంగ మొసఁగి**
**మంత్రివర్యుని మన్నించె మనుజవరుఁడు"**, అని బాడాల రామకవి, కృష్ణకథా విపంచిలో ఈ రాజసత్కారాన్ని వర్ణిస్తాడు.

ఏ ప్రభుత్వమూ ఏ సంస్థా ఏ బిరుదు సత్కారాలూ ఇవ్వకుండానే ఇటీవలి కలాంలో కొందరు తమ పేర్లకు ముందు ఆచార్య అనీ, డాక్టర్ అని కళారత్న, కళాప్రపూర్ణ అని తగిలించుకోవటమో లేక ఏ మాయా విశ్వవిద్యాలయం నుండో కొనుక్కోవటమో చేసే వాళ్లు మన చుట్టూ చాలా మంది కనబడతారు. వీళ్లని "కుళ్ళాయిగబ్బాయి" గాళ్లంటే సరిగ్గా సరిపోతుంది.

అడిదము సూరకవి రామలింగేశ్వర శతకంలో "కోతికి జల్తారు కుళ్ళాయి యేటికి?" అంటాడు.

కాళికాంబ సప్తశతిలో పులికొండ సుబ్బాచారి: "కోతిమూక తలను కుళ్ళాయి పెట్టుట/కుక్క మాడుమీద కుంభమిడుట/ సహజగుణము మాన్ప సన్నద్ధ మగుటట్లె..." అని వ్రాసారు. ఈ కుళ్ళాయిగబ్బాయి గాళ్లకి నేరుగా తగుల్తాయి.

లేని ప్రతిభ చాటుకోవటం, అందుకోసం ఎక్కడలేని అతిశయోక్తులను ప్రేలటం చేస్తుంటే అవి కుళ్ళాయిగబ్బాయి మాటలు అవుతాయి. బైరూపులోడు, తుపాకీ రాముడు, పిట్టలదొర వీళ్లంతా ఈ కోవకి చెందిన వారే! "సోగ్గాడే చిన్ని నాయన!" పాటలో కట్టే తుపాకీ పట్టుకొని వచ్చి ఒక పిట్టనైనా కొట్టలేక కాలుజారి పడ్డవాడూ ఇలాంటివాడే!

బ్రిటన్ యువరాజు ప్రిన్స్ హ్యారీ "అఫ్ఘానిస్తాన్ యుద్ధంలో 25మంది తాలిబన్లను పిట్టల్ని కాల్చినట్టు కాల్చి చంపాను" అన్నందుకు ఆ దేశ రక్షణ

కార్యదర్శి బెన్‘వాలేస్ ఆయన్ని boasting వలన మన విలువ పెరగదని సున్నితంగా మందలించాడు. కుళ్ళాయిగబ్బాయి మాటలంటే అవి!

రాజకీయ నాయకులు ఒకరి నొకరు కుళ్ళాయిగబ్బాయి గాళ్ళనే విమర్శించుకుంటారు. నీ మాటలు పిట్టలదొర అంటే, నీ వేషాలు పిట్టలదొర అంటుంటారు. ప్రజలకూడా వాళ్ల గురించి అచ్చంగా అలానే అనుకుంటారని వీళ్లకు తెలీదు. బూతులు తిట్టే రాజకీయనాయకుడికి తన గురించి ప్రజలు ‘వీడోట్టి కుళ్ళాయిగబ్బాయిగాడు’ అనుకుంటున్నారని తెలిస్తే ఏమౌతాడు...???



# అహమహమిక

**కొం**దంత అర్థాన్ని ఒకే ఒక్క పదం ద్వారా చెప్పగలిగితే అది అణుశక్తితో సమానం. "అహమహమిక" అలాంటిది. ఎన్నో అర్థాలను తనలో ఇముడ్చుకుంది. అవసరం అయితే తనను తాను కుదించుకుని అంతకన్నా ఇంకా ఎక్కువ లోతైన అర్థాన్ని ఇస్తుంది కూడా!

అహమహమిక అనగానే వెంటనే నోరు తిరగక పోవచ్చు. "అహం+ అహం+ఇక" అనే సంస్కృత పదం ఇది. నేనంటే నేను అని పోటీపడటం అని స్థూలంగా దీని భావం. పోటీ అనేది మొదలయ్యాక అనేక విశేషాలు చోటుచేసుకుంటాయి. అందుకే, Egotism, boasting. Presumption, boldness, vigour ఇలా అనేక అర్థాలలో ఈ పదాన్ని కవులు ప్రయోగించారు. ఇది సంస్కృత పదం అయినప్పటికీ తెలుగు కవులు తెలుగు కావ్యాల్లో దీన్ని ఎక్కువగా వాడటానికి అది అల్పాక్షరాలలో అనల్పార్థాన్ని ఇవ్వటమే కారణం.

ఏపనిలోనైనా 'నేను ముందు నేను ముందు' అనే పోటీతత్త్వం గర్వం క్రిందకే వస్తుంది. కాబట్టి, అహమహమికని ఒక "కూడని లక్షణం"గా, negative impact కలిగినదిగా వేదాంతులు భావిస్తే, సంక్షేమం కోసం, సేవకోసం, శాంతి కోసం పోటీపడటం అవసరం అని శాంతివాదులు భావించారు.

**వ్యతిరేకార్థంలో అహమహమిక**

"భారత సంస్థానములు కొన్ని స్వతంత్రాధికారమునకై అహమహమిక జూపుచున్నవనుట కెంతేని సాక్ష్యముకలదని..." (1947 మార్చి 28 ఆంధ్రపత్రిక). స్వాతంత్ర్యం రాబోయే సమయంలో సంస్థానాధీశుల స్వార్థాన్ని ఈ వాక్యంలో అహమహమిక ఎండగడ్తోంది.

"అంతర్జాతీయ రాజకీయ రంగంలో స్పర్థలు, అహమహమికలు ప్రారంభమైనవి. ఇవి ఏ నిమిషాన విషమస్వరూపం దాలుస్తవో చెప్పటానికి శక్యంకాదు..." అని కొరియా యుద్ధం గురించి భారత రిపబ్లిక్ అధ్యక్షుడు డా॥ బాబూ రాజేంద్రప్రసాద్ (ఆంధ్రపత్రిక జూలై 8 1950) అన్నారు. దేశాలు

అహమహమికతో వ్యవహరిస్తే ప్రపంచ శాంతికి ముప్పు వస్తుందన్న బాబూజీ మాటలు ఈనాటికీ వర్తించేవే.

"రాష్ట్రములకు ద్రవ్యసహాయము కావలెనని చెప్పుటయందు అహమహమికలు చూపుట తప్ప రాష్ట్రీయమంత్రులు చేసిన దేమియును కనబడదు" అని ఆంధ్రపత్రిక 1937 మే 27 న వ్రాసింది. డిమాండ్ చేయటానికున్న అహమహమిక ఆ డిమాండుని సాధించటంలో లేదని దీని వ్యంగ్యం.

"పరస్పర విరుద్ధ మైన దృక్పథాలతోనూ, అధిపత్య విస్తరణను 'సాధించాలనే అహమహమికతోనూ ప్రారంభమైన ఈ సమావేశం జయప్రదమై ప్రపందానికి శాంతి లభిస్తుందనే ఆశే ఎక్కడా ద్యోతకం కావడం లేదు" (ఆంధ్రపత్రిక 1947 డిసెంబరు 3 సంపాదకీయం)

శ్రీ ఆర్వీయన్ సుందరంగారి లేఖకు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారిచ్చిన సమాధానం "అహమహమిక"తో యిచ్చినదే. శ్రీ సుందరం లేఖకు సాహిత్యంలో స్థానంలేదన్న వీరి లేఖ "పరిశోధనా పరమేశ్వరుల స్థాయిలో లేదని చెప్పడానికి చింతిన్నున్నాను." (లింగంపల్లి శ్రీరామచంద్ర వ్రాసిన ఉత్తరం-భారతి మార్చి 1979-కలగూర గంప).

"అప్పటి తెల్లబట్టలవాళ్ళ అహమహమిక ఆడంబరాలు వింతగా ఉండేవి" అని తన చిన్ననాటి వకీళ్ల గురించి సినారె పరిణతివాణి ప్రసంగంలో అన్నారు. ఆనాటి వకీళ్ల తత్వం అహమహమికతో ఉండేదని దీని భావం. అహం ప్రథమికా భాజం- కులం వలనో, అధికారం వలనో, ధనం వలనో, రూపం వలనో, విద్యాపాండిత్యాల వలనో కలిగే గర్వమే- "నేనే" అనే మాటని పలికిస్తుంది. ఇది అతిశయిస్తే నేనంటేనేనే అనిపిస్తుంది. అవి లేని వ్యక్తులు చిన్న చూపుకు గురౌతుంటారు.

"కామక్రోధాత్మకానా మహమహమిక యాప్రేంఖాతామాయ తానాం/త స్యాశ్వాసానిలానా మకురుత తరసా మార్గవిస్తారకృత్యమ్"

రాముడు శూర్పణఖను తిరస్కరించటంతో ఆమె కోపించి, అహమికగా నేను ముందంటే నేను ముందంటూ పోటిపడుతున్న తన గోళ్లతో సీతాదేవి మెడని గాయపరచబోతే, లక్ష్మణుడు ఆ రాక్షసి శ్వాస పీల్చుకోవటానికి ఏ ఇబ్బందీ లేకుండా

ఉండాలని దాని ముక్కు, చెవులు కోసి, గాలి నడిచే మార్గాన్ని వెడల్పుచేశాడట. శూర్పణఖకి అహమహమికతో సహకరించిన ఆమె దుష్టత్వం ఇందులోకనిపిస్తుంది.

**అనుకూలార్థంలో అహమహమిక**

పురాణం కుమార రాఘవశాస్త్రి "పచ్చతోరణం"కథలో, "ఆ ఇరువురి విడదీయరాని ఏకత్వంలోనే అహమహమికలు పోయే మధురాతి మధురమైన రెండు శక్తుల ప్రణయస్పర్థ..." అన్నారు. ప్రణయ సమయంలో ప్రేమికులు అహమహమికతో వ్యవహరించారంటే మంచి రసపట్టులో ఉన్నారని!

సూతులలో ప్రతి ఒక్కరు. తాము రథాన్ని తోలతామని అహమహమికలు పడినట్టు హరివంశము సాందీపనిపర్వంలో వర్ణన.

భారతీయులు సంపూర్ణ ఐక్యతతో కల్పితములగు వివాద కారణములను తొలగించిన యెడల, "అప్పుడు నాలోవున్న నాదం ఉబకలాడుతుంది. తబకలు కొడుతుంది, నాలోవున్న గొప్ప శక్తులు మహత్వ పూర్ణాలై ముందుకు వస్తాయి. అహమహమిక చెందుతాయి...." (నా జీవితము-నా సంగీతముఃపండిత రవిశంకర్ ఆత్మకథ- ఆంధ్రపత్రిక జనవరి 9, 1972).

"బ్రహ్మ, విష్ణు, మహేంద్ర దైవతగణమ్ము అహమహమిక ప్రణామమ్ము లాచరింప" (నిత్యసౌందర్యలహరి జంధ్యాల వెంకటేశ్వర్లు).

"కావ్యసామాన్యంలో అంతటా అఖండంగా అనుస్యూతమవుతూ ఉన్న అత్మశక్తి అహమహమిక తో కూడుకొన్నప్పుడే..." (సాహిత్యాస్వాదము-జమ్ములమడక మాధవరామశర్మ ఫిబ్రవరి 1939 ప్రబుద్ధాంధ్ర).

**"భూలోకపు సరిహద్దులు**
**కుంచించుకు పోతూంటే**
**అంతర్గ్రహ యాత్రలకై**
**అహమహమిక పెరుగుతోంది"** ('సామ్యవాది మానిఫెస్టో'-.శ్రీశ్రీ)

ఇలా అహమహమికని మహాశక్తివంతమైన లక్షణంగా ఈ కవులు ప్రయోగించటాన్ని మనం గమనించవచ్చు.



# శషభిషలు

**కొ**న్ని పదాలు పాతబడి వెలిసిపోతాయి. శషభిష కూడా అలాంటిదే! ఒకప్పుడు కవులు అలవోకగా వాడిన ఈ పదం ప్రస్తుతం వాడకంలోంచి తప్పుకుంది. శ, ష, భ వర్ణాల్నిబట్టి ఇది సంస్కృత పదం అనే భావన ఇందుకు ఓ కారణం కావచ్చు. కానీ, సంస్కృత నిఘంటువుల్లో ఈ పదమే కనిపించదు.

"శషభిష లంతగా సలుపఁజాలవు నీవు హలాయుధుం డకల్మష హృదయుండెయైన..." పాండవాశ్వమేధంలో తిరుపతి వేంకట కవుల ఈ ప్రయోగాన్ని ఉదహరించి, 'పదబంధ పారిజాతం' నిఘంటువు "ధూం ధాం లాడటం" అనే అర్థాన్ని ఇచ్చింది. శషశభిషల్లేకుండా బలరాముడికి నచ్చచెప్పి అశ్వమేథానికి వచ్చేలా ఒప్పించాలని ధర్మరాజు కృష్ణుణ్ణి కోరిన సందర్భం ఇది. ఇదే తిరుపతి కవులు "నానా సందర్భములు"లో నాదెళ్ళ పురుషోత్తమకవి సుగుణాలు ప్రస్తుతిస్తూ,

**"ఋషివలె జీవించెను, పూ**
**రుషో త్తముడితండనన్ గరువమున్ మఱియే**
**శషభిషలు నెఱుంగఁడు పూ**
**రుషోత్తముండు సర్వదా పురుషసత్తముడే"** అనే పద్యంలో కల్లాకపటం ఎరుగని వాడనే అర్థంలో "శషభిష" పదాన్ని వాడారు. ఒకే పదాన్ని రెండు విభిన్నార్థాల్లో తిరుపతికవులే ప్రయోగించటం విశేషం. డాబు దర్పం ప్రదర్శించే షోకిల్లారాయుళ్లని "శషభిషలు పోతున్నాడు" అనటం కూడా ఉంది.

కన్యాశుల్కంలో గిరీశం తన శిష్యుడికి చదువు చెప్పే నెపం మీద అగ్రహారంలో అగ్నిహోత్రావధాన్లు ఇంట తిష్టవేయాలని ఎత్తు ఎత్తాడు. అగ్నిహోత్రావధాన్లు పేరుకు తగ్గవాడని గ్రహించి ముఖస్తుతి మంత్రం ప్రారంభిస్తాడు. ఆయన లాంటి చప్పన్నభాషలూ వచ్చిన మనిషి యక్కడా లేడనీ, సంస్కృతం మంచినీళ్ల ప్రవాహంలా మాట్లాడతాడనీ, అంతటి విదూషకుణ్ణి యక్కడా

చూళ్లేదనీ డిప్టీకలక్టరుగారు శలవిస్తూండేవారనీ... ఇలా ఎత్తుకుంటాడు. పొగడ్తలకు లొంగని అగ్నిహోత్రావధాన్లు థుమథుమలాడుతూ "ఈ శషభిషలు నాకేం పనికిరావు. ఇతడి వైఖరి చూస్తే ఇక్కడే బసవేసేటట్టు కనబడుతూంది. మా ఇంట్లో భోజనం యంతమాత్రం వీలుపడదు." అనేస్తాడు. శుష్క స్తుతులు, ముఖప్రీతి మాటలు, పోసుకోలు కబుర్లు అనే అర్థంలో శషభిషని గురజాడ వారు ప్రయోగించారు. రాక్షసుడిని చంద్రబింబం లాంటి మోము, మల్లెపువ్వు లాంటి మనసు అని పొగిడ్తే అది శషభిషే అవుతుంది.

శషభిషలు అంటే ప్రయోజనంలేని తిరకాసులతో కూడిన చర్చలు. purposeless and impeding discussions అని పత్రికాభాష నిఘంటువు ఈ పదానికి అర్థాన్ని వివరిస్తూ, "ప్రకటించిన జొన్నల పంపిణీ గురించి అధికారులు శషభిషల్లో మునిగి ఉండగానే తీవ్రవాదులు రంగంలోకి దిగి...(ఆం భూ. 20/4/80)" అని ప్రయోగాన్ని ఇచ్చింది.

"ఈజిప్టులో అస్వన్ డామ్ నిర్మాణార్థం ఆర్థిక సహాయం చేయుటకు అమెరికా శషభిషలు" అని 1956లో గోల్కొండ పత్రిక ఒక వార్తకు శీర్షికపెట్టింది. "ఆమోదించిన డిమాండ్లను వెంటనే శషభిషలు లేకుండా అమలు చేయాలి" అని ఆంధ్రపత్రిక ఓ వార్తలో వ్రాసింది. కుంటిసాకులు వెదకటం అనే అర్థం ఇక్కడ కనిపిస్తుంది. "ఒకరికంటే ఒకరు ఎక్కువ అనే అహమహమికలు, శషభిషలు మానండి" లాంటి ప్రయోగాలున్నాయి. అహమహమికలు అంటే నేనంటే నేనంటూ మల్లయోధులు జబ్బలు చరుస్తూ చేసే రణనినాదాలు. శషభిషల్ని కూడా దానితో కలిపేశారు.

అత్యాధునికుల్లో కూడా కొందరు శషభిషలేవీ పెట్టుకోకుండా ఈ పదాన్ని వాడుతూనే ఉన్నారు. "ఎన్నికల్లో ఇచ్చే వాగ్దానాల మాట నిజం ఎంతో శషభిషలు లేకుండా తేల్చేశాడు" అని సృజన 1985 జూలై సంచిక, "... ఒప్పుకోలేదు సరిగదా ఆమోదించిన డిమాండ్లను కూడ వెంటనే శషభిషలు లేకుండా ఆమోదించలేదు" అని వీక్షణం జూన్ 2011 సంచిక, "ఎటువంటి శషభిషలు లేకుండా అమెరికాకు దగ్గరవుతున్న మోడీ నోట ఈ మాటలు..." అని వీక్షణం మార్చి 2018 సంచికలలో శషభిష ప్రయోగాన్ని గమనించవచ్చు.

"కందుకూరిది ఎలాంటి శషభిషలు లేకుండా, సూటిగా విషయం వైపు ప్రస్తావించే 'పురాణశైలి" అని వెలుదండ నిత్యానందరావు వ్రాశాడు. "ది సెవెన్ మినిట్స్– అన్న నవల ఈ విషయంపై ఎన్ని కోర్టు తీర్పులు, శషభిషలు నడిచినా చర్చ ఒక కొలిక్కి రాని సమయంలో ఇర్వింగ్ వాలెస్..." అంటూ ఎ.బి కె ప్రసాద్ శషభిషని కోర్టు వాదోప వాదాలకు సంబంధించిన పదంగా ప్రయోగించారు.

తిరుపతి వెంకటేశ్వరులు అనే రచయిత 1957 ఆగస్టు 25 ఆంధ్రపత్రిక దినపత్రికలో అప్పటికి నూరేళ్ల నాటి ఉదంతాన్ని వ్రాశారు. ఇంద్రగంటి విశ్వపతిశాస్త్రి పిడపర్తి చలమయ్య శాస్త్రి అనే ఇద్దరు పంచాంగ కర్తల మధ్య ఘర్షణ ఇందులో ఇతివృత్తం. కోటిపల్లికి చెందిన ఇంద్రకంటి విశ్వపతి శాస్త్రి పంచాంగకర్త. ఆయన కుమారుడు గ్రంథచౌర్యం చేసి తానే వ్రాసినట్టు తండ్రిని నమ్మించటంతో విశ్వపతిశాస్త్రి ఆ పంచాంగాన్ని రాజుగారికి అందించాడు.

"చలమయ్యశాస్త్రిగారు ఆ యేడాది 'లుప్తమాసం' ఉందని వ్రాశారు గదా, మీరు వ్రాయలేదేమిటని రాజుగారు అడిగారు. విశ్వపతిశాస్త్రి చలమయ్య శాస్త్రికి ఏమీ తెలియదని బుకాయించాడు. రాజావారు ఆ ఇద్దరి మధ్యా పోటీ పెట్టారు. కానీ, తగువు తేలలేదు, దేవుడే నిర్ణయిస్తాడంటూ పిడపర్తి చలమయ్య, విశ్వపతి ఇద్దరూ  రెండు తాటాకుల మీద తమ పేర్లు వ్రాసి కాలువ ప్రవాహంలోకి వదిలారు.

చలమయ్య ఆకు ప్రవాహానికి ఎదురు వెళ్లింది.

'ఇదే నిదర్శనం' అన్నాడు చలమయ్యశాస్త్రి. 'ఇది గారడీ' అని విశ్వపతి శాస్త్రి ఓటమిని అంగీకరించలేదు.

దాంతో కోపించిన  చలమయ్య "అబద్ధం చెప్పిన వాడి కుమారుడు మూడు నెలల్లోగా మరణిస్తా" డంటాడు. విశ్వపతి శాస్త్రి కొడుకు మూణ్ణెళ్లకి మరణించాడు. "లుప్తమాసము వమ్ము జేయ పోరాడి విశ్వపతి పాడాయెన్" అంటూ ఈ ఉదంతాన్ని కథలు కథలుగా చెప్పుకున్నారంతా! "లుప్తమాస శషభిషలు" అనే ఈ కథలో అజ్ఞానాన్ని జ్ఞానంగా చెప్పుకుంటూ, పసలేని వాదన చేయటం అనే అర్థంలో శషభిష కనిపిస్తుంది.

ఇలా ఒకచోట తిట్టుగా, ఆగ్రహంగా, ఒక చోట పొగడ్తగా,  ఒకసారి

అజ్ఞానంగా, ఇంకొకసారి జ్ఞానంగా మరొకచోట బుకాయింపుగా, సమర్థింపు వాదంగా 'శషభిష' తెలుగు సాహిత్యంలో చిత్రవిచిత్ర ప్రయోగాలకు కారణం అయ్యింది. 'శష్' అంటే బాధించటం, భిష్ అంటే భయపెట్టటం అని పండితులు ఈ ధాతువులకు అర్థాలు చెప్తారు. కానీ, శషభిష భయపెట్టి బాధించేంత స్థాయిలో కనిపించదు.

16–17 శతాబ్దాలలో తమిళ నేలమీద మరాఠా మాతృభాషగా కలిగి తంజావూరు రాజ్యాన్నేలిన శాహాజీ, వెంకోజీ, శరభోజి, శరభోజీ తులజాజి, లాంటి మరాఠా రాజులు తెలుగులో యక్షగానాలు, కావ్యాలు, వీధినాటకాలు, రామాయణ భారతాలు వ్రాశారు. శివాజీ సవితిసోదరుడు ఏకోజీ. అతని కుమారుడు శాహాజీ. శాహప్రభువు అంటారు ఈయన్ని. 'భక్తవత్సలవిలాసం' అనే నాటకం వ్రాశాడు. తెలుగు సాంప్రదాయం ప్రకారం ఈ గ్రంథానికి వ్రాసిన ముందుమాటల్లో 'కుకవినింద' చేస్తూ ఈ పద్యం వ్రాశాడు. పరిశీలించండి:

**"ఝషభషలైన కొన్ని యపశబ్దములన్ కృతిఁజెప్పి కావ్య పౌ**
**రుషముల కొళ్ళుగట్టుకుని రూఢికి నెక్కదలంచి శేముషీ**
**ధిషణులమంచు వాదులకు దియ్యముగాఁ గవులాడు వాక్యముల్**
**విషకబళంబుఁగా దలఁచి వీనులఁబెట్టరు సత్కవీశ్వరుల్"**

"ఝషభష లైన కొన్ని అపశబ్దాల్ని యథేచ్ఛగా ప్రయోగిస్తూ అది తమ కావ్యపౌరుషం అంటూ, వాటిని రూఢికి తెచ్చి కీర్తిని కొల్లగొట్టాలని చూసే కొందరు పెద్దకవుల రచనల్ని విషపు ముద్దలుగా సత్కవీశ్వరులు భావిస్తారని దీని తాత్పర్యం. ఝషభషలైన అపశబ్దా లంటే ఏవి? ఆప్టే సంస్కృత నిఘంటువులో 'ఝషః' అంటే చేప. మకరరాశి అనే అర్థాలు కనిపిస్తాయి. ఝషకేతనం, ఝషనయని లాంటి ప్రయోగాలున్నాయి. 'ఝష' అని వ్రాయాల్సిన చోట 'భష' అని వ్రాసి, ఇది కూడా ఆ అర్థమే అని దబాయించే వాళ్లని ఈ పద్యంలో నిందించాడు శాహ ప్రభువు. దివాకర్ల రామభాస్కరం గారు సంకలనం చేసిన తెలుగు 'ద్వితీయాక్షర ప్రాసపద నిఘంటువు'లో 'ఝషభష' అంటే 'పలుకలేని మాట' అనే అర్థాన్ని వ్రాశారు.

నిర్దిష్టమైన అర్థం లేనప్పుడు కవులు సందర్భానుసారంగా ఆ పదాన్ని ప్రయోగించటం సహజం. 'ఝుషభష' శషభిషగా పరివర్తన పొంది ఉండవచ్చు. ఈ పరివర్తన జనసామాన్యం నాలుకల మీద కాకుండా, కవుల కలాల ద్వారా జరిగింది. రసాయన చర్యలో పాల్గొనకుండా ఆ రసాయన చర్యని వేగవంతం చేసే దాన్ని పరివర్తకం (కెటలిస్ట్) అంటారు, శషభిష కూడా ఏ సందర్భంలో తనను ప్రయోగిస్తే ఆ సందర్భంలో ఇమిడిపోయి ఒక కొత్త అర్థాన్ని ఇస్తుంది. విస్తృతంగా, లోతుగా, వివరంగా భావాన్ని తేటతెల్లం చేసే అందమైన పదబంధం శషభిష. కుదురుగా వాడకంలోకి తెచ్చుకుంటే సొగసైన తెలుగుకు ఒక ఊతం అవుతుంది.



# అల్లారుబెల్లం

కవులకి అల్లారుబెల్లంగా ఉండే పదాలు లోతైన భావం కలిగి ఉండటాన కవులు ఇష్టంగా వాడ్తుంటారు. "ఎల్ల బంధువులకు నల్లారు బెల్లమై" అని కళాపూర్ణోదయం (6-19)లో పింగళి సూరనగారు అల్లారుముద్దు అనకుండా అల్లారుబెల్లంగా ఉన్నాడని ప్రయోగించటానికి ఆయనకు ఈ పదం చాలా ఇష్టమైనదనే కాదు, దానికి విస్తృతమైన భావం కూడా ఉండటం కారణం.

పిల్లల్ని అల్లారు బెల్లంగా పెంచుతాం. వాళ్ల జ్ఞాపకాల్ని అల్లారుముద్దుగా దాచుకుంటాం. జనం దేన్ని ఎక్కువగా మెచ్చుకుంటారో అది 'అల్లారుముద్దు'. ఇది మనసుకు సంబంధించిన ప్రేమపూర్వక భావన. జనం దేన్ని ఎక్కువగా ఉపయోగిస్తారో అది అల్లారుబెల్లం. ఇది మనసుకూ, శరీరానికీ రెంటికీ సంబంధించిన ప్రేమానుభవైక విషయం. అల్లారుముద్దు అంటే ముద్దొచ్చేంత బాగుందని! తియ్యగా, ఇష్టంగా, ఉన్నది అల్లారుబెల్లం. దేనికి గిరాకీ ఎక్కువగా ఉందో అది అల్లారుబెల్లం. నిజానికి పిల్లల్ని ఉద్దేశించి అనే మాటలు ఇవి.

అల్లారుబెల్లం అనే పదం తెలుగులో తయారవటానికి హిందీ, సంస్కృత మూలాలు కూడా ఉన్నాయి. "అల్లా" అనేది ఉత్తరాదిలో పాండే, త్రిపాఠీ, మిశ్రా లాంటి ఇంటిపేరు. సంస్కృతంలో 'అల్లా' స్త్రీలింగ పరంగా పరాశక్తి. పుంలింగ పరంగా పరమాత్మ, ఈశ్వరుడు అని! అల్లామా/అల్లామహా అంటే గొప్ప జ్ఞాని. కన్నడ శైవ లింగాయత మత ప్రముఖుడు 'అల్లమప్రభువు' పేరులో అల్లమ అంటే మహాజ్ఞాని అనే!

హిందీలో అల్లబెల్ల లేదా అల్‌బేలీ అనే పదం స్త్రీలింగ పరంగా గొప్పసౌందర్యరాశి అనే అర్థంలోకనిపిస్తుంది. "దిల్ మే ఏక్ చుభన్ సీ థీ యహ్ దునియా అల్‘బేలీ" అనేపాట ఈ ప్రపంచం ఒక అల్‘బెలీ' అంటుంది. పుంలింగ పరంగా "అల్‘బేలా" అంటే,. అమాయకుడిలా కనిపించే వ్యక్తి అని! మొత్తం మీద తెలుగులో అల్లారు బెల్లం, హిందీ "అల్‘బేలా"కీ ఆదాన ప్రదానాలపరంగా సంబంధం ఉండి ఉండాలి.

అల్లమ-గల్లమ (అల్లాం-గల్లాం) అంటే హిందీలో odds and ends అని!

అన్నీ ఉన్నా ఏదో లేదనే భావన ఇది. "అల్లామ్ గల్లామ్ సజనా మె కుచ్ కర్ జావూంగీ" అనే సినిమాపాట ప్రసిద్ధమే! ఈ ప్రయోగాల నేపథ్యంలో అల్లారుబెల్లాన్ని పరిశీలించాలి. ఈ లోకం అల్లాబెల్లా లాంటి దనటమూ, "నందమూరి తారకరాముడు తెలుగువారికి అల్లారుబెల్లం" అనటమూ ఒకే రీతిని ఉన్న ప్రయోగాలు.

"అల్లారుబెల్లం అంటే 'ప్రియాతి ప్రియమైన కామ్రేడ్' అని! నిజానికి, పాతకాలపు నియమావళి ప్రకారం "సినీనటులకు అభిమానులు, రాజకీయ నాయకులకు ఓటర్లు అల్లారుబెల్లాలు. కానీ, రోజులు మారాయి. తనకు ఓటు వెయ్యని వాడికోసం తాను ఏమీ చెయ్యననే పార్టీల హవా నడుస్తోందిప్పుడు. వీళ్లకి లబ్ధిదారులు మాత్రమే అల్లారుబెల్లాలు, లబ్ధిదారులు కానివారు అసంబంధీకులు. మన పథకాలు వర్తించని వాళ్లందరి ఓట్లూ తీసేయించాలని కోరుకునే నయా రాజనీతిజ్ఞుల కాలం ఇది.

"పరమభాగవతులకు అల్లారుబెల్లమైన విష్ణుపదాన్ని పొందాలని కోరుకునే ముముక్షువు"

"కొత్తగా పెళ్ళయిన వాడికి తల్లంటే బెల్లం, పెళ్ళాం అంటే అల్లారుబెల్లం".

"ద్రోణుడికి ప్రియ శిష్యుడు ఒక్క అర్జునుడే కావచ్చు. కాని అదే ద్రోణుడు ఏకలవ్యుడికి కూడా అల్లరుబెల్లమైన గురుదేవుడు".

"పాదయాత్రలు రాజకీయాల్లో రాణించాలనుకునే వారికి అల్లారుబెల్లం లాంటివి" "మనిషి మరణిస్తే అతనికి అల్లారుబెల్లమైనవన్నీ విభాజ్యం చెందుతాయి, విడిపోతాయి".

"ఉపాసన, భక్తులు అన్యోన్య పరిపోషకములు, అల్లారుబెల్లమైన వస్తువును మనసులో నెక్కువగా భాసించుటే ఉపాసన"

"తొలి రచన ఎవరికైనా అల్లారుబెల్లమే! అది తొలిముద్దు లాంటి తీపి జ్ఞాపకం". "తనకు అల్లారుబెల్లమైన ఈ వృత్తిలో మెట్టు తర్వాత మెట్లు ఎక్కుతూ, ఎవ్వరూ అందుకోజాలని అంతస్థులు అందుకున్నాడు" ఇలాంటి ప్రయోగాల్లో అల్లారుముద్దు అనటం పొసగదు. వాక్చాతుర్యానికి (రెటారిక్ కళ) దోహదపడే పువ్వుల్లాంటి పదబంధాల్ని ఉపయోగిస్తే అది కుసుమిత (ఫ్లవరీ) భాష అవుతుంది.



# ఉల్లికుట్టుమాటలు

**"సమరమునకు బిరికొల్పుచు**
**మముc దలcచిన నుల్లికుట్టుమాటులc దచ్చి**
**త్తము లుడికించుచుc బాండవ**
**సమితిం గడcగించువా రచట నెవ్వరొకో"** (5-2-242)"

కారణం ఏదైనా కానీండి, ధృతరాష్ట్రుడికి దుర్యోధనుడిమీద నమ్మకం కన్నా పాండవులంటే భయమే కాసింత ఎక్కువ. పాండవుల్లో "పెదనాన్న" అనే భక్తి ఏ మూలైనా మిగిలుంటే, ఉల్లికుట్టుమాటలతో అగ్నికి ఆజ్యం తోడయ్యేలా యుద్ధానికి ఉడికించే వ్యక్తులు పాండవ పక్షాన ఎవరున్నారని సంజయుణ్ణి అడిగినట్టు తిక్కనగారి అద్భుత పద్యం ఇది. మహాభారత యుద్ధాన్ని కళ్ళారా చూస్తూ విడమరచి చెప్పే సంజయుడు పాండవ సేనాధిపతి ధృష్టద్యుమ్నుడి పేరు చెప్పాడు. పాండవుల్ని యుద్ధోన్ముఖుల్ని చేయటానికి అహమికగా పలికిన మాటల్ని సాక్ష్యంగా పేర్కొన్నాడు. నిజానికి ఉల్లికుట్టు మాటలతో దుర్యోధనుడి మనసుని డొల్లకొట్టే (A lie or false-hood) శకుని లాంటి వాడెవడో అటువైపునా ఉండి ఉంటాడని ధృతరాష్ట్రుడి అనుమానం. పాండవుల కోపాగ్నిని సంరక్షించటం సేనాధిపతిగా ధృష్టద్యుమ్నుడి విధి. అదే చేస్తున్నాడని సంజయుడు ధృతరాష్ట్రుడికి వివరించాడు.

ఉల్లము (ఉల్లి) అంటే మనసు. కుట్టు అంటే సూదితో గుచ్చినట్టు వేదన (తోదనం-pinning,pricking), కడుపులో కుట్టునొప్పి అంటే, పేగుల్లో సూదులతో గుచ్చినట్టు నొప్పి (spasm). ఊపిరి కుట్టునొప్పి అంటే గాలి పీల్చుకొంటుంటే ఉరోభాగం కండరాల్లో సూదులతో గుచ్చినట్టు నొప్పి. పళ్ళ సందుల్లో ఇరుక్కున్న ఆహారపదార్థాల్ని పుల్లతో పెకలించటాన్ని పన్నుకుట్టుకోవటం అంటారు. తేనెటీగలు, తేళ్లు దోమలు, మనం బట్టలోకి సూది గుచ్చి కుట్టినట్టు అవి కొండాలను గుచ్చుతాయి. కాబట్టి, కుట్టాయి అంటాం. ఇలా తేలుకుట్టినట్టు మనసుని బాధించే దెప్పిపొడుపులు ఉల్లికుట్టు మాటలు. 'ఉల్లకుట్టుమాట', 'ఉల్లకుట్టు చేత', లాంటి ప్రయోగాలూ ఉన్నాయి.

**"....శుకకులాధ్యక్షా! యింత గ౦నగ౦గల్పిన నేర్పరిగాను నేను**
**చాలు నులుకుట్టు మాటల జోలియేల యవలి**
**కథ దెల్పుమనిన నిట్లనియె జిలుక..."** కదిరీపతి నాయకుడి శుకసప్తతిలో ప్రభావతి తప్పు చేయటానికి సిద్ధపడినప్పుడు, చిలుక ఆమెను ఆపటానికి ప్రయత్నిస్తుంది. అప్పుడు ప్రభావతి "ఓచిలుకరాజా! ఇంత చూడగలిగే నేర్పు నాకు లేదు, ఉలుకుట్టు మాటలు వద్దు, తరువాత కథ చెప్పు" అంటుంది.

నన్నయకన్నా ముందువాడో లేక సమకాలికుడో అయిన నన్నె చోడుడు కుమారసంభవంలొ "దనుజు లుల్లల నుడుకన్" అంటూ, 'ఉల్ల ఉడుకుమాట' అనే ప్రయోగం చేశాడు. ఉల్లుడుకు మాటలు/చేతలకు వెయ్యేళ్ళపైబడిన చరిత్ర ఉందన్నమాట.

ఇంత అందమైన తెలుగు నుడికట్టుని అన్నమయ్య మాత్రం వదిలిపెడతాడా? "వులుకుట్టు౦ జే౦తలకు నుస్సురంటా నున్న నాతో యెలయించి నవ్వు నవ్వేవేరా నీవు" అంటుంది నాయిక. ఉలుకుట్టు మాటలే కాదు, ఉలుకుట్టుచేతలు కూడా ఉంటాయి. మనసుని బాధపెట్టే చేష్టలతో ఆమె నుసూరుపెట్టి, నవ్వుకుంటున్నాడట నాయకుడు.

'అధిక్షేపం', 'అవహేళన', 'పరిహాసం' లాంటి శక్తివంతమైన సంస్కృత పదాలకు బదులుగా వ్యంగ్యంగా వాడదగిన అచ్చతెలుగు పదబంధం ఉల్లికుట్టుమాట! వ్యంగ్యం అనే పదంలో లేని వ్యంగ్యం 'ఉల్లికుట్టుమాట' అనటంలో ఉంది. అదీ ఈ పదబంధం ప్రత్యేకత.

"విభేదాలుంటే చర్చల ద్వారా పరిష్కరించుకోవాలి తప్ప ఉల్లికుట్టు మాటలు మంచిది కాదని గవర్నర్ అన్నారు". "రైతులకు వెన్నుదన్ను గావల్సిన ప్రభుత్వం ఉల్లికుట్టు మాటలతో వారిని వేధిస్తోంది".

ఉల్లికుట్టు మాటలు, శక్తిలేని వాళ్ల శక్తిమంతమైన ఆయుధాల్లాంటివి. వాటిని అలానే ప్రయోగించాలి. వ్యక్తి లేదా వ్యవస్థలోని దుర్మార్గాన్ని ఎండగట్టడానికి వాడే మాటలు హృదయానికి గుచ్చుకునేలా ఉండాలి. మనసుకు తగలాలి. తద్వారా మార్పు కలగాలి. ఉత్తినే మాట అని ప్రయోజనం ఏముంది? ఉల్లికుట్టు/ఉలుకుట్టు మాటలు పరివర్తన కారకాలు.



# ఓహరిసాహరి

**సొ**గసైన తెలుగును మాట్లాడాలన్నా వ్రాయాలన్నా అందమైన పదబంధాలు కావాలి. గ్రాంథిక పదాల్ని వాడితే భాషా సోయగం పెరగదు. అనేక సాధారణ పదాల కన్నా భావగాంభీర్యం కలిగిన ఒక్క పదం ఆ వాక్యాన్ని కుసుమితం (ఫ్లవరీ) చేస్తుంది.

ఓహరిసాహరిలో 'ఓహరి' అంటే "నేను ముందు" అనే అర్థాన్ని తెలుగు వ్యుత్పత్తి కోసం ఇచ్చింది. కానీ, ఓహరికి ప్రాకృత నిఘంటువులో హింస, అసంభవాన్ని సంభవం చేయటం, వక్రంగా వెళ్లటం, తలకిందులు కావటం అనే అర్థాలున్నాయి. సంస్కృతంలో ఓహస్ అంటే వాహకం, మోసుకుపోయేదని, పాళీ భాషలో వెంట తీసుకుపోవటం, నడుపుకు పోవటం ముందుకు సాగటం, పక్కదారుల లోంచి దూసుకుపోవటం లాంటి అర్థాలు కనిపిస్తాయి. అలాగే, పాళీలో సహ అంటే ఒక దానికి వెంటనే వచ్చేదని అర్థం. ప్రాకృతంలో 'సహ–కార' అంటారు ఈ అర్థాలన్నింటినీ కలగలపి తెలుగు కవులు ఓహరిసాహరి పదబంధాన్ని తయారు చేసారు. దీనికి మేథోహక్కులు తెలుగువారివే! తెలుగుభాషా సోయగానికి ఒక ఆభరణం లాంటి పదబంధం ఇది.

"ఓహరిసాహరి" అనేది 'పూలభాష'కి పనికొచ్చే సొగసైన పదబంధం. సంస్కృతం, పాళీ, ప్రాకృతం పదాల కలయికతో ఈ పదం ఏర్పడింది. అటమటంగా పెనగటం, తండోపతండాలుగా తరలిరావటం, మూకుమ్మడిగా కమ్ముకోవటం దీని అర్థాలు

"ఓహరిసాహరి నుయ్యాల చేరగా వెనుకొంచుఁ దెరలుచుఁ బెనఁగు నెడలు" అని భీష్మపర్వంలో తిక్కనగారు ఒక అడుగు ముందుకు, ఒక అడుగు వెనక్కీ వేస్తూ ముందుకే కదలటం అనే అర్థంలోనూ, "పురికొనుచుం చెరలుచు నోహరి సాహరి నొక్కచోట నలవడు నొకచో " అంటూ తిక్కనగారే సమస్యలు ఒకేసారి చుట్టుముట్టటం అనే అర్థం లోనూ మొదటగా ఈ పదాన్ని ఉపయోగించారు.

“పనులు – ఓహరిసాహరి’లా సాగుతున్నాయి” అంటే, ఒడిదుడుకులున్నా పని పూర్తవుతుందనే ఆశాభావం ధ్వనిస్తుంది.

“ఓహరిసాహరిం బ్రథమ మొల్కెడు ధారల గాడ్పు లేటవా/ల్గా హతి నీడ్చి” పెద్ద జడివానలో గాలివాటుకు ఏటవాలుగా వర్షం కురుస్తోంది అనటానికి “వానచినుకులు – ఓహరిసాహరి’గా” కురుస్తున్నాయని ఆముక్తమాల్యదలో రాయలవారు సొగసుగా ఈ పదాన్ని ప్రయోగించాడు. “ఇట్లోహరిసొహరినల్లాడు హరార్జునుల” అని శ్రీనాథుడు హెూరాహెూరీ అనే అర్థంలో ప్రయోగించాడు. –ఓహరిసాహరి’ అనేది “నేను గొప్పంటే నేనే గొప్ప అనే అహమహమికకు మరో పేరు” అని అచ్చతెనుగు కోశం, ఎడతెగక పోరాడు, గుంపులు కట్టి పోరాడు అని సూర్యరాయాంధ్రనిఘంటువు అర్థాలిచ్చాయి.

వివాదాస్పదమైన అంశాల మీద వార్తా చానళ్లలో ‘ఎన్‘కౌంటర్ విత్”, “లైవ్ డిబేట్” లాంటి కార్యక్రమాల్లో బాహాబాహీగా, ముష్టాముష్టీగా జరిగే హాట్ టాపిక్ డిబేట్లు “ఓహరిసాహరి”గా ఉంటాయి. ‘ఓహరిసాహరి’ (సెన్సేషన్) లేని కార్యక్రమాలు చప్పగా ఉంటాయి.

కేసు దర్యాప్తు ఓహరిసాహరిగా జరుగుతుండగా హైకోర్టు మధ్యంతర ఉత్తర్వులు ఇవ్వడం సరికాదని సుప్రీంకోర్టు పేర్కొంది.

సాంబ్రాణి ధూపంలో, డప్పుల శబ్దాల మధ్య వీరంగంతో ‘ఓహరిసాహరి’గా చేసే పేరిణి నృత్యం ప్రేక్షకుల్నీ ఉద్రిక్తుల్ని చేస్తుంది

మునుగోడులో అమిత్ షా సమక్షంలో 500 మంది టి ఆర్ యస్ కార్యకర్తలు ఓహరిసాహరిగా పార్టీలో చేరారు.

ప్రజలపై ప్రభుత్వం చేసే దాడిని దౌర్జన్యం అనీ, ప్రజలే మూకుమ్మడిగా తిరగబడితే ఓహరిసాహరి తిరుగుబాటు అనీ అంటారు.

రష్యా ఉక్రెయిన్ యుద్ధం ఓహరిసాహరి యుద్ధానికి ఒక ఉదాహరణ. రెండు దేశాలు నేనే గొప్పంటూ సాగిస్తోంటే, అమెరికా తదితర దేశాలు ఎగదోస్తూ గుంపులు కట్టిన పోరు.

“ఓహరిసాహరిc బోరెడి/యాహవ రంగమునc గూలు హరికరివీర/ వ్యూహాయుధఖండంబుల/నూహాతీతాతి ఘోరయుద్ధము సాగెన్” ఊహాతీతంగా

వ్యూహాయుధాలతో ఓహరిసాహరిగా యుద్ధం సాగుతోంది–యార్లగడ్డ వెంకట సుబ్బారావు కాకతీయ తరంగిణి.

ఏ పదం ఎలాపుట్టినా, దాన్ని ఏ సందర్భంలో ఏ అర్థంలో ప్రయోగిస్తే అది తేలికగా అర్థం అయ్యేలా, సులువుగా పలకగలిగేలా, లోతైన భావాన్ని అందించేలా ఉంటుందో అది భాషకు సొగసుని ఇస్తుంది. ప్రస్తుత పోటీ యుగంలో – ఓహరిసాహరి'ని ప్రయోగించే సందర్భాలు ఎక్కువగానే ఉంటాయి. దీన్ని తిరిగి వాడకంలోకి తెచ్చుకుందాం.



# చాలుమాసి

**అ**డ్డం లేనివాళ్లు, ఇష్టం వచ్చినట్టు వ్యవహరించే వాళ్లు కడుసమర్థులు కావాలని లేదు. పని సాధించగలవాడే సమర్థుడు. జల్సాలు చేసేవాడు, అధికారం అడ్డుపెట్టుకుని ఇష్టారాజ్యంగా వ్యవహరించేవాడు సమర్థుడు అనిపించుకోలేదు. స్వతంత్రుడైనంత మాత్రాన సమర్థుడవాలని లేదు. అసమర్థ దనిపించుకోవాలన్నా అర్హత ఉండాలి. అసమర్థత చేతకాని తనం కాదు. వైఫల్యం విజయానికి పునాదే!

**“తనరు నడ్డము లేనివాఁడనఁగ నిచ్చ**
**నుండువాఁడన నిరవగ్రహుఁడు; చాలు**
**మాసి, పనుపరి యనఁగను భాసిలుఁ బర**
**తంత్రనామంబు...”** అచ్చతెలుగు కోశములోని ఈ పద్యంలో నిరవగ్రహుడు, చాలుమాసి, పనుపరి అనే మూడు రకాల వ్యక్తుల వ్యక్తిత్వానికి సంబంధించిన ప్రస్తావనలున్నాయి. ఇలాంటి పదాల్ని ఇప్పటి కాలానికి ఎలా అన్వయించాలనేదే ప్రస్తుత చర్చ.

నిరవగ్రహుడు అంటే, అడ్డము లేనివాడు. బరితెగించినవాడని! ఒకరూలుకు కట్టుబడనివాడు. వాడిష్టం వచ్చినట్టు వ్యవహరించే వాడు. అలాంటివాడు సమర్థుడెలా అవుతాడు? స్వతంత్ర భారతదేశంలో ఇలాంటి కడుస్వతంత్రుల సంఖ్య పెరిగి సమర్థుల సంఖ్య తగ్గింది.

పనుపరి అంటే పరతంత్రుడు. పనుచు అంటే, ఒక పనిమీద పంపించటం లేదా ఫలానా పని చెయ్యమని చెప్పటం. ఎవరికి చెప్తారు? సమర్థుడికే కదా! అంతమాత్రాన ఇతరుల ఆజ్ఞకు లోబడినవాడు, అస్వతంత్రుడు అనటం అన్యాయమే! అదే నిజమైతే ఎవరూ ఎవరికీ ఏ పనీ చేసిపెట్టరు. కృతి వ్రాయమని రాయలవారు పెద్దనను కోరినా, సాక్షాత్తు ఆంధ్రమహావిష్ణువే రాయలవారిని కోరినా అది ఆయా వ్యక్తుల సమర్థతకు గుర్తింపే!

ముఖ్యంగా ప్రజాస్వామ్య యుగంలో ఆజ్ఞాపించటం అనే పదాన్ని

సరళీకరించవలసి ఉంటుంది. పై అధికారి కింది అధికారికి ఆర్డర్ వేయటం, కింది అధికారి పై అధికారికి విన్నపం చేసుకోవటం అనే పద్ధతులు బ్రిటిష్ కాలం నాటివి. స్వాతంత్రం వచ్చినా పరతంత్ర భావజాలం కలిగిన పదాలను సంస్కరించుకోలేకపోతున్నాం. 'పనుపరి' సమర్థుడైన వ్యక్తే! ఎవరేది కోరినా సాధించిపెడతాడు. అతగాణ్ణి చెంచాగాడుగా భావించటం అన్యాయం కదా!

నిఘంటుపరంగా 'చాలుమాసి' అంటే, అస్వతంత్రుడు, పరాధీనుడు, ఇతరులకు అనుకూలంగా ప్రవర్తించేవాడు...అని! కానీ, ఈ పదాన్ని లోతుగా విశ్లేషిస్తే మనకు కొత్తకోణాలు కనిపిస్తాయి.

'చాలు' అంటే, విస్తారమగు, సరిపోవు, అనుకూలమగు, సరిపడు, దీటగు, అంగీకరించు, సమానమగు, ఇష్టపడు, సమృద్ధిపొందు, తగినంత, అధికం, సంతృప్తి–ఇన్ని అర్థాలున్నాయి. ఇవన్నీ వ్యక్తిత్వాన్ని సూచించే గుణాలే! ఇవి కలిగిన 'మాసి' అంటే మనిషి అస్వతంత్రు డెలా అవుతాడు? కాబట్టి చాలుమాసిని సమర్థతకు గుర్తింపునిచ్చే సందర్భాల్లోనే వాడాలి! అయితే, ఇక్కడో కీలకమైన అంశం ఉంది:

అనుకూలత మంచి లక్షణమే అయినా, ఎవరికి అనుకూలుడనే ప్రశ్న వచ్చినప్పుడు అర్థాలు మారతాయి. కర్ణుడు సమర్థుడే అయినా, దుర్యోధనుడికి అనుకూలుడు కావటాన స్వతంత్రుడు కాలేకపోయాడు. కాబట్టి, తిక్కన గారి లెక్కలో 'చాలుమాసి' అధర్మానికి అనుకూలుడైతే పరతంత్రుడే అవుతాడు.

రౌడీలకు, మాఫియాలకు అనుకూలంగా పనిచేసే పోలీసు అధికారి గురించి ప్రజలు ఘనంగా ఏం చెప్పుకుంటారు? లోకోపకారి అయితే, ఎప్పటికీ సమర్థుడనే కీర్తిని పొందుతూనే ఉంటాడు. పాండవ సోదరులు ధర్మరాజుకు అనుకూలురు కాబట్టి, ధర్మానికి మాత్రమే బద్ధులు కాబట్టి, సర్వస్వతంత్ర సమర్థులు అనిపించుకున్నారు.

సమర్థత అంటే వనరుల్ని జనబాహుళ్యానికి వినియోగించడం, ప్రజోపయోగానికి కంకణం కట్టుకోవటం ఇలాంటి గుణాలు ఆధునిక యుగంలో సమర్థతకు గీటురాళ్లవుతాయి. చరిత్రలో 'చాలుమాసు'గా నిలిచేది వీరే! తాను విత్తు నాటిన భూమిలో మొక్క మొలిచి పంట పండే వరం పొంది కరువులో

లోకం ఆకలి తీర్చిన గౌతముడు ఒక చాలుమాసి. తపస్సు చేసి దివినుండి గంగని భువికి తెచ్చిన భగీరథుడు ఒక చాలుమాసి. బానిసత్వ విముక్తికి జాతిని జాగృతం చేసి స్వతంత్ర పోరాటానికి సిద్ధంచేసిన గాంధీజీ ఒక చాలుమాసి. ఒక నెల్సన్ మండేలా, ఒక అబ్రహాం లింకన్, ఒక మార్టిన్ లూథర్ కింగ్ చాలుమాసి అనదగిన వ్యక్తులకు కొదవలేదని నిరూపించినవారే!



# మారాముళ్లు

**"బి**ళ్లంగోడాటలో బిళ్ళ తప్పిపడితే ఏ పిల్లకూడా చల్లగా చూస్తూ నవ్వితే నవ్వుతుంది గాని మంథరంత మారాముడి చేయదు" అంటాడు శిష్టా ఉమామహేశ్వరరావు నవమి చిలుకలో! మంథర వేసింది ఒకటే మారాముడి. అది చరిత్రగతినే మార్చేసింది. ఒక్క మారాముడి చాలు రాజ్యం పోయి అడవుల బాట పట్టడానికి!

మారు అనే హిందీ పదానికి కొట్టటం హింసించటం, చంపటం లాంటి అర్థాలున్నాయి. ముడిమార్చు అంటే చంపేయటమే! మారాముడి, మరామడి లాంటి రూపాలు కూడా ఉన్నాయి. మారు(చంపు)+ముడి అంటే, హింసతో ముడిపడిందని! కొన్ని అనారోగ్యకర అంశాల్తో ముడిపడితే అంటుకునే రోగాన్ని "ముడిచె" అంటారు. మారుతో ముడిపడటం కూడా అటువంటిదే!

ఆడవాళ్ల పొడవైన జుత్తు గానీ, పొడవైన దారప్పోగుల్లాగే ఒకదానితో ఒకటి చిక్కుకుని ముడులు పడతాయి ముళ్లుపడేలా చిక్కుంటే అవి చిక్కుముళ్లు అవుతాయి. వాటిని విడదీయటానికి ప్రయత్నిస్తే ముడిపైన మరోముడి పడ్తుంది. అది మారాముడి! మారాముళ్ల వలన చిక్కులు పెరుగుతాయి. మరామళ్ళు అనటం కూడా ఉంది. మారాము=పోరు. మారాముడి=యుద్ధం చేయాల్సివచ్చినంత కష్టం అని!

మారాముళ్లని తారాముళ్లు అనీ అంటారు. ఇక్కడి మాటలు అక్కడా, అక్కడిమాటలు ఇక్కడా చేరవేసే 'తంపులమారి'ని "తారి" అంటారు. ఈ తారి తెచ్చిపెట్టే మారాముళ్లని తారాముళ్లు అంటారు. అది 'తారాముళ్లది', వాడు 'తారికాడు' అనవలసిన వ్యక్తులు మన చుట్టూ చాలామంది ఉంటారు. పని సమయంలో పనిలో కాకుండా అక్కడా ఇక్కడా తిరిగి వచ్చేవాణ్ణి 'తారికాడు' అంటారు. ఒకవైపు స్థిరమైన ఉద్యోగాలు చేస్తూనే, బైట స్వంత వ్యాపారాలతో తారాడే తారిగాళ్లు చాలామంది ఉన్నారు.

లేనిపోని చిక్కులు అనే అర్థంలో మారాముళ్లని కొన్ని ప్రాంతాల్లో 'పుల్టాకులు' అంటారు. మాండలిక పదకోశం ఇది ఉత్తర సర్కారు జిల్లాలో వాడుక

పదం అని పేర్కొంది. రంబారావుళ్లు అనటం కూడా ఉంది. మారాముళ్లు, రంబారావుళ్లు, ఫుట్టాకులు ఇవన్నీ లావాదేవీలకు (లిటిగేషన్లు) సంబంధించిన పదాలు.

పూర్వపు రోజుల్లో కథల్లోనూ నవలల్లోనూ, సినిమాల్లోనూ అనేక మారాముళ్లు విడగొట్టి చివరికి నాయికా నాయకులకు మూడుముళ్లు వేయటంతో శుభంకార్డు పడేది. ఇప్పటి రోజుల్లో మూడుముళ్లూ పడ్డాక మారాముళ్లు పడి అసలు కథ మొదలౌతోంది. అప్పటి కథలకు మూడుముళ్లు పరమావధి. ఇప్పటి కథలకు మారాముళ్ళు ప్రధాన ఇతివృత్తం.

**అడ్డుపుల్లలేయటం:** పూర్వపు రోజుల్లో వార్తాపత్రికల్లో ఈ మారాముళ్లు పదం బాగా కనిపించేది. "అమెరికా తమ మిగులు గింజలను మన కివ్వటానికి ఎన్ని రాజకీయ మారాముళ్లు పెడుతున్నదీ నెహ్రూకి తెలుసును" అని, ఆంధ్రపత్రిక 1951 ఏప్రియల్ 11న వ్రాసింది. అర్జెంటీనాపై ఆహారం కొరకు ఆధారపడిన బ్రిటను డొక్క మాడ్చుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. అన్ని దేశాలూ తాము చేసే సహాయానికి మారాముళ్లు పెట్ట వనుకున్నా, ఏక్షణం యుద్ధం వచ్చినా రావచ్చు" అని హెచ్చరించింది. ఇక్కడ మారాముళ్లొ అడ్డుపుల్లలు వేయటం

**ఘర్షణ పడటం:** "సుబ్బరాయుడు తనముందు ఒక కుండబొచ్చె పెట్టుకొని మిగిలినవాళ్లు మారాముళ్ళు పడుతూ ఉంటే నయానా భయానా వారిని సమాధాన పెడుతూ ఎవ్వరికీ లోపం లేకుండా పంచిపెట్టుతున్నాడు" ఈ వాక్యంలో మారాముళ్ళు అంటే ఘర్షణపడటం.

**అరాచకాలు:** ''ఇది రాజకీయజీవితం. కుట్రలు, కుతంత్రాలు, మారాముళ్ళు, ఎన్నో చేయక తప్పదు. నిద్రలేదు, గుండెనిమ్మళం లేదు, కడుపులో చల్ల కదలకుండా దూడలను దువ్వుకుంటూ మానెడు విత్తులు చల్లి గోనెలు పండించుకుంటూ హాయిగా వుండకుండా లేనిపోని బెడద బెట్టుకుంటినేమా..." ఇందులో మారాముళ్లు అంటే అరాచకాలు.

**సవతితల్లి ఆరళ్లు:** "మారిపిల్లాడించెనే మారుదల్లి" అని అన్నమయ్య ప్రయోగం ఒకటుంది. మారిపిల్లాడించటం అంటే సవతితల్లి మారాముళ్ళు వేసి ఆ పిల్లని ఇబ్బంది పెట్టడం అని!

**మహమ్మారి:** 'మారిమసఁగినభంగిన్' అనే ప్రయోగం కూడా ఉంది. మహమ్మారి వచ్చి ఊడ్చు కొనిపోయినట్లు, అనే అర్థంలో జైమిని భారతంలో ఈ ప్రయోగం కనిపిస్తుంది. ఊరంతా ఊష్ఠం వచ్చి కొట్టుకుపోయినట్టు అనటం లాంటిది. 'మారిమసలినట్టు' అంటే మహమ్మారివ్యాధి వ్యాపించినట్లు.

**చెలరేగు:** మారిమసఁగు అంటే చెలరేగిపోవటం లాంటిది. శత్రుసంహారానికి సంబంధించిన మిలిటరీ పదం ఇది. మన సైన్యం మారిమసగటంతో శత్రుసేన తోకముడిచింది అనేవాళ్లు. వాసంతికా పరిణయం యక్షగానంలో వాసంతిక మన్మథుణ్ణి ఇలా నిందిస్తోంది:

**"ఓరీ! నావంటి నారీమణి నేఁచ**
**దారిగాదు శంబరారి నీకున్**
**మారా నీరూపమారా! నన్నిట్టు**
**మారాముళ్లు పెట్ట మేలా నీకున్"** అని. ఇవ్వవలసింది ఇవ్వకుండా ఏడ్పించటం అనే అర్థంలో ఇక్కడ మారాముళ్లు ప్రయోగం కనిపిస్తుంది.

శుకసప్తతిలో నాయిక తప్పుచేయకుండా ఓ రామచిలుక రోజుకో నీతికథ చెప్పి ఆపూటకు ఆమెని ఇల్లు కదలకుండా చేస్తుంటుంది "ఓ రామచిలుక! మాకీ మారాముళ్లెట్లు తెలియు మగవారమె నీదారిఁ బలుపోకలంగడి దేఱన్" చిలుకా! హౌస్ వైఫని గర్వంగా చెప్పుకుంటూ ఇంట్లోనే ఉండే ఆడవాళ్లం. మాకీ మారాముళ్లు ఎలా తెలుస్తాయి? మేమేమైనా మగవాళ్లమా! నీకు లాగా దేశసంచారం చేశామా?" అంటుంది నాయిక. ఇక్కడ మారాముళ్లు అంటే మర్మాలు, లోతైనఅంశాలు.

తనకీ వాటా ఇస్తేనే సంతకం పెడతానని ఆ కమీషనర్ మారాముడి వేశాడు–అంటే మోకాలు అడ్డాడని! చిక్కుల్లో పడటం, హింసపెట్టటం, ఎదురుతిరిగి పోరాడటం, అపోహలను అనుమానాలను సృష్టించటం, తంపులమారి వలన సమస్యలు రావటం, అడ్డుపుల్ల వేయటం, గొడవపడటం, అరాచకాలు, సవితితల్లి ఆరళ్లు, విరహవేదన, మర్మాలు, లోతైన అంశాలు ఇలా... అనేక అర్థాల్లో ఈ పదాన్ని ప్రయోగించవచ్చు. మరిచిపోవలసిన, వదులుకోవలసిన పదం కాదిది.



# చురపుచ్చు

నలుగురు ఆడవాళ్లు ఎక్కడైనా కూర్చుని సరదాగా మాట్లాడుకుంటున్నప్పుడు పెద్దమనిషి ఎవడైనా అటుగా వస్తే మర్యాద కోసం లేచి నుంచుంటారు. ఇలాగే, ఒకావిడ నుంచుంటే పక్కావిడ "ఎందుకు నుంచున్నావు? ఆయన మన అబ్బిగాడి మాష్టరే" అన్నదట. దానికి ఆ పక్కనున్న మరో ఇద్దరితో సహా అందరూ నవ్వారట. ఎందుకు నవ్వారో తెలీదంటూ విశ్వనాథ వారే ఈ కథ తనతో చెప్పారని జి. కృష్ణ గారు మా చిన్ననాడు ఆంధ్రప్రభలో రాస్తే చదివాను.

నవ్వటానికి దుర్యోధనుడు మడుగులో పడ్డంత కారణం ఉండాల్సిన పనిలేదు. వెటకారానికి మెటికలు విరవాల్సినంత అవసరమూ ఉండదు. ఏదైతేనేం? అబ్బిగాడి మాష్టారు చుర పుచ్చుకున్నారు. చురపుచ్చుకోవటం అంటే కాలటం. ఆయనకు కాలింది ఆ మహిళలు నవ్వినందుకా? లేక పక్కావిడ ఎందుకు లేచావన్నందుకా? మయసభలో దుర్యోధనుడికి మాయా దర్పణంలో ఒకే ముఖం వంద ముఖాలుగా కనిపించి 'బాషామాట'లాగా ఒక్కసారి చెప్తే వందసార్లు వినిపించి ఉంటుంది. ఈ కథలో నీతి ఏమంటే ఆడవాళ్ళు నలుగురు కూర్చుని ఉన్న చోట ఒక్క బక్క మగవాడు ఆ పక్కనుంచి పోతే ఇలా చురపుచ్చు కోవాల్సి వస్తుందని!

తీక్షణంగా చూసినప్పుడు, వొళ్ళు మండినప్పుడు, కంపరం పుట్టినప్పుడు ఆ చప్పుళ్లు మనకు వినిపించవు. శబ్దవేత్తలు అది చురచుర మనే శబ్దం అన్నారు. 'చురచురపోయింది' అంటే కాలిపోయిందని. చురచురమని చూసింది, చురచురమన్నది, చురచురెత్తింది ఇలా కోపంతో దహించుకుపోవటానికి ఈ పదాన్ని చక్కగా వాడుకోవచ్చు. చురపుచ్చిన వారిని 'చురుకరి' అంటారు. చురుకరి చురపుచ్చితే (కాలిస్తే) మనసు చురచుర పోతుంది (కాల్తుంది).

పై కథలో ఎందుకు నుంచున్నావన్న పక్కావిడ చురపుచ్చింది. అబ్బిగాడి మాష్టారు చురపుచ్చుకున్నాడు. ఇది విని 'ఆడాళ్లున్న చోటికి ఒంటిగా పోతే అంతేగా మరి' అన్నాడో ఫ్రెండు. దాంతో కాలే పెనం మీద నీళ్లు చల్లితే చుయ్యిమని

ఆవిర్లు పుట్టినట్టు అయ్యింది మాష్టారికి. నిప్పునీళ్ల కలయిక వలన 'చుయ్యి' పుడుతుంది. ఆ ఫ్రెండు అబ్బిగాడి మాస్టార్ని అలా 'చుయ్యి' పెట్టాడు. అది 'చురుక్కు'న తగిలి 'చుర్రు'మంది మాష్టారికి.

'చుర'లో వేడిమి, వాడిమి అనే రెండు గుణాలున్నాయి. చురచురలో 'చుర', చురకత్తిలో 'చుర' ఒకే రీతిన బాధిస్తాయి. ఒకటి వేడిగా, ఒకటి వాడిగా!! కమల్చటం, కాలుకొల్పటం, చిచ్చుపెట్టటం, చుర్రుకొనటం, తగులెట్టటం, తవుల్చటం, ప్రేల్చటం, మండచేయటం, మండించటం, మాడ్చటం, ముట్టించటం, రగిలించటం ఇలా కాల్చటానికి సంబంధించి తెలుగులో చాలా పదాలున్నాయి. వీటిలో కొన్నింటినే వాడ్తున్నాం. తక్కినవి తెలుసుగానీ వాడేప్పుడు 'చుర్రు'న బుర్రలోకి రావు. వాడిగా ధాటిగా అవి గుర్తుకి రావాలంటే ఆ పదాల్లో 'చురుక్కు'ని మనం చవిగొని ఉండాలి.

తాంబూలంలో సున్నపు చవి నాలుకను చురపుచ్చుతుంది. నాలుగాకులు నమిలితే గాని 'చుర' తగ్గదు.

"ఎడ్లబండి తోలేవాడు మధ్య మధ్య చెర్నాకోలుతో ఎద్దు వీపు చుర్రు మనిపించినట్టు ఆర్థికమంత్రి పన్నులతో ప్రజానీకాన్ని చురపుచ్చుతుంటాడు."

పంటలకు వచ్చే అగ్గి తెగులుని 'చురపుచ్చు' అనవచ్చు. నారుమడిలో ఒక్క వరిమొక్క చురపుచ్చితే మొత్తం చేనంతా ఎండిపోతుంది. చురపుచ్చు అనే క్రియాపదాన్ని (verb) నామవాచకం (noun) చేస్తే సూటైన అర్థంలో ఈ పదం అమర్తుంది.

'టెంపుల్‌కి వెళ్లి కోకోనట్ బ్రేక్ చేశా' లాంటి మాటలు వింటున్నప్పుడు భాషాభిమానుల హృదయాలు చురపుచ్చుకుంటాయి. సొగసైన తెలుగు మాటలుండగా దిక్కుమాలిన సంకర భాష దేనికని!

'చురపుచ్చు' అనేది చురుకైన పదబంధం. దాన్ని వ్యుత్పత్తిపదకోశం, పర్యాయపదకోశం లాంటి కొన్ని నిఘంటువులు మాత్రమే పేర్కొన్నాయి. పూర్వకవి ప్రయోగాలు కనిపించలేదు. అశ్రద్ధకు గురైన పదాలలో ఇదీ ఒకటి. వాడిన కొద్దీ భాష వన్నె పెరుగుతుంది.



# టింగనా

**"సంగతియేమోయి? యిసుమంత ఠింగణావు**
**తత్త్వనిర్ణయవాదంబు దరమె నీకు?**
**నోడితేనియుఁ బట్టి 'మొఱ్ఱో' యనంగ**
**లింగమును గట్ట కుడుగ, మెఱింగి నొడువున్"**

ఆముక్తమాల్యదలో శ్రీ కృష్ణదేవరాయలవారు ప్రయోగించారంటే ఠింగణా అనే హిందీ పదానికి దక్షిణాదిలోనూ వాడకం ఉండేదన్న మాట. యామునాచార్య అనే బ్రహ్మచారికి, రాజుగారికి పోటీ పడింది. రాజు గెలిస్తే యామనుడు, రాణిగారు కూడా శైవం పుచ్చుకోవాలి, యామనుడు గెలిస్తే రాజు విష్ణుభక్తుడిగా మారిపోవాలి. పోటీకి ఒప్పుకుని కూర్చున్నాడు యామనుడు. ఉత్తచేతుల్తో రాజ్యసభకు రాకూడదు కాబట్టి, తనదగ్గరున్న ఓ జంధ్యాన్ని రాజుకి కానుకగా సమర్పించాడు.

రాజుగారు అంటున్నాడు: "ఏమోయ్ ఏమిటీ సంగతి? కూసింత ఠింగణాగాడివి. శివతత్త్వనిర్ణయాలు నీ తరం అవుతాయా? ఈ పోటీలో ఓడావనుకో నీ మెడకి లింగాన్ని కట్టి కుయ్యోమొర్రో అనిపిస్తా, ఇది తెలుసుకుని వాదనకు దిగు".

రాయలవారి పద్యాల్లో తేలికగా అర్థం అయ్యే పద్యం ఇదే! "సంగతి యేమోయ్" అంటూ పరమవాడుక భాషాపదాల్ని ప్రయోగించాడు. లోకం పోకడ తెలిసిన సామాజిక కవి ఆయన.

"కుబుచ, ఠింగణ, గిడ్డ, గిటక, గుజ్జు, పొట్టి ఇవన్నీ పొట్టివాడు అనే అర్థంలో తెలుగులో వాడకంలో ఉన్న పదాలే! హిందీలో కూడా వామనుడు (unusually short statured) అనే అర్థం లోనే టింగనా అంటున్నారు. తెలుగు నిఘంటువులు మాత్రం పిల్లవాడు, పొట్టివాడు అనే అర్థాలతోపాటు స్వల్పమైన, అల్పమైన, తేలికపాటి విషయాలకి్కూడా ఠింగణా, టింగనా పదాల్ని పేర్కొన్నాయి.

టిగ్యా అంటే చిన్నది. కింగణా అంటే రవ్వంత అని! జింగిణీ అని కూడా అంటారు. కింగణాస్వామి అంటే వినాయకుడు.

రాయలవారు కూడా "ఇసుమంత ఠింగణావు" అనటం వలన అల్పుడవు అనే అర్థమే ధ్వనిస్తోంది. యామన బ్రహ్మచారి పొడుగరా లేకా పొట్టియరా అనేది అప్రస్తుత్తం. "శివతత్వాన్ని తెలుసుకోగలిగేంత పరిపక్వత లేని అరబుడ్డోడివి" అనే అర్థంలోనే ఈ పదాన్ని వాడినట్టు భావించవచ్చు. అణాకి టికానా లేని వాడు ఆర్థిక శాస్త్రం గురించి అనర్గళంగా ప్రసంగించటం లాంటిది యామునా చార్యుడు శివతత్త్వ విమర్శ చేయటం అని రాజుగారి అభిప్రాయం. టికానా లేనివాళ్లంతా టింగనాలే! ఠికాణా లేదా టికానా కూడా చాలా అందమైన హిందీ పదం. టికానా లేనివాడంటే. ఉనికి లేనివాడని! తాడూ బొంగరం లేనివాడన్న మాట. వాడి టికానా తెలీదంటే whereabouts తెలీవని! "పక్షులకు ఆ చెట్టు ఓ టికానా", "ఆయన చూపు ఇంకో టికానా మీద వుంది", "దీన్ని మన టికానాకు పంపు" లాంటి ప్రయోగాలున్నాయి. అలాంటి ఉనికి లేని వాడు టింగనా!

టర్కీలో ఫ్లై ఓవర్ ప్రారంభించటానికి దేశాధ్యక్షుడు రాగా ఆయన కన్నాముందే ఓ టింగనా(బుడ్డోడు)గాడు రిబ్బను కత్తిరించేశాడు.

వర్జీనియాలో ఎలిమెంటరీ స్కూల్లో ఆరేళ్ళ టింగనాగాడు తరగతి గదిలో టీచరు మీద కాల్పులు జరిపి సారీ అన్నాడు.

సైకిల్ నడుపుతూ అదుపు తప్పడంతో కింద పడిపోతే, ఎవడో టింగనా గాడనుకున్నారంతా! కింద పడటం పెద్ద విషయం కాదన్నట్లు జీవితంలో ప్రతి విషయాన్ని ఎంజాయ్ చేయాలి కాబట్టి వాడువెంటనే లేచి నుంచుని డ్యాన్సు చేశాడు.

అమ్మ రోడ్డుపై నడుస్తుండగా, ఒక ఎద్దు దాడి చేసింది. ఆరేళ్ళ ఆమె కొడుకు కాపాడడానికి పరుగెత్తుకుంటూ వచ్చి ఎద్దు నుంచి తప్పించుకుని అమ్మను కాపాడాడు. టింగనా గాడనుకున్న ఎద్దు నిర్ఘాంత పోయింది!

తెలుగు భాషే తెలియని పోలెండు కుర్రాడు బుజ్జి తాను టింగనాని కాదంటూ ఘంటసాల పాటలన్నీ పాడేస్తున్నాడు.

సద్దామ్ అనే టింగణా గాడికి వాళ్లమ్మ కాటుక బెట్టబోయింది. వాడు వద్దని మారాం చేస్తే వాళ్లమ్మ వీపు మీద ఒక్కటిచ్చింది. అంతే వాడు పోలీసులకు చెప్పి వాళ్ళమ్మని జైల్లో పెట్టమన్నాడు.

ఇలా టింగనా ప్రయోగాలు ఎన్నయినా దొరుకుతాయి. ప్రాచీన నిఘంటువులు 500 యేళ్ల క్రితమే దీన్ని తెలుగులోకి స్వీకరించాయి. వాడుక మరచింది మనమే! తెలుగులో లక్షకు పైగా పద సంపద ఉంది. నాలుగోవంతుకూడా మనకు తెలీవంటే బాధే!



# ఏకాకి

**"ఆకాశము నొసట పొడుచు అరుణారుణ తార!**

**ఏకాకి నిశీథి నొడుచు తరుణ కాంతిధార !"**

దేవులపల్లి కృష్ణ శాస్త్రిగారు -అమృతవీణ' గేయసంకలనంలో రాత్రిని 'ఏకాకి' అన్నారు.

"నీ యింటికి పిలువకు, నను లోనికి రమ్మనకు

రే యని, నీ వీధిని బడి పోయే ఏకాకినని నీ యింటికి పిలువకు" అంటూ తాను కూడా ఏకాకినేననీ, "దారి వెంట కలలేవో సారెసారె ఏరుకుంటూ, ఏరెరుగని పాట ఏకతారపైన మీటుకుంటూ పోయే"వాడిననీ అన్నారు.

"నిలవరాదు కృష్ణరజని" ఈ చీకటి తొలగిపోవాలని, స్వామికొలువులో మంగళ విభాత కలగీతిక పాడుకోవాలని కోరుకున్నారు.

"ఏకాకి నైతిరా-దేవా నేను

ఏకాకి నైతిరా-ఓ

దండపాణి నా దండ నీవుండ" అని అచ్యుతన్న గోపాలశర్మ అనే కవి గోపాలదాస కృతుల్లో ఓ కీర్తన వ్రాశారు. ఏకాకి అంటే అందరూ వదిలేసినవాడు కాదు. అందరినీ, అన్నింటినీ వదిలేయగలవాడని!

అమ్మకడుపులో ఏకాకిగానే ఉండి, మనుషుల మధ్య పుడతాడు జీవి. మళ్లీ మనుషుల్లోంచి ఏకాకిగానే వెళ్లిపోతాడు. మనుషుల్లో ఉన్నంత సేపే జీవితం. రెండు స్త్రీ పురుష జీవకణాలు ఏకాంతంలో కలిసి -'ఏకాకి'ని సృజించాయి. అలా ఏకాకి ఎకాఎకిన మనిషిగా ఎదిగాడు. అతని మూలాలు ఏకాకీయతలోనే ఉన్నాయి. అప్పుడప్పుడూ ఏకాకితనం అతనికి అనుభవంలో కొస్తూనే ఉంటుంది. తాను ఏకాకిగా ఉన్నప్పుడే దాన్ని గుర్తించగలుగుతాడు మనిషి.

"యోగీ యుంజీత్ సతతమాత్మానం రహసి స్థితః

ఏకాకి యత్చిత్తాత్మా నిరాసీపరిగ్రహః" అన్నాడు గీతాకారుడు. మనిషి ఏకాకిగా మారి, ధ్యానం పైన మనసు నిలిపితే యోగస్థితి కలుగుతుందంటుంది

ఈ గీతావాక్యం. యోగస్థితి ఒక అత్యున్నత స్థితి. ఏ రంగంలో అత్యున్నత స్థితిని పొందినా అది యోగమే! ఇది భక్తికో మతానికో సంబంధించిన సూత్రం కాదు.

అటూ ఇటూ దరిదాపుల్లో ఎవరూ లేకుండా తానొక్కడే చేరగలిగిన చోటు 'అత్యున్నతి'! పక్కన ఎవరూ లేకపోవటమే కదా ఏకాకి స్థితి! కాబట్టి, మనం అలాంటి ఉన్నతత్త్వంలో ఏకాకులం కావాలి!

నిరంతర పరిశ్రమ, నియమబద్ధ జీవితం, కఠోర దీక్ష, అంకిత భావాల వలన అంతటి ఏకాకితనం సిద్ధిస్తుంది. ఇదే తపస్సు అంటే! మనిషి సమస్తం లోంచి ఏకాకిగా మారి, ఏ రంగంలో ఉన్నతి కావాలంటే ఆ రంగంలో సాధన చేయాలి. తదేక ధ్యానంగా పనిచేయాలి.

ఏకాకితనం లోంచే మనిషి అవతరించాడు కాబట్టి, మనిషి లోపల్లోపల 'ఏకీయత' (associate) ఏకాకిగా దాగుంటుంది. పాలలో సమానంగా నీళ్లు కలిపితే పాలు రెట్టింపు అవుతాయి. కానీ, ఆ పాలలో ఉండే ఏకీయత రెట్టింపు కాదు. తోడేసి చిలికితే ఏకీయత పాల లోంచి పైకి ఉబికి వచ్చి వెన్నలా తేల్తుంది. అదీ నిగ్గు తేలిన నిజం. ఇన్నాళ్లూ ఈ నిజం ఎక్కడుందీ? పాలలో ఏకాకిగా దాగుంది.

మనిషి విషయంలోనూ ఇంతే! లౌకిక వ్యవహారాలు జీవితాన్ని ఎంత పలుచన చేసినా మనిషిలోని ఏకాకితనం పలుచ బడదు. ఆ మనిషి ఉన్నతికోసం అంటే స్వంత ఏకీయత కోసం, ఎవ్వరూ అందుకోలేనంత వంటరి స్థితిని (highest of the high) పొందటం కోసం సాధన చేస్తే ఏకీయత వెన్నలా వెలికి వస్తుందన్నమాట.

"లోక సౌందర్యాన్ని నాయింట్లోకే తెచ్చావు, ఎక్కడికీ వెళ్లాలనిపించదు" అంటుంది చలంగారి యశోద కృష్ణుడితో. ఆ తల్లి హృదయం ఏకీయతని కోరుకుంది. అందులోనే పారలౌకిక ఆనందాన్ని ఆమె అనుభవించింది. మనిషికి ఈ ఆనందం ఎక్కడిది? ఏకాకి అనుక్షణం ఈ ఆనందాన్ని ప్రసారం చేస్తుంటుంది.

"హృదయము పదిలంబైతే, గుదికొను సన్యాసమునకు కొమ్ములు గలవా?" అని వేమన సన్యాసుల్ని ఎద్దేవా చేశాడు.

పదిలంగా హృదయం ఉండాలంటే హృదయాన్ని చెరిచే కామ్యకర్మలు వదిలేయాలి. వేమన దాన్నే జ్ఞానం అనీ, శంకరాచార్యుల వారు సన్యాసం అనీ అన్నారు. నిజానికి, ఇవి రెండూ పర్యాయపదాలే!

'ఏకాకి' అంటే సన్యాసి, ఏకాకి అంటే జ్ఞాని, ఏకాకి అంటే అత్యున్నతుడు కూడా! ఏకాకి అయిన సన్యాసిని శంకరులు 'అసహాయుడు' అన్నారు. అంటే, తానొక్కడే చేరగలిగిన అత్యున్నత స్థితిని పొందిన వాడని! ఫలితాలతో నిమిత్తం లేకుండా ప్రతిఫలాపేక్షరహితంగా మన విధిని మనం సక్రమంగా నెరవేరిస్తే పొందగలిగే ఆ ఉన్నత స్థితిని పొందవద్దని ఏ సన్యాసమూ చెప్పదు. ఏ మతమూ ప్రబోధించదు.

ఏ 'కాకి'కీ ఏకాకితో సంబంధం లేదు. ఏకాకి సంస్కృత పదం. 'ఎక్కటి' దీనికి చక్కని తెలుగుమాట. ఎక్కటి అంటే ఒక్కటి, single-handed అసహాయమైన అని! Noble, great, superior అని దీని భావం. ఈ స్థితిని పొందినవాడు 'ఎక్కటీడు'(A hero who is withoutany assistants). ఒంటరి అని కూడా అనవచ్చు. కానీ, ఒక్కటి అనే పదంలోని ఔన్నత్యం ఒంటరి అనటంలో లేదు. 2000 మిలీనియం సంవత్సరం తరువాత మనలో వాణిజ్య సంస్కృతి ఛాయలు మితిమీరి మానవ సంబంధాలు తగ్గిపోతూ వస్తున్నా. ఏకాకి (జ్ఞాని) కావల్సిన మనిషి 'ఒంటరి' అవుతున్నాడు. అసహాయుడు కావాల్సిన మనిషి నిస్సహాయుడు అవుతున్నాడు.

డబ్బు పారేస్తే దేన్నైనా కొనవచ్చనీ ఒకరితో తనకు నిమిత్తం లేదనే ఆలోచనా విధానం అసహాయత కాదు, నిస్సహాయతే! కరోనా కష్టకాలంలో డబ్బు పారేసి ఆయువు కొనగలిగారా కోటీశ్వరులు? వ్యావసాయిక సంస్కృతిలో జీవించే గ్రామీణులే భద్రంగా ఉన్నారు. అందుకే, కాలమాన పరిస్థితులు గుర్తెరిగి, తన ఆలోచనా విధానంలో మంచీ చెడులు వితర్కించుకోవాలి.

విదేశీ భాష, వాళ్ల ఆచార ఆహారాలు, వారి జీవన విధానాలపట్ల వ్యామోహం వదిలితే సగం ఉన్నతి సాధించినట్టు! దేశీయతని గౌరవించ గలిగితే అత్యున్నతిని పొందినట్టే! "తెలుగు వారు 9 కోట్లమంది ఉన్నారని అంటున్నారు. కానీ, ఈ 9 కోట్లమందీ తొమ్మిది ఒకట్లుగా జీవిస్తున్నారు, అందుకే తెలుగు

భాషను కాపాడుకోవటానికి సంఘటితం కాలేక పోతున్నారు” అని ఆచార్య కొలకలూరి ఇనాక్ ఒక సభలో అన్నారు. ప్రతీ తెలుగువాడు ‘ఎక్కటీడు’ కావాలంటే ఏం చెయ్యాలో దిశా నిర్దేశం చేశారాయన.

ఒంటరి అని వ్రాస్తే, ఛాందసవాదంగా బావించి వంటరి అని రాస్తుంటారు కొందరు. వంట చేసేవాడు వంటరి. ఒంటిగా అంటే ఇతరులు తనకు సాటిరానంతగా జీవించేవాడు ఒంటరి.

జపాన్ భాషలో ఏకాకి అంటే ‘బొమ్మలేసే చిత్రకారు’డని Nihongo Master నిఘంటువు పేర్కొంది. చిత్రకారుడంటే, బొమ్మను చేసి ప్రాణం పోసే బ్రహ్మ. ఏకాకి అంటే బ్రహ్మే! సమాజ హితం ఏకాకి ఏకైక లక్ష్యం.

మనిషి ఆలోచనలు ఉన్నతంగా ఉండాలి. మనసు ఆదరణ, ఆప్యాయతలతో నిండాలి. హృదయం జ్ఞానపరిపూర్ణం కావాలి. మనిషి తనలోని ఏకాకీయతని మేల్కొల్ప గలిగితే, కష్ట సుఖాలకు అతీతంగా సమాజ హితుడౌతాడు.

సమాజ హితం అనే అంశాన్ని గాలికి వదిలేస్తే ప్రభుత్వాలే కాదు, వ్యక్తులూ కుప్పకూలతారు.



# పులికాపు

**మూ**ఁడుగిన్నెల కాఫితో మూఁడుసార్లు పూర్వసంధ్యాచమనమును బూర్తిజేసి
నిత్యహోమాగ్నిహోత్రత నిలుపుకొనఁగ దడవు లేకుండ సిగరెట్లుఁ దగులఁబెట్టి
రామచంద్ర చరిత్ర పారాయణమును వదలి రైనాల్డ్స్ మునిసూత్ర పఠనఁజేసి
చిత్తమాలిన్యమార్జన చింతవిడిచి కోటుజోడుల పులికాపు కుస్తరించి
మైలగుడ్డలతోడ లాల్చీలతోడ గాజుకనులతో మేకతోల్కాళ్లతోడ
వట్టి పరిషేచనముఁగూడఁ గట్టిపెట్టి,
ములఁగ కాడల నీరుల్లి ముక్కలందు మిగుల నింగ్లీషుముక్కల మేళవించి
యంటుసొంటైన లేకుండ నారగించి విపణికో న్యాయసభకునో వేగఁబోయి
యాడఁగూడని యాటల నన్నియాడి పైనగడియించి యింటికి వచ్చు వేళ
గొల్లదేవు మోమును జూడ గుడికిఁ బోక పల్లెపృష్ఠంబులను జూడ వార్థికేగి
సరగ నింటికివచ్చి భోజనముచేసి లొట్టుబట్టీయమునఁ బొగచుట్టుఁ గాల్చి
యాంగ్రపత్రికఁ గదనవార్తాలి చదివి కునికి కుట్టని నిద్రించి కొంపఁగాల్చి
యింటియాబిడ నెవ్వడో మింటిగుమ్మటమునఁ గొనిపోయె ననుచు స్వప్నమును
గాంచి
చచ్చితిని మొఱ్ఱోయని లేచి సంజ్ఞనొంది కడుపునొక్కుతో వాఁచిన కనులసొక్కుతో
మెడనరంపు టెక్కుతో దుర్భరంపు నొంటితల పక్కుతో గొంతునొక్కుతో
నశించు రుక్కుతోనున్న మీరిట్టి మీర లార్యనామార్చు లగుదురే? యక్కటకట"

పానుగంటివారి 'సాక్షి' (1913 - 1933) వ్యాసాల్లో ప్రసంగ వశాత్తూ వదిలిన పద్యం ఇది. ఇందులో యుద్ధవార్తల కోసం ఇంగ్లీషు పేపరు చదవటాన్ని ప్రస్తావించారు కాబట్టి, ఈ రచన 1917తో అంతమైన మొదటి ప్రపంచ యుద్ధ కాలం నాటిది కావచ్చు.

ఆంగ్ల భాషావ్యామోహం, ఆంగ్లేయుల మాదిరిగా జీవించాలనే తపనతో సంస్కృతిని, సంస్కారాన్ని మరిచిన విద్యావంతుల తత్వాన్ని ఇందులో పానుగంటివారు కఠినంగానే తూర్పార బట్టారు. నాటి పరిస్థితి నేటి పరిస్థితికి

నకలుగానే ఉందనేది వాస్తవం. చాలా తేలిగ్గానే భావం అర్థం అవుతోంది కాబట్టి, దీనికి ప్రతిపదార్థ తాత్పర్యాలు వ్రాయటం లేదు. కానీ, ఆయన అలవోకగా కొన్ని కొత్త పదాలు ప్రయోగించా రిందులో! వాటి వివరణ మాత్రమే ఈ వ్యాసం.

**రేనాల్డ్స్‘ముని సూత్రం:** “పైపులో నీరు తిన్నగా జారిపోవాలేగాని సుడులు తిరుగుతూ ప్రవహిస్తే ఉష్ణవ్యాపనం సరిగా జరగదు” అనే సూత్రాన్ని వ్యంగ్యం చేసి, రేనాల్డ్స్ సూత్రంలో లాగా సంస్కృతి లోంచి చల్లగా జారుకునే తత్వాన్ని ఎండగట్టా రాయన.

**మేకతోలుకాళ్లు:** ఇది కూడా విచిత్ర ప్రయోగమే! మైలగుడ్డల్తో, లాల్చీతో, గాజుకన్నులు అంటే కళ్ళజోడుతో మేకతోలుకాళ్లు అంటే మేజోళ్ళతో తిరిగేవారిని తిట్టారిక్కడ. బూట్లు వదిలేసి, సాక్సుతోనే అన్నం తినేవాళ్లని మేకతోలు కాళ్లు అన్నారు. గుళ్ళోకీ్క్కూడా అలానే వెడ్తున్నారు కదా!

**పల్లెపృష్ఠం:** గోవిందుడి గుడికి కాకుండా పల్లెపృష్ఠాల్ని జూడటానికి వెళ్ళాడట. బహుశా చెంబు పుచ్చుకుని దారిపక్కన అటు తిరిగి కూర్చునే పల్లెస్త్రీల పృష్ఠాల్ని(వెనుకభాగాన్ని) చూడటం కోసం సముద్రం వైపు షికారు నెపంతో వెళ్లే ‘నేత్రయోని’ గాళ్లని తిట్టారీ పదంతో! చూపులతో లైంగికోత్తేజం పొందే(Pornography) చెడ్డ నైజాన్ని నేత్రయోని అంటారు.

**లొట్టుబట్టీయమునఁ బొగచుట్టుఁ గాల్చి:** లొట్టి అంటే పొడవైనది. బట్టీ అంటే పొయ్యి. పొగగొట్టంలో(tobacco pipe) పొగాకు చుట్ట పెట్టి పొగత్రాగుతారని హేళన చేశారు.

**మింటిగుమ్మటం:** అతని భార్యని ఎవడో మింటిగుమ్మటంలో (పారాచూట్) ఎత్తుకుపోతున్నట్టు కలగన్నాడట. చచ్చింది గొర్రె! ఆంగ్లవ్యామోహపరులకు ఇలానే జరగాలని మనకూ అనిపిస్తుంది ఇది చదివితే!

**కోటుజోడుల పులికాపు కుస్తరించటం:** పులికాపు అంటే స్నానాదులతో శరీరాన్ని శుద్ధి చేసుకోవటం. పులికాపు చేసుకోకుండా అంటే చిత్తమాలిన్యాల్ని, శరీర మాలిన్యాల్నీ శుభ్రపరచుకోకుండా డాబుసరిగా సూటూ బూటు వేసుకు తిరిగే తెల్లకాలర్లని యద్దేవా చేశారు.

పానుగంటివారు వాడిన ఈ పదాల్లో కొన్ని జనవ్యవహారంలో ఉన్నాయి!

పులికాపు పదాన్నే తీసుకోండి... ఇది వైష్ణవ భక్తికి సంబంధించిన పదం. చింతపండు రసంతో దేవతా విగ్రహాలను తోమి మెరుగుపెట్టటం పులికాపు. పులికాపు పెట్టి, పునరావాహన చేసి ప్రతిష్ఠించి పూజిస్తారు. క్రమేణా నీళ్లతో అభిషేకాన్ని కూడా పులికాపు అనటం మొదలుపెట్టారు. "పూరాపుళికాపు, గంబూరా, జాఫరా, కస్తూరి, పునుగు, చట్టంగిన్నె అని 5 రకాలుగా పులికాపు పెడతారు. పూరాపుళికాపు అంటే, తక్కిన నాలుగూ కలిపి చేసే సేవ-" అని 'తిరుమలై తిరుపతి యాత్ర'లో శ్రీ ఎస్. వి లక్ష్మీనారాయణ వ్రాశారు. ఈ పూరా శబ్దం, పుళికాపూ రెండూ తెలుగు వాడుక పదాలు కావు.

'వైష్టవ ప్రభావాన్ని పుక్కిలించే తమిళభాషాపదాలు' అంటూ తూమాటి దొణప్పగారు 'పాశురం', 'పుళికాపు'(పులికాపు) 'శళ్వప్పిళ్ళ' మొదలైనవి కూడా వైష్ణవవాసనావాసితాలు అని 'తెలుగులో సజాతీయ భాషాపదాలు' వ్యాసంలో వ్రాశారు. వైష్ణవం ద్వారా తెలుగులోకి చొరబడిన ఈ పదాలలో అధికభాగం తెలుగు వారికి అర్థాలు తెలియవు. భక్తికొద్దీ వాటిని వాడ్తున్నారంతే! దాని వలన పులికాపు లాంటి పదాలు అర్థవిపర్యయం చెంది, భగవత్సేవకు సంబంధంలేని ఇతర అంశాలకు ప్రయోగించటం అలవాటైంది.

'వీరేశలింగంగారి సాహిత్య కృషి' అనే వ్యాసం (1948-అభ్యుదయ)లో కొడవటిగంటి కుటుంబరావుగారు "ఒకసారి రాసినది. తిరిగి చూడడంగాని తుడుపులూ, హంసపాదములూ పెట్టటంగాని ఆయనకు అలవాటు లేదు ఆ అలవాటే ఉంటే తన రచన మరింత ఆకర్ష వంతంగా ఉండి ఉండునని ఆయనకూ తెలుసును. కాని కేవలమూ ప్రజల నాకర్షించటానికి తన రచనలకు పులికాపు చేస్తూ ఉన్నట్టయితే ఆయనకు ఇంత విశాలమైన సాహిత్యకృషి. సాధ్యమై ఉండేదికాదు" అని వ్రాశారు. 'తన రచనలకు పులికాపు చేయటం' (స్వయంగా ఎడిట్ చేసుకోవటం) అనే ప్రయోగం కొత్తది!

"కిలమూరిన రాగిరేకులకు పులికాపు పెట్టినట్లు, బూజుపట్టిన తాటియాకులకు కాకరాకు పసరు పూసినట్లు, దూగఱ కప్పిన అద్దమును వెలిమిడితో తుడిచినట్లు కొండమాచార్యుల పద్యరచనలో నిర్మృష్టమైన అన్నమాచార్యుల స్వరూపము సరిక్రొత్తగా నిగ్గులు తేలుచున్నది"మల్లంపల్లి శరభయ్యశర్మగారు

అన్నమయ్య కీర్తనలమీద కొండమాచార్యులవారి విశ్లేషణపై వ్యాఖ్యానించారు. తుప్పు రాలగొట్టటం అనేది ఇక్కడ పులికాపు పదానికి అర్థం.

ఆరునదులు నవలలో విశ్వనాథ సత్యనారాయణగారు "...సోఫియా వచ్చింది. కమలకు గుండె గుభీలుమన్నది. మళ్ళీ కొంపంతా పులికాపు ఎక్కడ పెట్టుకొంటాము. మళ్ళీ తుంగచాపమీద ఎక్కడ పడుకొంటాము" అని సోఫియా రాక కారణంగా మొత్తం ఇంటిని శుద్ధి చేయటం అనే అర్థంలో పులికాపుని ప్రయోగించారు. "కాఁపున్న రక్కసులఁ బులి కాపొనరింపంగఁ దొడరి కదిసి చమరి..." లాంటి కవిప్రయోగాలున్నాయి. రాక్షసులకు పులికాపు పెట్టడానికి సిద్ధం కావటం అని!

తెలుగు వ్యుత్పత్తి కోశంలో పులికాపు అంటే, కొట్టడం, తన్నడం అనే అర్థాలు కనిపిస్తాయి. ఈ పదాన్ని మామూలు కొట్లాటకి కాకుండా, పోలీసు శైలిలో మూడోకోణ విధానం(third degree method) లాంటి విషయాలకు "పోలీసు స్టేషన్లో పులికాపు ప్రయోగం" అనీ, "సుపారీ పుచ్చుకుని రెక్కీ నిర్వహించి వేటకొడవళ్లనో తుపాకుల్నో ప్రయోగించిన స్థాయిలో జరిగిన దాడిని "పులికాపు పెట్టారు" అనీ తేలికమాటలతో లోతైన అర్థాన్ని వివరించ గలిగితే భాష, భాషణం రెండూ కుసుమితం అంటే ఫ్లవరీగా ఉంటాయి.

పానుగంటివారు "కోటుజోడుల పులికాపు కుస్తరించి" అనటానికి వెనుక ఇంత కథ ఉంది!



# అందదుకు

**"అం**దదుకు" అంటే, చెప్పీచెప్పనట్టు, చేసీచేయనట్టు, అందీ అందనట్టు, అతికీ అతకనట్టు, చాలీచాలనట్టు, వ్రాసీవ్రాయనట్టు, చూసీచూడనట్టు, ఇచ్చీఇవ్వనట్టు, పెట్టీపెట్టనట్టు జరిపే వ్యవహారం. పద్యశాసనాలకన్నా, ఆంధ్రమహాభారత అవతరణకన్నా అత్యంత ప్రాచీన కాలం నాటి ప్రజల వాడుక తెలుగు పదం ఇది.

భాషల ఆకాశంలో మెరిసే ప్రతీ పదమూ ఒక నక్షత్రమే! ప్రతీ నక్షత్రమూ ఒక సూర్యుడే! మన నిఘంటుకర్తలు చాలా పదాల్ని పరిహరించి నిఘంటువుల కెక్కకుండా చేశారని గిడుగువారు సూర్యరాయాంధ్ర నిఘంటు విమర్శన సందర్భంలో ఆవేదన వెలిబుచ్చారు. యతిప్రాసలకు లొంగకో, సందర్భం కుదరకో ప్రాచీన కవులు కూడా విస్మరించిన తెలుగు పదాలు అనేకం ఉన్నాయి. అందదుకు కూడా వాడీవాడనిదిగా మిగిలిపోయింది. వాడకం లేకపోతే పెద్దపెద్ద యంత్రాలే తుప్పెక్కుతాయి. మాటలూ అంతే!

'అందదుకు' అంటే, ఎక్కువ అదుకులు కలది అని! అదుకు+అదుకు ఆమ్రేడితమై 'అందదుకు' అయ్యింది! కానీ, నాడు+నాడు=నానాడు, ఇంచుక+ ఇంచుక=ఇంచించుక లాగా ఈ పదాన్ని విడగొట్టి నిరూపించటం సాధ్యం కాలేదు. ఇది నిపాత రూపం అనీ, క్రియ చేత నిరూపించటానికి అవకాశం లేనిదని, కాబట్టి "అందదుకు పృభృతులు యథా ప్రయోగంబుగ గ్రాహ్యంబులు" అని వ్యాకరణ సూత్రం చెప్తోంది. అదుకు+అదుకు 'అదదుకు' కావాలేగాని 'అందదుకు' కాకూడదు. ఇలా అయ్యిందంటే ఆ పదం సంధిరూపాన పుట్టలేదని, చాలీచాలనిది అనే అర్థంలో సహజంగా ఏర్పడి ఉండవచ్చని పండితులు భావించారు. భాష ప్రాచీనత నిరూపణకు వ్యాకరణం కూడా ఒక సాధనమే!

కట్టకడ, నట్టనడుమ అనేరూపాలలో 'కడు–నడు' శబ్దాల్నిబట్టి ద్విరుక్త 'ట'కారం' సహజంగా వచ్చిందనీ, తక్కిన వాటిలో ఇది సహజం కాదనీ వఝుల చిన సీతారామస్వామిశాస్త్రిగారు వ్రాశారు. 'ద్రావిడభాషా పరిశీలనము'లో 'సంధి' అనే వ్యాకరణ గ్రంథాన్ని, 'ఆంధ్రభాషా వికాసం' గ్రంథాలను ఆయన ఈ సందర్భంగా ఉటంకించారు. అందదుకులు, ఇఱ్ఱింకులు, ఇల్లిగ్గులు లాంటివి ఒకప్పుడు వాడుకమాటలే! వాటిలో కొన్ని ఇప్పటి వ్యాకరణసూత్రాలకు ఇమడకు పోవచ్చు. ఇంకులు+ఇంకులు=ఇఱ్ఱింకులు (ఎక్కువగా ఇంకటం), ఇగ్గులు+ఇగ్గులు= ఇల్లిగ్గులు (ఎక్కువగా వెనక్కి ఒరగటం), చెదరు+చెదరు=చెల్లాచెదరు( ఎక్కువగా చెదరటం) ఇలాంటి వాటిలో 'ఱ'కార 'ల'కార ద్వయాలు ఊరికే వచ్చి చేరాయనటం శబ్దతత్త్వపరిశీలనకు విరుద్ధం అని, మార్గాంతరాలు వెదకాలని ఆయన అన్నారు.

'అదుకు', 'అతుకు' 'అతికు' 'అత్తు' అనే రూపాంతరాలు దృఢీకరణం, గట్టిగా ఒత్తటం, అత్తుకొనటం అనే అర్థాల్లో తెలుగు, కన్నడాల్లోనూ, 'అఋతు', 'అఋత్తు' అని తమిళంలోనూ ఉన్నాయి. అఋత్తు–అఋందు–అందు ఇలా ఈ పదం పరిణమించి ఉండవచ్చు. "దీనిని బట్టి వీని కన్నిటికిని మూలమగు 'ప్రాచీనధాతువు "అఋ" అనియు దానికి "అఋందు, అందు అను రూపములు ప్రాచీనకాలమున గలవనియు నీ సమాసమందలి తొలిరూప మద్దాని సూచించుచున్నది'' అంటూ, వఝులవారు అందు+అదుకు=అందదుకు కావచ్చున్నారు. అందదుకు లాంటి పదాలు సంధివశాన వచ్చిన ఆమ్రేడిత స్థలాలు కావని, అవి ప్రత్యేక ప్రాచీన ద్రావిడపదాలని ఆయన అభిప్రాయపడ్డారు. "అదుకు+అదుకు=అందదుకు" అను ద్విరుక్తి వేగమున బూర్వశబ్దములోని 'ద' కారము సైతము నిల్వఁగా 'అదదుకు' అని సిద్ధింప వలసి యుండగా లుప్తాక్షర పరిహారముగా నానునాసిక్యము ప్రథమాక్షరమునకు వెనుక నిల్చెనని యంగీకరించుట యుక్తము" అని ఆయన సమన్వయపరిచే ప్రయత్నం చేశారు. అందు, అదుకు రెండూ ఒకే అర్థం కలిగినవి కాబట్టి, అందు+అందు=అందందు,

అందు+అదుకు=అందదుకు రూపాలు ఏర్పడి ఉండవచ్చునని మనం భావించవచ్చు.

మనకు ఒక తరం ముందునాటి కవులు ఈ 'అందదుకులు' పదాన్ని బాగానే ప్రయోగించారు. గత 40-50 యేళ్ల కాలంలోనే ఇది పూర్తిగా అదృశ్యమయ్యింది. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు 'కాళిదాస కళామందిరము' గ్రంథంలో 'అందదుకు'ని ఇలా ప్రయోగించారు: "భారవి, మాఘ, శ్రీహర్షాదులు. తమ యందు కొరవడిన అపూర్వ సృజనాత్మక శక్తిని ఛందోలంకారముల నగిషీ పనులతో కప్పజూచిరి. వారెంచుకున్న కావ్యవస్తువునకు వారి ప్రకృతి వర్ణనములతో పొత్తు కుదరక వస్తు వర్ణనమునకు నమన్వయింపరాని 'అందదుకులు' కాన్పించును" అని! కథాంశాన్ని వర్ణన అత్తుకోకపోతే అందదుకులు (అంటింపులు) కన్పిస్తాయని ఇంద్రగంటివారి భావం.

"ఆదాయానికి మించి ఖర్చులున్న మధ్యతరగతి జీవితాలన్నీ అందదుకులే!" "ఈ నాటక రచన యావత్తూ అందదుకుల్లేకుండా సాగింది" "వాడికి ఆ చొక్కా అందదుకులా ఉంది(చాలీ చాలకుండా ఉంది)"; "ఒడిదుడుకు లెన్ని ఉన్నా పీవీగారి పాలన అందదుకు ల్లేకుండా గడిచింది (మూడు అవిశ్వాసాలు, ఆరు కూల్చివేతలు జరిగినా తట్టుకుని నిలబడిందని) ఇలా నేటి అవసరాలకూ అందదుకు పదాన్ని మనమూ వాడుకోవచ్చు. అందదుకు మాటలు, అందదుకు చేతలు, అందదుకు వ్రాతలు, అందదుకు దానాలు, అందదుకు పాలనా విధానాలు, అందదుకు వ్యవహారాల్ని ఎండగట్టాలంటే ఈ పదం చాలా అవసరం. "పెట్టావులే మాలావు" అనకుండా అందదుకులా పెట్టావు అన్నప్పుడు అందులో వినయంతో కూడిన నిరసన ధ్వనిపిస్తుంది. మాటల్లో పొందిక కావాలంటే ఇలాంటి పదాల వాడకం పెరగాలి.

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు "ఇటీవలి సాహిత్యము అందదుకుల నుండి బయటపడి ఉపన్యాస వేదికలకును, ఉపాధ్యాయ పీఠములకును అంటుకొని యాత్ర గరపుచున్నది. మరల దానిని నిత్యజీవితముతో మేళవించి స్వతంత్రానుభవ

తత్వమును ప్రసాదించు నట్లు చేసికొనమేని బ్రదుకులలో బండతనము తప్ప మరేమియు మిగలక పోవును" అన్నారు (రాళ్లపల్లి వారి పీఠికలు). కావ్యభాష మీద కాకుండా, వాడుక భాష మీద ఆధారపడి వ్యాకరణ సూత్రాల రూపకల్పన జరిగితే భాషా పరిరక్షణకు మరింత మేలు కలుగుతుంది. మరుగున పడి, మృతనక్షత్రాల్లా వెలిసిపోయే వాడుకమాటల్ని తిరిగి వాడకంలోకి తెచ్చి వెలిగించే అవకాశం ఏర్పడుతుంది.

కానీ, భాషా సాహిత్యాల గురించి కేవలం ఉపన్యాసాలు, అరకొర పరిశోధనలే తప్ప రాళ్లపల్లివారు ఆశించిన "స్వతంత్రానుభవతత్వం" ఈ నాటికీ మనం పొందలేకపోతున్నాం.



# చలం

**"చనవేమెరతుఁగాని చలము సాదింపనోప**
**చెనకీసంటా నేల చేయి వట్టీనే**
**కనుసన్న మెలఁగేటి కాంతను**
**నాకీపాటి కొనగోరుదాఁకించిన కొమ్మలకేపాటో"**

"వింతవింత సతులాల వినరమ్మా! యెంతలేదు మీ కెల్లా నిదిచాలు సుండి" అనే పల్లవి కలిగిన ఈ కీర్తనలో అన్నమాచార్య 'చలం' సాధించటాన్ని అక్కసు, కసి, ఆగ్రహించటం అనే అర్థాల్లో ప్రయోగించాడు. కప్పు సాధించకపోయినా ఈ ఆటలో పాకిస్తాన్ని ఓడించి ఇండియా 'చలం' సాధించింది అంటే, పగ తీర్చుకుందని!

వెంకటాచాలం, శేషాచలం లాంటి పేర్లని ఇంగ్లీషులో పిలిచేప్పుడు జి. వెంకటాచలం, జి. వి. చలం అయ్యాడు. ఇలాగే, చాలామందికి చలం అనే పేరు స్థిరపడింది. 'అచలం' అంటే కదలనిది కాస్తా 'చలం'గా కదిలిపోయింది. తెలుగు సాహిత్యంలో 'చలం' అనే పేరు ఎందరికో ఆరాధనీయం. సినీనటుల్లో కూడా ఇద్దరు చలాలు తెలుగువారికి అభిమానపాత్రు లయ్యారు. చలంగా ప్రసిద్ధులు ఇప్పటికీ ఉన్నారు.

సంస్కృతంలోనూ తెలుగులో కూడా చలం ఉంది. సంస్కృత చలం అంటే, వణుకు, చలచిత్తం, చపలచిత్తం అని! తెలుగు చలం అంటే మాత్సర్యం, రోషం, పట్టుదల. రెండూ ప్రతికూల భావాల్నే ధ్వనిస్తాయి. అందుకే, 'చెలం' అని రాసుకోవటమూ కనిపిస్తుంది. చెలమ అంటే దొరువు, వాగులు, నదులు ఎండిపోయినప్పుడు ఆ ఇసుకని గుంత తవ్వితే అందులోకి ఊరే నీరు చెలమ. ఈ అర్థంలో చెలమ్ పదాన్ని వాడకంలోకి తెచ్చింది గుడిపాటి వెంకటాచెలం గారే!

చలం అనే తెలుగు పదాన్ని మన ప్రాచీన కవులు విస్తృతమైన అర్థాల్లో

ప్రయోగించారు. వాటిలో చాలా అర్థాలు నిఘంటువుల కెక్కలేదు. ఆ సందర్భాన్ని బట్టి దాని అర్థాన్ని ఊహించుకోవలసిందే! అన్నమయ్య ప్రయోగాలు కొన్ని పరిశీలిద్దాం:

**గాఢమైన కోరిక:** "యెలమి శ్రీ వేంకటేశ నిప్పు డిట్టె కూడితివి/చలము దీరెను మీలో సమ్మతులే మేలు" 'రిరంస' అనే సంస్కృత పదానికి సమానార్థకంగా 'చలం' అని అన్నమయ్య ప్రయోగించాడు. తీవ్రమైన కామవాంఛ. కుతి అనటంకన్నా గాఢమైన పదం చలము. చలము తీరిందన్నాడు అన్నమయ్య.

**దుఃఖపెట్టటం:** "చతురుఁడ నీకాకెతో చలము లింకానా..." ఆకె అంటే ఆవిడ. ర్యాగింగుల్లాంటివి చేసి ఆమెని ఇంకా ఏడిపించాలా?

**అక్కసు:** "చలము సాదించేది మచ్చరవు వారికిఁగాక/సులభులై యుండిన చుట్టాలకేలే"మత్సరం అంటే రోషం, హటం, మోడి.

చలముకొను, చలపట్టు, చలపొడుచు ఇవన్నీ చలము సాధించటం అనే అర్థంలో పదాలే! మత్సరం కలిగినవారి మీద చలం సాధించాలే గాని, అనుకూలంగా ఉండే వారిమీద సాధించటం ఏమిటనేది ఇందులో ప్రశ్న!

**కార్పణ్యం:** ''చలము సాదించరాదు సముకానఁ గొంచరాదు'' అనుకూలవతిపైన కార్పణ్యం కూడదని! అదావత్ అంటారు హిందీలో.

**మోసం:** "చనవులు గలిగితే చలము పనికిరాదు" చనవురాలు అంటే జవరాలే! చనువు కలిగాక ఆమెను మోసం చేయకూడదని!

**అలక:** "చలము సాదించేవేళ చవులు సేసుకొని/పిలిచి విందుచెప్పేతే ప్రియము లౌనా" అలకమీద ఉన్న ప్రియురాలిని ముఖం ఇంత చేసుకుని విందుకు పిలిస్తే ఇష్టపడ్తుందా?

అన్నమయ్య లాగానే క్షేత్రయ్య కూడా చలం పదాన్ని విస్తృతంగా ప్రయోగించాడు:

**ముఖం చాటు వేయటం:** "పొలతిరో! మా మువ్వగోపాల రాయుడు చలము చేసినాడు"

**నిర్లక్ష్యం:** "పూని చలము జేసేది మరియాదనా" కావాలని నిర్లక్ష్యం చేయటం.

**వైరం:** "చెలిమి చేసే దందు చలము చేసే దిందు/వలచి యుండే దందు–

వచ్చి యుండే డిందు" అక్కడికెళ్ళి చెలిమి చేస్తావు, ఇక్కడకొచ్చి చలము చేస్తావంటుంది నాయిక

**పగ:** "చెలియరో! దైవము – చలము సాధించె నయ్యా" 'హతవిధీ' అనటం లాంటిది.

**కపటం:** "ఏమో మాయ వలపా లాగున చలము జేసెనే!" అతని మీద ఇంత మోహం ఎలా కలిగిందని అడిగితే, వలపు ఆ విధంగా చలము చేసిందంటుంది నాయిక

**సందిగ్ధత:** "ఏలర వూరక చలము? మువ్వ గోపాల !"

**అగ్రహం:** "చలము వలదె కొమ్మ! వాడు రెండు దలచెనమ్మా!"

చలము అనే పాదం వెనుక ఇన్ని అర్థాలున్నాయి. వెదికితే ఇంకా కవి ప్రయోగాలు అనేకం దొరుకుతాయి కూడా! చలం అనే పేరు పెట్టుకోవటం సంగతి సరే, ఈ పాదాన్ని ఇన్ని అర్థాల్లో వాడుకునే వీలుండగా మనం వదిలేసుకున్నాం దేనికని?

'వానల కాలంలో మబ్బులు చలంచేశాయి. చుక్క రాల్లేదు' అంటే ముఖం చాటేశాయని, నమ్మించి మోసం చేశాయని!

వాడింకా చలంచేస్తూనే ఉన్నాడంటే మీనమేషాలు లెక్కిస్తూ ఒక నిర్ణయానికి రాలేకపోతున్నాడని!

"ఆ రోజున వాడి మాటలు చలము చేశాయి. నమ్మి పిల్లనిచ్చాను" అంటే మోసగించాడని!

"పన్నులు పెంచి ఆపన్నుల మీద ప్రభుత్వమే చలంచేస్తోంది" అంటే, కక్ష సాధిస్తోందని!

"కార్యకర్తల్ని చలంచేసే పార్టీకి మనుగడ ఉండదు" అంటే, నిర్లక్ష్యం చేయటం, ఉపేక్ష వహించటం.

"మొదట ఏదో పొరబాటున చేసి ఉంటాడనుకున్నాను. కానీ, చలం సాధిస్తున్నాడని ఇప్పుడర్థం అయ్యింది" ఇది కసి సాధించటం.

ఇంత వైశాల్యం ఉన్న ఈ పదాన్ని కేవలం అచలానికి వ్యతిరేక పదంగా భావించి వదిలేసుకోవటం దేనికి? వాడుక మరచిన మాటల్ని వాడకంలోకి తెచ్చుకుని

భాషను పెంపు చేసుకోవటం, భాషపరమైన అవసరాలకు వాటిని ఉపయోగించుకోవటం నేటి అవసరం.

1894 లో జన్మించిన చలం తన కాలానికన్నా ముందు నడిచిన గొప్ప ఆలోచనాపరుడు. సంప్రదాయపు గుదిబండల్ని మోస్తో చలమైపోతోన్న స్త్రీని తన సాహిత్యానికి వస్తువుగా గ్రహించిన చెలం స్త్రీ చైతన్యం కోసం చెలమరించాడు. శక్తిరూపిణులుగా మారి స్త్రీలు చలం సాధించాలన్నాడు. అందుకోసం తన కలం చలాయించాడు. ఆయన అచలం మాత్రమే కాదు చలాయించిన చలం కూడా!



# వరువాత

**“ల**ఘుపతనకమను వాయసము మేలుకొని రెండవ యముని వలె సంచరించుచున్న కిరాతునిఁ జూచి ‘వఱువాత లేచి వీని మొగము చూచితిని. నేడేమి కీడు రాఁగలదో తెలియదు. వీడు వచ్చినచోట నిలువఁదగదు. జాగు చేయక యీచోటు విడిచిపోవలె’నని యత్నము సేయుచుండగా...” (పరవస్తు చిన్నయసూరి మిత్రలాభం)

మిత్రలాభం కబ్బంలో మొదటి వరుసలోనే ఈ మాటలు కనిపిస్తాయి. లఘుపతనకం అనే కాకి పొద్దున నిద్రలేస్తూనే రెండో యముడు అనదగిన ఓ కిరాతుణ్ణి ‘వరువాత’ చూసి, పొద్దున్నే వీడు కనిపించాడు, ఇవ్వాళ ఏ కీడు రానుందో త్వరగా ఇక్కణ్ణుంచి వెళ్ళిపోవాలని ప్రయత్నించిందట. అర్థం అయ్యేలా చెప్పటం ఒక్కటే కాదు, తగిన కొత్తపదాల్ని కూడా విద్యార్థులకు పరిచయం చేయాలని పరవస్తు చిన్నయసూరి సంకల్పం. ఆ విషయాన్ని ఆయన తన లక్ష్యప్రస్తావనలో చెప్పుకున్నారు కూడా! ఈ వాక్యంలో ఆయన “వరువాత” అనే పదాన్ని పరిచయం చేశాడు.

చిన్నయసూరి మిత్రలాభం, మిత్రభేదాలలో ఇలా అనేక తెలుగు మాటలున్నాయి. వాటిని మన పూర్వులు నోరారా పలికారు. మన భాష చాలా చిన్నదని, చాలినన్ని తెలుగు మాటలు లేక సంస్కృతాన్ని అరువు తెచ్చుకున్నామనీ, ఇప్పుడు ఇంగ్లీషుని ఆశ్రయిస్తున్నామనీ భావించేవాళ్లూ ఉన్నారు. ఇది నూరుపాళ్లూ అపోహే! మన అన్ని అవసరాలకూ చాలినంత భాష మనది! ఒక్కోసారి సంస్కృతం, ఆంగ్లంలో కూడా లేని అర్థాన్ని ఇవ్వగలిగినంత భాష కూడా! ఈ ‘వరువాత’ అంతటి పదం.

ఈ పదం గురించి అప్పట్లో పండితుల మధ్య పెద్ద చర్చే జరిగింది. కొందరు ‘వరు(ఱు)వాత లేవటం’ అచ్చుతప్పనీ, ‘తరువాత’ అని దిద్దుకోమన్నారు. అర్థంకానిదంతా తప్పని భావించేవారు చాలామంది ఉన్నారు. అది గ్రాంథిక పదం అన్నవాళ్లూ ఉన్నారు. కొరుకుడు పడని తెలుగుని మన నెత్తిన రుద్దాడని

చిన్నయసూరిని ఈసడించేవాళ్లు నేటికీ మేధావులుగానే చెలామణి అవుతున్నారు. వారి అనాలోచిత చర్య వలన మరుగున పడిన చాలా తెలుగు మాటల్ని వాడకంలోకి తేవాలనుకున్న సూరిగారి ఆలోచనలకు అంతరాయం కలిగింది. తెలుగు భాష పుష్టికి కూడా విఘాతం కలిగింది. మనం మరచిన ఒక తెలుగుమాట గ్రాంథికం ఎలా అవుతుంది? మనకు తెలీనిదంతా గ్రాంథికం కాదు. 'వరువాత లేవటం' అనేది తెలుగులో మంచి పలుకుబడి!

పగటి కాలాన్ని ప్రాతః (సూర్యోదయ సమయం), సంగవ, మధ్యాహ్నం, అపరాహ్నం, సాయంత్రం అని 5 భాగాలుగా విభజించారు. సంస్కృత సాంప్రదాయం ప్రకారం సూర్యోదయంతో పగలు మొదలౌతుంది. ప్రాతఃకాలం(the dawn, the morning) అన్నారు అందుకే! రేపు, రేపకడ, వేకువ ఇలా పిలుస్తారు. "రేపగడ మత్ప్రియశిష్యుల బంచి" లాంటి కవి ప్రయోగాలున్నాయి. ప్రొద్దున్నే పూర్తి చేసే పనిని 'రేపకడ పని' అంటారు. రేపకడే బయల్దేరానంటే తెల్లవారుతూనే బయల్దేరానని. ఇది గ్రాంథికం కాదు, అచ్చుతెలుగు ప్రయోగం.

ఇక్కడి వరకూ బాగానే ఉంది. కానీ, తెలుగు వారి సాంప్రదాయం ప్రకారం సూర్యోదయంకన్నా ముందు "వరువాత" అనే పొద్దుతో పగటి సమయం మొదలౌతుంది. అంటే, రేపకడకన్నా ముందుండేది 'వరువాత'. తెల్లవారటానికి సిద్ధంగా ఉన్న సమయం. అదీ అసలైన బ్రాహ్మీ ముహూర్తం. వరువాత లేస్తేనే కదా సూర్యోదయాన్ని చూడగలిగేది!

వరుస+వాయి=వరువాయి. తెల్లవారురఝాముతో కాలపు వరుస మొదలౌతోంది. అనుక్రమం, ఉపక్రమం అంటారు దీన్ని. పిల్లలతో కాపీ పుస్తకం రాయించేప్పుడు పైన రాసే మొదటి పంక్తిని వరవడి, వరువడి లేదా మేలుబంతి ఇలా పిలుస్తారు.

వాయి లేదా వాత అంటే అచ్చుతెలుగులో నోరు అని. పులివాత పడ్డాడు అంటే పులినోట్లో పడ్డాడని! 'దాంతోనే మొదలు' అని సూచించటానికి వాత, వాయి పదాలను వాడతారు. వరువాత నుండీ పగలు మొదలౌతుందన్నమాట! వరుస వాయి పాటించటాన్నే ప్రోటోకాల్ అంటున్నాం. వరువాతకి సంబంధించింది

వరువాయి. తరువాత, తరువాయి పదాలు కూడా ఇలాంటివే! 'ఒకతర్వాయి' అంటే ఒకప్పుడు అని!

అయ్యలరాజు నారాయణామాత్యుడు రామాభ్యుదయంలో విభీషణుడు రావణాసురుని యుద్ధ చతురతను రాముడికి వివరించే సందర్భంలో "...యీ మహావాతూల వరువాత వరువాత నిను బ్రతివాసరంబుఁ, తలఁచి..." అనే పద్యంలో వరువాత అనే పదాన్ని రెండుసార్లు రెండు వేర్వేరు అర్థాల్లో ప్రయోగించాడు: 'మహావాతూల వరువాత' అంటే నిద్రలేచిన ఈ గొప్ప సుడిగాలి (టార్నెడో)ని నువ్వు అణచినట్టయితే "వరువాత నిను బ్రతివాసరంబు తలచి" నిద్రలేస్తూనే ప్రతీ రోజూ నిన్ను తలచుకుంటాం అని రెండు రకాలుగా వరువాత పదాన్ని ప్రయోగించటం చూడవచ్చు. ప్రాతఃస్మరణీయత అనటానికి సమానమైన తెలుగు ప్రయోగం "వరువాత తలపు." ఇలాంటి చక్కని ప్రయోగాల్ని మనం ఉంచుకుందామా? పారేసుకుందామా?

వరువాయి అనేది అతి సమీప భవిష్యత్తుకు సూచన. "Tomorrow can also mean the near future" అంటారు. ఆశాజనకంగా అది ఉన్నప్పుడే వరువాయి లేదా వరువాత అవుతుంది. 'వరువాత చదివింది ఎక్కువ జ్ఞాపకం ఉంటుంది' అంటారు. బ్రాహ్మీ ముహూర్తంలో కొత్త ఆలోచన లొస్తాయంటే ఇదే!

'వరువాయి కల్లా లేచి కూర్చుంటాడు' అంటే రేపటికి రోగం తగ్గుతుందని!

'రాత్రి తోడుపెడితే వరువాతకు పెరుగౌతుంది' అనటంలో ఎంతో ఆశావాదం కనిపిస్తుంది.

లఘుపతనకం అనే కాకి వరువాయిలో కిరాతుడి ఉనికిని గమనించి ప్రమాదాన్ని పసిగట్టి ప్రాణాలు కాపాడుకోవటం గురించి ఆలోచన చేసింది. వరువాయి శక్తి అటువంటిది.

"వరువాత లేచి శుచియై ఈ స్తవాన్ని పఠించినవారికి ఏ దుఃఖాలూ రావు",

"వరువాత నడక ఆరోగ్యానికి మంచిది".

"వరువాయిలో దోసెడు మల్లెమొగ్గలిస్తుంది మొక్క" ఇలాంటి ప్రయోగాలు ఇప్పుడూ చేయొచ్చు. Early Morning అంటే ప్రొద్దున్నే అని! Early in the Morning అంటే వరువాత అని! ఈ రెంటికీ మధ్య ఉన్న తేడాని గమనించారా?

వరువాయి లేదా వరువాత అంటే ఇంక చీకట్లు తొలగిపోబోతున్నాయనే సంబరం! ఆ పదాన్ని అంత పాజిటివ్ గా వాడాల్సి ఉంటుంది. భవిష్యత్తులో అంతా జయమే అనే సూచన చేసే తెలుగు మాట ఇది.

ఒక్కో సందర్భానికి ఒక్కో తెలుగు మాట మనకుండగా వాటిని వదిలేసి, గ్రాంథికం అంటూ ఈసడించి మనం సాధించిన అభ్యుదయం ఏమిటో అర్థం కాదు.

మరుగున పడిన మాటల్ని వాడకంలోకి తేవటం ఇప్పటి కిప్పుడు మనకుమనం పట్టవలసిన పంతం.



# పిసికిళ్లు

**వసతు ల్వెల్వడి వానకై గుడిసె మోవన్ రాక తా నాని యే**
**వసగా నిల్చినజమ్ము గూడఁ బొల మంబ శ్మోయుచుం బట్టి పె**
**న్ముసురం దీగెడుకాఁపుగుబ్బెతల పెన్గుబ్బల్పునాస ల్వెలిం**
**బిసికిళ్లుం బిసికిళ్లు హాళికుల కర్పించె న్నభస్యంబునన్,**

(ఆముక్తమాల్యద 4/133)

ఇంకా ఆరని లేతకంకెల్ని వలిచి తీసిన లేజొన్నల్ని 'ఊచబియ్యం' అంటారు. గుడిసె లోపల ఓ రైతు పలుగు రాళ్లని (చిన్నచిన్న రాతి ముక్కలు) ఎర్రగా కాల్చి ఈ ఊచబియ్యంతో కలిపి మూటగట్టి చేతుల్తో పిసుకుతున్నాడు. ఆ వేడికి లేత జొన్నలు కమ్మగా వేగాయి. పిసికిన వేపుడు జొన్నలుకాబట్టి ఇవి 'పిసికిళ్లు' అయ్యాయి.

బైట జడివాన కురుస్తోంది. అంబలి తెచ్చిన రైతుభార్య పెద్దవైన స్తనసంపద కలిగింది కాబట్టి, ఆమె 'గుబ్బెత'! ఆమె చేతిలో గొడుగుని బైట తలుపు పక్కన గోడకు ఆన్చి, లోపలి కొచ్చింది. ఆ రైతు పిసికిళ్ల మూటని పిసకటం ఆపి అంబలి తాగాడు. అక్కడితో ఆగలేదు, కాసేపు ఆ గుబ్బెత కుచాలపై తన ప్రతాపం చూపించాడట. ఆముక్తమాల్యదలో కృష్ణ దేవరాయలవారు జొన్నపిసికిళ్లకి శృంగారాన్ని ఆపాదిస్తూ ఈ పద్యం వ్రాశారని వేదంవారి వ్యాఖ్యానం. ఈ పిసికిళ్ళు పేలాల్లా నిలవుంటాయి. కాల్చిన జొన్నకంకుల ఊచబియ్యం నములుతూ నాగనిక "ఈ చేను లేగాపుది. అందుకనే జొన్నబియ్యం మారుచిగా ఉంది. పైరుపొలాలన్నీ ఏపుగా వస్తున్నాయి" అని తారానిక అన్నట్టు అడవి శాంతిశ్రీ నవలలో అడవి బాపిరాజు వ్రాశారు.

సూర్యుడు పునర్వసు నక్షత్రంలో ఉన్నప్పుడు నాటుతారు కాబట్టి జొన్నల్ని పునాస ధాన్యం అన్నారు. "దండిపైరుజొన్నలు" అంటే ప్రధాన ఆహారంగా ఉండే జొన్నలని! నాప అన్నా జొన్నలే! ఎండి, మోడైన జొన్నమొక్క చిగిర్చితే

దాన్ని ‘నాము’ అంటారు. పునర్జీవం పొందిందని! పండి, వాలిపోయిన వరికంకిని చూసి నిటారుగా నిలిచిన జొన్నమొక్క నవ్విందిట. ఏదో ఒకరోజూ జొన్నచేనూ పండుతుందనటానికి ‘నవ్విన నాపచేనే పండు’ అనే నానుడి పుట్టింది. “నిండారునాముతో బండిరక్కసుడి రాగుండియల్ బగులంగ జెండినాడు” అనే కవిప్రయోగం ఉంది. ‘నిండారునాము’ తిరిగి పుంజుకున్న శక్తి! జొన్నలు నిండారునామునిస్తాయి!

చారపప్పు, ఊచబియ్యం, సన్నగా మండిన గుగ్గిళ్ళు, దోరగా ముగ్గిన మామిడిపళ్ళు, ద్రాక్ష, ఖర్జూర పండ్లు, తంగేటి జున్ను, తేనె, ఆరకాగిన పాలు ఆరగించండని ద్రోణార్జునులకు ఏకలవ్యుడు ఆరగింపు పెట్టినట్టు త్రిపురనేని వారు సూతపురాణంలో వ్రాశారు.

**“జొన్నకలి, జొన్నయంబలి**
**జొన్నన్నము జొన్నపిసరు జొన్నలె తప్పన్**
**సన్నన్నము సున్నసుమీ**
**పన్నుగఁ బల్నాటి సీమ ప్రజలందఱకున్”** జొన్న గంజి, జొన్నంబలి, జొన్నన్నం, జొన్నపిసరు(జొన్నల్ని కడిగిన నీళ్లు. ఇవి, నల్లమందుకి విరుగుడు) అని అన్నాడే గాని, ఈ పిసికిళ్ల గురించి శ్రీనాథుడు రాయలేదు. అంతటి రసికుడు ఈ పాయింట్ ఎలా మిస్సయ్యాడో మరి!

చిరుధాన్యాల పట్ల ఇష్టాయిష్టాలు ఈనాటివి కావు. వాటి అనుకూల ప్రచారమూ ఈనాటిది కాదు. గోటేటి జోగిరాజుగారు 1940ల్లోనే మూడు వంతుల అన్నంలో ఒక వంతు చిరుధాన్యాల్ని, ఒక వంతు కూరగాయల్నీ తినాలన్నారు.

“ధవళో యావనాళస్తు గౌళ్యో బల్య స్త్రీ దోషజిత, వృష్యో రుచిప్రదశ్శీఘ్రు: గుల్మ వ్రణాప:” తెల్లజొన్నలే శ్రేష్ఠం, బలకరం, రుచికరం. వీర్యవృద్ధిని, లైంగికశక్తిని పెంచుతాయి. వేగంగా పనిచేస్తాయి. గర్భాశయ దోషాల్ని హరిస్తాయి. చక్కగా వంటబడతాయి. ఆపరేషన్లయిన వారికి, గాయాలయినవారికి ఇవి మంచివని ఆయుర్వేద శాస్త్రం చెప్పింది. జొన్న పిసికిళ్లు శరీరానికీ మనసుకూ సౌమ్యతనిస్తాయి. ‘కుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్’ అని శ్రీనాథుడన్నట్టుగా పిసికిళ్లు తింటే,

మన్మథుడిలా ఔతారు! మనం వాటిని కావాలని అడిగితే కదా మార్కెట్లో అవి దొరికేది!

చిరుధాన్యాల ప్రచారంలో మరింత లౌకికత కావాలి! 'అన్నం అనేది విషం', 'తింటే చస్తావ్' అన్నట్టుగా ప్రచారం చేసేకన్నా, ఇవి తింటే మన్మథుడిలా వృద్ధాప్యాన్ని జయిస్తారనే విషయాన్ని శాస్త్రీయంగా చెప్తే, ఎక్కువ మందికి చిరుధాన్యాలపట్ల ఇష్టత పెరుగుతుంది. 'వరి'కి అలవాటుపడినవారితో ఈ బుడ్డిగింజల్ని తినిపించాలంటే, వాటితో చిత్రవిచిత్ర వంటకాలను తయారు చేయటం అవసరం!



# ఆర్బత్తుల న్యాయం

**"ఉ**ద్యోగములు చేసి యూళ్ల నెల్లను దోఁచి/యార్జించినట్టి ద్రవ్యంబు
కొంతభూములన్నిటి నమ్మి పొలఁతుల నగలమ్మి/సమకూర్చినట్టి విత్తమది
కొంతవ్యవసాయములు చేసి వర్తకమ్ములొనర్చి/గైకొన్నయట్టి రొక్కమ్ము కొంత
పిల్లి కైనను భిక్షపెట్ట కార్జించిన/వసుమతీశ్వరుల ద్రవ్యంబు కొంత
దేశ దేశమ్ములకుఁ బోయి తిరిపమెత్తి/యార్జనము చేసికొన్న ద్రవ్యంబు
కొంత

'అరబతు నాటు' హరియించె నౌర!/వీరి క్షౌరమున కీడు వచ్చెడు క్షౌరమున్నె" తిరుపతి వెంకట కవులు ఒక అవధానంలో ఆర్బతునాటు అనే మోసగాడి గురించి ఈ పద్యం చెప్పారు: ప్రభుత్వోద్యోగాలు ఊరందర్నీ దోచి తెచ్చిన డబ్బుని కొందరు. భూము లమ్మిన డబ్బుని మరికొందరు. పండిన పంటమీద రాబడిని ఇంకొందరు, చిన్నచిన్న వ్యాపారాలు చేసి సంపాదించింది వాడికే ధారపోశా రంతా! పిల్లికూ్కడా భిక్ష పెట్టకుండా జమీందార్లు సంపాదించిన సొమ్ముని, ఊళ్ళు తిరిగి తిరిపం ఎత్తి తెచ్చిన డబ్బుని కూడా ఈ ఆరుబత్తు నాటుగాడు అమాంతం హరించాడు. వాడి క్షౌరానికి సాటిరాగల క్షౌరం ఉన్నదా?" అని!

మృచ్ఛకటికం నాటకంలో శర్విలకుడనే దొంగ తను ఏ ఇంటికైనా కన్నం వేస్తే డబ్బుపోయిన దుఃఖంలో ఉన్నా ఆ ఇంట్లో వాళ్లు కన్నం వేయగలిగిన తన చాతుర్యాన్ని మెచ్చుకు తీరతారంటాడు. 1902లో 'విటకర్ రైట్' అనే లూలామాలంకరుడి అంటే పచ్చిమోసగాడి ఆర్థిక మాయలు ఒక్క టొక్కటే వెలుగులోకి వచ్చి లండన్ నగరం కూడా ఇలాగే అయ్యో అనుకుంటునే అహెూ అని ఆశ్చర్యపోయింది.

డా॥ కట్టమంచి రామలింగారెడ్డిగారు 'భారత అర్థశాస్త్రము' అనే గ్రంథంలో 20వ శతాబ్దపు ఈ తొలి ఆర్థికనేరం గురించి విపులంగా వ్రాశారు. విటకర్ రైట్ మొదట ఓహరిసాహరిగా అనేక వ్యాపార సంస్థల్ని ప్రారంభించాడు. తను కొంత నష్టపడ్డా జనానికి లాభంచూపించాడు. ఈ కంపెనీల్లో సొమ్ముతో

కొత్త కంపెనీలు పెట్టాడు. ఆ కొత్త కంపెనీల్లో వచ్చిన డబ్బుని నష్టంలో ఉన్న పాతకంపెనీలకు అప్పిచ్చినట్టు నటించాడు. ఈ కంపెనీలన్నీ వేర్వేరు పేర్లతో వేర్వేరు భాగస్వాములతో ఉండటంతో అన్నింటికీ నాథుడు వీడేనని ఎవరూ గుర్తించలేదు. తన దగ్గర తానే అప్పు చేస్తూ ఒక మహాభవంతి నిర్మించాడు. ఇంగ్లండు రాజుగారిని భోజనానికి పిలిచి గౌరవించాడు. ఇండియాకి వైస్రాయి-గవర్నర్ జెనరల్ గా పనిచేసిన లార్డ్ డఫ్రిన్ గారిని ఈ సంస్థకు అధ్యక్షుడిగా నియమించాడు. మొత్తం అందరూ తన బుట్టలో పడ్డాక కోట్లాది సొమ్ము మూటకట్టుకుని రాత్రికి రాత్రే బోర్డు తిప్పేశాడు. మోసపూరితంగా తనని ఇందులో ఇరికించటంతో డఫ్రిన్ దొరగారు తన పరువు పోయిందని, మనోవేదనతో మరణించాడు. లండన్ ప్రభుత్వం విటకర్ రైట్'ని ఉపేక్షించింది. కానీ, కడుపుమంట మీద ఉన్న ప్రజలు కేసు తిరగదోడారు. చివరికి ఆ మాయావికి ఐదేళ్ల జైలు పడింది. విషం తాగి ఆత్మహత్య చేసుకుని ఆ శిక్షను కూడా తప్పించుకున్నాడు!

లండన్ లో ఈ విటకర్ రైట్ నేరాలకు వారసుడే ఇండియాలో 'ఆర్బత్ నాట్'! 1906లో యావత్ తెలుగు ప్రజలకు తిరుక్షౌరం చేసి, బోర్డు ఎత్తేసిన ఖలుడు. ఈ ఇద్దరి ఆర్థికనేరాలకూ చాలా పోలికలున్నాయి. రెండు దేశాల్లోనూ సామాన్య ప్రజలు ఈ ఇద్దరు మాయావుల వలన సమస్తం కోల్పోయి ముష్టివాళ్లయ్యారు.

ఆర్బతునాట్ గురించి, 20వ శతాబ్ది తొలిపాదంలో చాలా కథలు, నవలలు వచ్చాయి. తాడూ బొంగరం లేని కంపెనీల్ని, దివాలాకోరు, దగాకోరు ముఠాల్ని ఆర్బత్తుల కంపెనీ అనటం తెలుగువాళ్లకు అలవాటయ్యింది.

ఆరుబత్తుల క్షౌరం నిలువు దోపిడీకి పర్యాయ పదం. ఎగుమతి దిగుమతులు, కాఫీ, నీలిమందు తోటలు ఇలా అనేక రంగాల్లో ఉన్న ఈ కంపెనీ మన కళ్ల ముందే ఉందికదా... డబ్బు ఎక్కడికీ పోదనుకున్నారంతా! డబ్బు మూటలు తెచ్చి దేవుడి హుండీలో వేసినట్టు పడేశారు. పైన చిల్లులోంచి డబ్బులు వేశారు కానీ కింద ఎంతపెద్ద గొయ్యి ఉందోచూళ్లేదు. "దేవుడికి కొబ్బరికాయ కొడితే సగం చిప్ప ప్రసాదంగా ఇస్తారు. ఆర్బతునాటు దేవుడు ప్రసాదం కూడా ఇవ్వ లేదు" అని వాపోయాడో బాధితుడు.

18వ శతాబ్దిలో తెలుగు చేనేత కార్మికులకు కోట్లాది సొమ్ము బకాయి పెట్టి ఈస్టిండియా కంపెనీ బోర్డు తిప్పేసింది. ది న్యూ ఈస్టిండియా కంపెనీ పేరున కొత్త కంపెనీ పెట్టి, బందరు నుంచి మద్రాసుకి మకాం ఎత్తేశారు బ్రిటిషర్లు. నీలిచెట్ల నుండి నీలిమందు తయారీ విషయంలోనూ ఇదే జరిగింది. ఇంటింటా తొట్టెలు పెట్టి ఎంతో గొప్పగా నీలిమందు ఉత్పత్తి చేశారు తెలుగు ప్రజలు. అంతలో లండన్లో పాదరసంతో తయారయ్యే కృత్రిమ నీలిమందు రావటంతో తెలుగువాళ్లు నిండా మునిగిపోయారు.

10-4-1986 ఆంధ్రపత్రికలో తెలుగుదేశం ప్రభుత్వం తెలుగువల్లభుడి పేరున ఉన్న శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయాన్ని ఆదుకోవాలనంటూ ఒక వార్తాకథానం వ్రాసింది. ఆరంభదశలో ఈ భాషానిలయం ఎదుర్కొన్న బాలారిష్టాల్ని వివరిస్తూ, "నిలయం వారు డబ్బు దాచిన ఆర్బతునాట్ కంపెనీ 1906లో దివాలాతీస్తే మూలధనం 826 రూపాయల 10 అణాల 6 పైసలు కోల్పోయింది" అని పేర్కొంది.

మద్రాసు గవర్నరుగా ఉండి జమీందారుల్ని చాలా ప్రోత్సహించిన ఆంఫీతిల్ దొరగారి స్మారక చిహ్నం కట్టించాలని అప్పట్లో జమీందార్లు చందాలు పోగేసి ఆ డబ్బుని ఈ అర్బత్ నాట్ కంపెనీలో వేశారు. ఆ కంపెనీ రాత్రికి రాత్రే జమీందారులందర్నీ ముంచేసిందని ఆంధ్రపత్రిక 1925 ఆగష్టు 19 సంచికలో వ్రాసింది. బొబ్బిలి జమీందారు 14 నీలిమందు ఫ్యాక్టరీల్ని ఈ కంపెనీకి కౌలుకిచ్చాడు. అన్నీ కృష్ణార్పణం అయ్యాయి. ఇంచుమించుగా జమీందార్లందరూ ఈ 'నాటు'దెబ్బ తగిలిన వారే! కాకపోతే సామాన్యుడు బిగ్గరగా ఏడ్చాడంతే!

"ఆర్బతునాట్ కంపెనీ దివాలా సందర్భమున కంపెనీ ఋణదాతలకు రూపాయ కొక దమ్మిడీని కడపటి డివిడెండుగ నొసగునటుల ఉత్తరువు గావింపబడెను" అని 19-10-1932 ఆంధ్రపత్రికలో చిన్నవార్త ప్రచురితం అయ్యింది. సంఘటన జరిగిన పాతిక యేళ్ళ తరువాత ప్రభుత్వం వారు సామాన్యుడికి విదిల్చిన ముష్టి ఇది. అగ్రిగోల్డు బాధితులకు ఈ ముష్టికూడ అందడం లేదు కదా!

మూడు నెలలాగితే మూడోవంతు రేటుకే సోఫాలు, బీరువాలూ ఇస్తానంటూ

1984లో విజయవాడలో సప్తగిరి కంపెనీ వేసిన టోకరాకు బలికాని వాడే లేడనుకున్నారా రోజున! ప్రైవేట్ చిట్‌ఫండ్ల కంపెనీల్ని, చీటీల వ్యాపారుల్నినమ్మి కష్టార్జితం అర్పించు కోవటానికి అధిక వడ్డీమీద ఆశ ప్రధానకారణం. ఇలాంటి ఆర్థికనేరగాళ్లని ఆర్బత్తుల కంపెనీ అని పిలిచేవాళ్లు ఒకప్పుడు. మిత్రుడనో బంధువనో మొహమాటానికి అప్పు కాయితాల మీద హామీ సంతకాలు పెడితే 'ఆర్బత్తుల న్యాయం' అమలవుతుంది. మనం అన్యాయమై పోతాం! 'నమ్మినవాణ్ణే మోసం చేయా'లని 'ఆర్బత్తుల న్యాయం' చెప్తుంది!



# అచ్చతెలుగులో గంగమ్మ

**తె**లుగువారికి గంగమ్మ అంటే అమితమైన భక్తి. తెల్లగా నిర్మలంగా, స్వచ్ఛంగా పవిత్రంగా ఉండే దేన్నయినా గంగతో పోల్చటమో లేక గంగ పేరు పెట్టుకోవటమో చేస్తాం మనం. సంస్కృతం తరువాత గంగకు అంత ప్రాధాన్యత ఇచ్చింది తెలుగువారే! సంస్కృతం అవసరం లేకుండా గంగకు అచ్చతెలుగులో అద్భుతమైన పేర్లు ఉన్నాయి. ఈ పేర్లన్నింటినీ ఒకచోట పేరిస్తే గంగామాత స్వరూపం కళ్లకు కడ్తుంది. గంగ పేరు తలిస్తేనే పునీతం అన్నంత భక్తి భావంతో ఈ పేర్లు తెలుగులో రూపొందాయి. సంస్కృత నామవాచకాల్ని అచ్చతెలుగులో వ్రాయటానికి కూచిమంచి తిమ్మకవి, పొన్నెగంటి తెలుగన్న లాంటి ప్రాచీన కవులతో పాటు ఆధునిక యుగంలో శ్రీ అజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు, శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి ప్రభృతులు చేసిన కృషి గొప్పది.

**అంకులేరు:** గంగమ్మని మీ తెలుగులో ఏమంటారు? అని ఎవరో నారాయణదాసు గారిని అడిగితే ఆయన తడుముకోకుండా "అంకులేరు" అన్నారట. "తల్లి విన్కి" (అమ్మభాష) అనే పుస్తకంలో అంకులేరు పదంతోనే ఆయన అచ్చతెలుగు పదకోశాన్ని ప్రారంభించారు. ఆకాశగంగని అచ్చతెలుగులో అంకులేరు అని పిలవ్వొచ్చు. ఈ అంకులు ఇంగ్లీషు అంకులు కాదు! ఇలాగే గంగమ్మని ఎన్నిరకాలుగా

తెలుగు పేర్లతో తెలుగింటి ఆడపడుచుగా ఎంత గొప్పగా సంభావించుకున్నారో చూడండి.

**అంచలవిడిది:** అంచ అంటే హంస. రాజహంసలకు నివాసం కాబట్టి గంగానదిని అంచల విడిది అని పిలుస్తారు..

**అచ్చునది:** అచ్చనది లేదా అచ్చరనది అంటే అక్షరాలా గంగానదే! అచ్చమైనది అంటే నిర్మలమైనది, స్వచ్ఛమైనది అని. అచ్చర అంటే అప్సర. దేవతాస్త్రీ. అచ్చర నది అంటే నిర్మలమైన దేవతానది అని అన్వయం చెప్పుకోవచ్చు.

పాలపుంతని కూడా అచ్చనది అనే అంటారు. ఆకాశగంగే పాలపుంత. అచ్చర అంటే అప్సర, అచ్చర అంటే అక్షరం. అచ్చర అంటే జ్ఞానం. అచ్చర అంటే గంగ. గంగానది జ్ఞానవాహిని."చిచ్చఱకను దేవర పై నచ్చరనదిఁదాల్చు చెలువ మచ్చు పడంగా" అని ధరణిదేవుల రామయామాత్యుడు దశావతార చరిత్రము కావ్యంలో అచ్చరనదిని ప్రయోగించాడు.గంగని ఇలా తెలుగుగంగగా మార్చిన తీరు అచ్చరువే! ఆకాశాన్ని తెలుగులో మిన్ను అనీ, వాయువుని మిన్నుచూలు అనీ, సూర్యుణ్ణి మినుమాణిక్యం అనీ, శివుణ్ణి మినుజుట్టు దేవర అనీ, దేవతల్ని మినుకేరులు (గగనవీథివిహారులు) అనీ పిలుస్తారు.

**అచ్చరవాక:** అచ్చర అంటే స్వచ్ఛమైన తెల్లని జలసంపద. వాక అంటే నది. అచ్చరవాక అంటే అచ్చర నది అని!

**అడుగుపుట్టువు:** అడుగుపుట్టువు అంటే, పాదం నుండి పుట్టింది–గంగానది. గంగానదిని పాదంలో గలవాడు కాబట్టి శ్రీమహావిష్ణువును అడుగువాక గలవాడు" అంటారు తెలుగువాళ్లు.

**కడలి వెలఁది:** కడలి వెలది అంటే, సముద్రుడితో సంగమించేది అనేది అన్వయం. కొన్ని నదులకు సంగమ అవకాశం లేకపోయినా ఎక్కువ నదులు కడలిని ఆశ్రయిస్తాయి. గంగానది భారతదేశంలోనే అనేక రాష్ట్రాల్లో ప్రవహిస్తూ బాంగ్లాదేశ్ లో కూడా ప్రవహించి సుదీర్ఘ యాత్ర తరువాత సముద్రుణ్ణి చేరుతోంది.

**కఱకంఠుతలయేఱు:** కరకంఠుడు అంటే శివుడు ఆయన తలయేరు అంటే శివుని శిరసున నివసించే గంగానది

**కూఁతుబిడ్డ:** కూతురుకి కూతురు మనుమరాలు అవుతుంది. సముద్రుడికి కూతురు లక్ష్మీదేవి. లక్ష్మికి కూతురు గంగ. అంటే సముద్రుడి మనుమరాలు గంగమ్మ.

**గంఁగి:** గంగి అంటే పూజనీయమైనది. గంగిరెద్దులో గంగి కూడా ఈ అర్థంలోనే కనిపిస్తుంది. ఆదిభట్ల నారాయణదాసు గారు తెలుగులో గంగి అంటే గంగ, కంచి, గొప్ప అని మూడర్థాలను "తల్లివిన్కి" గ్రంథంలో పేర్కొన్నారు. తెలుగువారి ప్రతీ కథా కంచికే వెడుతుంది. చివరికి. కంచి ఒకనాడు తెలుగు ప్రాంతం కావటం, రాజధాని నగరం కూడా కావటం ఇందుకు కారణాలు.

గొప్పవైన కంచి, గంగ రెండింటికీ గంగి శబ్దాన్ని అన్వయించుకున్నాం మనం. గొప్పది ఏదైనా అది గంగి మనకి!

**చదలేరు:** చదలేరు అంటే ఆకాశగంగ. మందాకిని అనికూడా భావిస్తారు. మిన్నేరు అనీ చదలువాక అనీ తెలుగువారు అందంగా పిలిచే దేవలోకపు గంగానది. "అలకి చదలేరు జలరాసికైతలంచి కాన్కగా బంపు సౌగందధికంబనంగ'' అని శరభకవి హరిశ్చంద్రోపాఖ్యానంలో చదలేరును ఆకాశగంగగా వర్ణించారు. సంధ్యాసమయ సందర్భం ఇది. "అతనుభూతిఘటింపదయ్యేనేచదలేరు/సికదాల్చు నింధానచితకునకు" అని రామరాజభూషణుడు వసుచరిత్రలో చదలేరును దేవలోక గంగగా ప్రస్తుతిస్తాడు."చదలేటికదలికలందలఁకెడు నిజకరంబు తుదలేటి వెడలుపాటి చూపుల వెఅపు తమకు సరియనగలపాటి'' అని ధూర్జటి శ్రీకాళహస్తిమహత్మ్యంలో ఈచదలేటి అలలకదలికలు "లేటివెడలుపాటి చూపు" లంటూ లేడిచూపులతో పోలుస్తాడు. చదలేరుని సప్తగోదావరంగా శ్రీనాథుడు భీమేశ్వరపురాణంలో వర్ణించాడు.

భీమేశ్వరుడు కొలువై ఉన్నచోట గోదావరినదిని చదలేరు అంటారు. గోదావరి సప్తశాఖల్ని సప్తర్షులు అంతఃప్రవాహ రూపంగా తీసుకురావటం వలన ఏర్పడిందని శ్రీనాథుడి భావం. ఏ దేవగంగలో సప్తర్షులు స్నానం చేసి తరించారో ఆసప్తర్షులే ఈ సప్తగోదావరిని ప్రతిష్టించి మణికర్ణికతో సమానం గావించారు. "కమనీయ మణికర్ణికా ప్రవాహమునకు సప్తగోదావరి జలము సాటి'' అంటాడుశ్రీనాథుడు.

"రాజవంశజుండగు భగీరథునివెంటఁ/ బారుదెంచిన చదలేరుపాటి యగునె/ సప్తముని రాత్రృతాప సంప్రాప్తమైన సప్తగోదావరంబుతో సారమహిమ" అని సప్తగోదావరిని ప్రస్తుతించాడాయన. 'చదలేటి బంగారు జలరుహంబుల తూండ్లు' అనే శ్రీనాథుని వాక్యాన్ని బట్టి ఎక్కడయినా బంగారురంగు తామరపువ్వులు కనబడితే అదే చదలేరు అని తాపీధర్మారావుగారు 'పెళ్ళి దాని పుట్టుపూర్వోత్తరాలు' గ్రంథంలో వ్యాఖ్యానించారు.

**చదలేటిపట్టి:** చదలేరు అంటే దివ్యగంగ. చదలేటిపట్టి అంటే గంగాసుతుడు భీష్ముడు.

**చదలువాఁక:** ఆకాశంలో పారే నది. చదలు అంటే, ఆకాశము. వాక అంటే నది. చదలువాక అని గంగానదికి తెలుగువాళ్లు పెట్టుకున్న పేరు "చదలువాక నీటల జలకమాడి" అని పారిజాతాపహరణంలో కవి ప్రయోగం. తగనాంధ్ర రఘువు ప్రతాపరుద్రుడొసంగు స్వర్ణ వృష్టిం బాఱు చదలువాక/ప్రథిత విద్యానాథ పండిత కవులను వెలయించు చదువుల పెల్పుగిడ్డి..." అంటూ పోతన చరిత్రము కావ్యంలో వానమామలై వరదాచార్యులవారు ఆంధ్రుల రఘుమహారాజు లాంటి ప్రతాపరుద్రుణ్ణి చదలువాకతో పోలుస్తూ స్తుతించారు. చదలువాక ఇంటి పేరుగలవారు తెలుగు వారిలో ఉన్నారు. చదలువాక మల్లన రుక్మాంగదచరిత్ర, విప్రనారాయణ చరిత్ర వ్రాసిన ప్రసిద్ధుడు. చదలవాడ ఇంటిపేరుక్కూడా ఇదే మూలం కావచ్చు.

**జడదారి చెవియూట/చెవిబుగ్గ:** జహ్నువనే మహర్షి చెవిలోంచి బయటకు వచ్చిన గంగానది, భగీరథుడు ప్రార్థించగా భువికి దిగివచ్చిన గంగానది ఉరవళ్ళు పరవళ్లతో పరుగులిడుతూ దారిలో జహాను మహర్షి ఆశ్రమాన్ని ముంచెత్తింది. ఆగ్రహించి గంగను ఒక గుటకలో మింగేస్తాడు ఆ ముని. భగీరథుడు ప్రాధేయపడగా కరుణించి తన చెవినుండి గంగను విడుదలచేసి గంగను తన పుత్రికగా దత్తు ప్రకటిస్తాడు. అలా గంగానది జాహ్నవి అయ్యింది. ఈ కథనుబట్టి జడధారి 'చెవిబుగ్గ', జడధారి చెవి ఊట' అనే తెలుగు పేర్లు ఏర్పడ్డాయి. జాహ్నవి, జహనూ తనయ, జహనూ కన్యా, జహనూ సుతా, జహనూ నందిని అని సంస్కృతంలో పిలుస్తారు.

**జాలంచల విడిది:** గంగానది రాజహంసల విడిదిగా ప్రసిద్ధి.

**తలయేరు:** ఇది అభ్రగంగ అంటే ఆకాశ గంగకు, మందాకినికి పేరని అచ్చతెలుగు కోశం పేర్కొంది. శివుని తలపి ఉండే యేరు అని దీని భావాన్ని విశ్లేషించవచ్చు. నెత్తిన పెద్ద బరువు పెట్టినట్టుగా అనిపించటాన్ని బట్టి శివుడు

గంగని భరించటాన్ని దృష్టిలో పెట్టుకుని ఈ తలయేరు పదం ఏర్పడి వుంటుంది. తీవ్రమైన మైగ్రేన్ తలనొప్పిని కూడా తెలుగులో తలయేరు అంటారు. తరలు, తలరు పదాలకు be agitated, disturbed అనే అర్థాలున్నాయి. ఉరవడిగా విజృంభించి ప్రవహించే నది తలయేరు.

**తాటిటెక్కెముదణితల్లి:** భీష్మడి జెండాపై తాటిచెట్టు ఉంటుందట. తలపొడవుగా ఉండి శిరసెత్తుకుని సగర్వంగా నిలిచే తాటిచెట్టు తెలుగువారికి కల్పవృక్షం. ఈ చెట్టు గుర్తుని జెండా గుర్తుగా పెట్టుకున్న భీష్మడంటే తెలుగువారికి గౌరవ ప్రపత్తులెక్కువ. ఈ తాళధ్వజుడైన భీష్ముని తల్లి గంగమ్మ

**తాతవనఁటి వెల్లి:** తాత అంటే బ్రహ్మ చేతి కమండలంలోని నీటి ప్రవాహం.

**అరువదివేవుర ముగితి త్రోవ:** భగీరథుడు ఘోర తపస్సుతో పరమ శివుణ్ణి ప్రసన్నం చేసుకొని దివినుంచి గంగను భువికి రప్పించి 60 వేలమంది సగర పుత్రులకు గంగాప్రాప్తి కలిగించిన మహాపురుషుడు. ఈ అరవై వేల మందికీ సద్గతులు కలిగించేందుకు పారిన గంగమ్మని అరువది వేవుర ముగితి త్రోవ అని అచ్చతెలుగులో పిలుస్తారు. ముక్తికి ముగితి అన్నారు.

**తెలియేఱు:** తెలియేరు లేదా తెలివాక అంటే తెల్లని నది గంగానది అని!

**తెలివాఁక:** తెల్లని నది. గంగానదికి మరో పేరు. "క్రొందేనెపట్టులో కొసరి యూరిన తేట చినుకు లందలి చిరు చేదు తీపి తేటగా పారెడి తెలివాక యందలి తోద్రోవు తరగలు"... అంటూ ఆధునిక కవులు కూడా తెలివాకను ఆకాశగంగగా ప్రస్తుతించారు. ఇది కపిలవాయి లింగమూర్తిగారు కూచిమంచి తిమ్మకవి తేటతెనుగు రచనా ప్రతిభను కొనియాడుతూ చేసిన ప్రస్తుతి.

దివ్వులయేఱు: దివ్యనది. ఆకాశగంగ. టిబెట్ భాషలో దీన్ని లచ్చూనది అంటారు. "ల" అంటే దేవుడు, "చు అంటే నీరు. ఆ విధంగా ఇది దేవతా జలం అనే అర్థంలో ఏర్పడిన పదం. ఈ నది ప్రవహించే లోయని 'లచ్చూలోయ' అంటారు.

**దూరపార:** గంగానది ఇరుగట్ల మధ్య దూరం చాలా ఎక్కువగా ఉంటుంది చాలా వెడల్పైన నది అని. దూరపు గట్లు కలనది అనవచ్చు. దవ్వులనున్న అవ్వలి గట్టు కలది అని సూర్యరాయాంధ్ర నిఘంటువు పేర్కొంది అవతలి గట్టు చాలా దూరాన ఉన్న నది. "స్థితా పారే సముద్రస్య దూరపారస్య రాఘవ" అంటూ, వాల్మీకి రామాయణంలో రావణుడి లంక ఎంతో దూరాన ఉన్న సముద్రం ఆవలిగట్టున ఉన్నదని రాముడికి చెప్పిన సందర్భంలో దూరపార శబ్దాన్ని దూరంగా ఉన్న ఆవలిగట్టు అనే అర్థంలోనే వాల్మీకి ప్రయోగించాడు. గంగను కూడా సముద్రం అంత విస్తారమైనదిగా భావించి దూరపార అని పిలుస్తారు. ,

**పిచ్చుటేఱు:** ఉన్మత్త గంగ అనే పదానికి ఇది తెలుగు. పిచ్చుటిల్లటం అంటే to quake, shudder అని అర్థాలు. నేల కంపించేంత ఉరవడిమీద ప్రవహించే గంగానదిని పిచ్చుటేరు అనవచ్చు.

**పునుక తాలుపు తలయేఱు:** పునుక అంటే కపాలం. పునుకతాలుపు కపాలధారి అయిన శివుడు. ఆయన తలయేరు గంగానది.

**పులిచూలి సవతితల్లి:** పులిచూలు లేదా పులుమావి అంటే కుమార స్వామి. ఆయన తల్లి పార్వతి. పార్వతీదేవికి సవితి గంగమ్మ. పులిచూలిసవతి తల్లి గంగమ్మే!

**పెదగంగ:** ఆకాశగంగ, భూమ్మీద ప్రవహించే గంగానది అని గంగలు రెండురకాలుగా కనిపిస్తాయి. ఆ అకాశగంగే భూమ్మీదకు భగీరథుడి కారణంగాగివచ్చిందని రామాయణ భారతాలు అంగీకరించాయి. ఆకాశంలో కనిపించే నక్షత్ర సముదాయాలతో కూడిన "పాలపుంత'ను పెదగంగ, ఆకాశగంగ అంటారని శాస్త్రవేత్తలు భావిస్తారు. పైది పెదగంగ. నేలమీద ప్రవహించేది గంగ. నేల కిందినుంచి మనం తోడి తెచ్చుకో వలసింది 'పాతాళగంగ' అని గంగను మూడు అంచెల్లో, మూడు దశల్లో మనవాళ్లూహించి వర్ణించి పేర్లు పెట్టుకున్నారు" అని వ్రాశారు శ్రీ బూదరాజు రాధాకృష్ణ తెలుగు జాతీయాలు అనే గ్రంథంలో!

పెదగంగ అని గంగానదిని, చినగంగ అని గోదావరిని పిలిచే అలవాటు కూడా మనకుంది.

పెదగంగ అనే పేరు తెలుగువారిలో చాలామందికుంది.

భూసుర బంధుహితత్రా/ణాసక్తుండు ధర్మనిరతుం దరిధరణీభృ/ ద్వాసవుఁడు ప్రాజ్ఞుడనం దగు/దాసరి పెదగంగ ఘనునిఁ దరమే పొగడన్" అంటూ ఒడ్డేపూడి పెద్దయ్యకవి మాఘమహత్యం కావ్యావతారికల్లో 'దాసరి పెదగంగ' గురించి ప్రస్తావించారు.

**పెరుమాళ్ళడుగు బుగ్గ:** విష్ణుపది, విష్ణువు పాదాలలో పుట్టిన ఊట

**పొందామరలపంట:** బంగారు తామరపువ్వులకు ఉనికిపట్టు

**పొడుగుమగుడుబయలేరు:** పొడుగైన అంటే పెద్దనది. అది మగుడుగా అంటే మెలికలుమెలికలుగా సుడులు తిరుగుతూ ప్రవహించేది బయలు అంటే ఆకాశం. ఏరు అంటే నది. పొడుగుమగుడుబయలేరు అంటే ఆకాశగంగ. దాని స్వభావాన్ని కూడా ఈ పేరు సూచిస్తోంది.

**నీమంబుంగన్న మన్నీని తల్లి:** పాలనా నియమాలు ఎరిగిన సైన్యాధిపతి భీష్ముని తల్లి గంగమ్మ

**మినుచూలు:** ఆకాశంలో పుట్టినది ఆకాశగంగ

**మినుబావి:** ఆకాసంలో ఉండే ప్రవాహం, ఆకాశగంగ

**మినురతనము:** అకాశంలో కాంతివంతంగా ప్రకాశించేది పాలపుంత, ఆకాశగంగ

**మినువాక:** ఆకాశంలో ప్రవహించే నది: మినుసిక దయ్యము: దయ్యము అంటే కేవలం భూత ప్రేత పిశాచాలే కాదు, A deity, a god. దేవుడు, వేలుపు అనే అర్థాలు కూడా ఉన్నాయి. శివగంగ అనే అర్థంలో మినుసికదయ్యము అని పిలిచి ఉంటారు.

**మినుసిగ వేలుపు తలయేరు:** మినుసిగ వేలుపు అంటే వ్యోమకేశుడు,

శివుడు. ఆయన తలపై ఉన్నది గంగమ్మ

**మిన్నీరు:** ఆకాశగంగ

**మిన్నుకొలకు:** కొలకు అంటే కొలను, ప్రవాహం. మిన్ను అంటే ఆకాశం ఆకాశగంగని మిన్నుకొలకు అని తెనిగించారు

**మిన్నువాక/మిన్వాక:** ఆకాశగంగ."మిన్ను వాక తాలుపు" అంటే ఆకాశగంగను శిరసున ధరించినవాడని!

**మిన్నేఱు:** ఆకాశగంగ

**ముత్తెరువులాఁడి:** త్రిపథగ అంటే ఆకాశం, భూమి, పాతాళం మూడు లోకాలను పావనం చేసిన నది మూడు మార్గాల్లో ప్రవహించే నది అని! ముత్తెరువులాడి అంటే మూడు దారుల్లో ప్రవహించే గంగ.

**ముత్రోవద్రిమ్మరి:** మూడుమార్గములందు ప్రవహించేనది

**మున్నీటిరాణి:** మున్నీటికన్నె, మున్నీటిగరిత, మున్నీటిగౌరు, మున్నీటిచూలి, మున్నీటినేడిమివాడు, మునీటిపట్టి, మున్నీటిమొలనూలి మగువ, మున్నీ టిమొలనూలిమగువీచూలి, మున్నీ టిరాచూలి, మున్నీటిరాణి ఈ పదాలన్నీ మున్నీరుకు భార్య అనే అర్థంలోనే ఏర్పడ్డాయి, మున్నీరు అంటే మొదటి నీరు. ప్రాణులకన్నా ముందు నీరు పుట్టింది కాబట్టి జలనిథి అయిన సముద్రానికి మున్నీరు అనే పేరు అతికినట్టు సరిపోతుంది. ఈ మున్నీటికి రాణి ఎవరు? ఏ నదులైతే ప్రత్యక్షంగానో పరోక్షంగానో స,ముద్రుడితో సంగమిస్తున్నాయో ఆ నదులన్నీ మున్నీటి రాణులే! వాటిలో ప్రముఖంగా ఎన్నదగినదీ, దేవతల నది అయిన గంగకు రూఢ్యర్థంలో ఈ పదం వర్తిస్తుంది. "మున్నీటిరాణి యౌ విన్నే ఱే యేవేల్పు నడుగుఁఉ గెందామర నలరు తేనె" అంటూ పొన్నికంటి తెలగనార్య కవి వ్రాసిన యయాతి చరిత్రములో వ్రాశాడు.

**ముయ్యేఱు:** మూడుమార్గాల్లో ప్రవహించేనది, త్రిపథగా! "యీా మేనున్న దెట్లు తప్పనియట్లుగా నుండె ముయ్యేరు తలమీఁద గల్గు సామి!" అంటూ విశ్వనాథ

మధ్యాక్కఱలు"లో విశ్వనాథవారు ముయ్యేరు తలమీదగలిగిన స్వామి అని స్తుతిస్తారు.

**ఱెప్పవేయని మెప్పు కేళాకూళి:** రెప్పవేయని వారు అంటే మరణం లేనివారు దేవతలు. మెప్పు అంటేవారు కొలిచినది కేళాకూళి అంటే మడుగు లేదా ప్రవాహం. రెప్పవేయని మెప్పు కేళాకూళి అంటే దేవతలు కొలిచే ఆకాశగంగ అని!

**ఱెల్లుకానుపు సవతి:** కుమారస్వామి తల్లి అయిన పార్వతికి సవితి–గంగానది

**వాకతాలుపు:** గంగాధరుడు. గంగని శిరసున ధరించినవాడు.

**వినుజాలు:** జాలు అంటే ప్రవాహం. వినుజాలు అంటే ఆకాసంలో ప్రవహించేది. ఆకాశగంగ. గంగానది

**వినువాక/విన్వాక:** వినువాక అనేది ఆకాశగంగకు తెలుగు పేరు. కూచిమంచి తిమ్మకవి శివలీలావిలాసము కావ్యంలో "మినువాక తెలినీరు నినిచినకుండికం బసిండిచాయలం గేరుపల్లజడలు అని ప్రయోగించాడు.

**విన్నుకేళాకూళి:** విన్ను లేదా మిన్ను అంటే ఆకాశం. కేళాకూళి కేళకుళి అంటే మడుగు సరస్సు, ప్రవాహం అని! విన్ను కేళాకూళి అంటే మిన్నేరు, ఆకాశగంగ!

**వెన్నునడుగుపాప:** వెన్నుడు అంటే విష్ణువు. ఆయన పాదాలకు పాప అంటే పాదంలోచి పుట్టింది గంగానది

**వెల్లివాఁక:** వెల్ల అంటే తెలుగులో తెల్లనిది అని. వాక అంటే నది వెల్లివాక తెల్లని నది. నిర్మలమైన నదిగా గంగమ్మను కీర్తించటానికి వెల్లివాక అని ఆమెను పిలిచారు తెలుగు ప్రజలు.

**వెన్నెలవంక:** నెలవంక అంటే చంద్రుడు. శివుడి శిరసున అలంకారంగా ఉన్నాడు. గంగకూడా శివుని శిరసున చేరింది ఆమెని వెన్నెలవంక అన్నారు. "నెలవంకతోడి వెన్నెలవంక గలమేటి" అని నెలవంక, వెన్నెలవంక రెండూగల మేతి అంటూ తెలుగు కవులు శివుని కీర్తించారు.

**వేలుపుజక్కర:** వేలుపులు అంటే దేవతలు. జక్కర అంటే నది. ఏరు,ప్రవాహం. జకరభూమి అంటే బావుల మీద బోరుపంపుల ఊట నీటిమీద ఆధారపడి వ్యవసాయం చేసే భూమి అని! జక్కర రాయఁడు లేదా జక్కరలతేడు అంటే సముద్రుడు. నదుల పెనిమిటి అని తెలుగు వ్యుత్పత్తికోశం వ్రాసింది.

వేల్పుటేఱు:వేల్పుఏరు=దేవతానది

**వేల్పుడిగ్గియ:** వేల్పులు అంటే దేవతలు. నీటీ ఊట వుండి ప్ వ్యవసాయం త్రాగునీటి అవసరాలకు సంపూర్ణంగా ఉపయోగిస్తూ, మెట్లు దిగి నీళ్ల తెచ్చుకోవటానికి వీలైన జలాశయం లేదా మెట్లబావిని డిగ్గియ అంటారని బూదరాజు రాధాకృష్ణగారు మాటల మూటలు అనే పుస్తకంలో వ్రాశారు. అనాదిగా భారతీయ సంస్కృతీ వికాసానికి జాతి వికాసానికి మూలకారణమైన గంగానదిని వేల్పుడిగ్గియ అని గౌరవభావంతో పిల్చుకుంటున్నారు తెలుగువారు.



# 'దొబ్బు'

**"మొ**నలకై దువుతోడ మురిపంపుటిరిగుంపు/మఱపింపుకుత్తుకయొఱపుతోడ
తలవాఁక జిగితోడఁ దెలిమబ్బు వెలిద్రొబ్బు/తెలిగిబ్బతత్తడ సోయగముతోడ
పునుకపళ్ళెముతోడ మినుముట్టఁ గనుపట్టు/సెనుగట్టు వింటియొప్పిదము తోడ
చిన్ని క్రొన్నెలవెన్నెల చెన్నుతోడఁ బేసికన్నులచిన్నెలవాసితోడజి
గట్టుదొరపట్టితోఁ గూడి గట్టువిల్తుఁ డపుడు తఱిగట్టుదరికి వయ్యాళి వెడలె"

వీరేశలింగంగారు శుద్ధాంధ్ర మహాభారతము, శుద్ధాంధ్రోత్తర రామాయణము అనే రెండు గ్రంథాలు వ్రాసి 1911లో ఒకే పుస్తకంగా హితకారిణీ సమాజం ద్వారా ప్రచురించారు. వీరేశలింగంగారి తెలుగు భాషాభిమానాన్ని, ఆయనలోని కవిని ఆయన సంస్కరణ వాదం మింగేసిందంటే అతిశయోక్తి కాదు. అద్భుతమైన అచ్చతెలుగు కావ్యాలివి. శుద్ధాంధ్రోత్తరరామాయణంలో ఆయన ఈ అచ్చతెలుగు పద్యంలో "తెలిమబ్బు వెలిద్రొబ్బు" అనే ప్రయోగం చేశారు. తెలిమబ్బుని వెళ్ళదొబ్బటంవలన వెలుగు రేఖలు విరజిమ్మటం అంతరార్థం.

"మందస బలంబున నందరు ద్రొబ్బి తెచ్చి" అని సాక్షాత్తు ఆదికవి నన్నయగారే దొబ్బుని ప్రయోగించాడు. ఇక్కడ దొబ్బుకు రావటం అంటే అప్పళంగా తెచ్చుకోవటం అనే అర్థం ధ్వనిస్తోంది. "శైల తటంబులందు ద్రొబ్బించితి" అని, "ఉషఃకాంత చంద్రుణ్ణి మరిగి సూర్యుణ్ణి వెళ్ళ దొబ్బిందని "పండ్లూడవేసి ద్రొబ్బుడు" అని పోతనగారు దొబ్బుని స్వేచ్ఛగా ప్రయోగించారు.

"పడ ద్రొబ్బె మద్దుల బకునిజీరె", "శైల తటంబులందు ద్రొబ్బించితి", "ముందఱికి దొబ్బి తండ్రికి మ్రొక్కుమనుచు" "రక్కసుల ఱేడు తన తొడలవై నుండనీక గొబ్బు నదిగ దొబ్బి" ఇలా పోతనగారు అనేకసార్లు ఆంధ్రమహా భాగవతంలో దొబ్బుని వాడారు.

"నీట ద్రొబ్బించిన" అని పొన్నిగంటి తెలగనార్య, "మెడబట్టి వెడలద్రొబ్బిన"

అని చదలవాడ మల్లయ్య కవి, "నా కంజాక్షి బ్రోదొబ్బె" అని పింగళి సూరన గారు వీళ్లంతా నిర్మొహమాటంగా దొబ్బు ప్రయోగం చేసిన వాళ్లే!

"పాపపుణ్యములు రెండు పక్కనున్న చీలలు/తోపులయన్న పానాలు దొబ్బు దెడ్లు" అనీ, "పనిగొంటే జవ్వనము బంగారువంటిదె పో/దినములు దొబ్బితే వన్నెదీసుఁగాని (14–59)" అనీ, "తుంచరాదు నీ మదము దొబ్బరావు దినములు (14–122) అంటూ అన్నమయ్య దొబ్బు పదాన్ని స్వేచ్ఛగానే ప్రయోగించాడు.

తెలంగాణాలో దొబ్బు అంటే–తొయ్యటం. పడత్రోయటాన్ని పడదొబ్బు అంటారు. పోతనగారు వాడిన ఈ దొబ్బు, రొప్పు లాంటి పదాల్ని బట్టి పోతనగారు తెలంగాణా వాడేనని నిరూపిస్తున్నాయని కొందరు పండితులు భావించగా, ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బారావుగారు "కాటుకకంటినీరు"అనే పద్యంలోని 'కోసరం', ఆయనే ప్రయోగించిన గన్క (కనుక) లాంటి పదాలు ఓరుగల్లు ప్రాంతంలో వాడకంలోలేవు, కడపమండలంలో బాగా వాడతారు కాబట్టి పోతన ఒంటిమిట్ట వాడే అన్నారు(1904 ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక). ఇప్పటి మాండలిక పదాల్ని 700 యేళ్ల నాటి గ్రంథానికి ఆపాదించటం ఒకట్రొండు పదాల్ని బట్టి రచయిత మూలాలు నిర్ణయించటం సాధ్యమేనా అని నా సందేహం.

అచ్చమైన తెలుగు పదాల్ని కాలక్రమంలో కొన్ని ప్రాంతాలవారు విస్మరించటం,కొన్ని ప్రాంతాల్లో వదలకుండా వాడుతూ ఉండటం సహజం. కొన్ని ప్రాంతాల్లో అర్థ విపర్యయం చెందటమూ సహజమే! 'దొబ్బు' కొన్ని కోస్తాజిల్లాల్లోనే బూతు. తక్కిన వారికి వాడుకపదమే! దొబ్బులు పెట్టడం అనేది బూతులు తిట్టడం అన్నంత మాటేగాని, దొబ్బు బూతుకాదు. గుంట, దొబ్బు, ఎత్తు, నూకు లాంటి పదాల్ని అశ్లీలంగా భావించే వారితో మాట్లాడేప్పుడు జాగ్రత్త అవసరం. అంతే!

దొబ్బుకి 'తుర్' అనేది మూలపదం కావచ్చు. తోలటం అని దీని భావం. తురట్టు, తురట్టి అంటే తరమటం. త్రోపటు, త్రోపాడు, త్రోపు, త్రోయు, త్రోలు, త్రోపుడు, త్రొబ్బు, ద్రొబ్బు, దొబ్బు ఇలా త్రోయటం అనే అర్థంలో దొబ్బు ఏర్పడిందని ద్రవిడియన్ ఎటిమలాజికల్ నిఘంటువు(పే. 292) వివరిస్తోంది. కన్నడ

తుళు భాషల్లో కూడా దొబ్బు పదం వాడుకలో ఉంది.

ప్రాచీన ఆఫ్రో ఏసియాటిక్ భాషల్లో కూడా ఈ పదం కనిపిస్తుంది. దొబ్బు అంటే ఆఫ్రికన్ భాషలో తీసుకుపోవటం అని! నైలూ నుండి కృష్ణదాకా జరిగిన ద్రావిడ జాతుల పరివ్యాప్తికి ఈ దొబ్బు ఒక సాక్ష్యం. పూర్వతెలుగు భాషలో 'త్రొ', 'ద్రొ' పదాలకు to push, shove, thrust అర్థాల్ని తెలుగు ఎటిమాలజీ నిఘంటువు ఇస్తోంది. త్రోచటం అంటే త్రోయటమే ఇంగ్లీషులో 'త్రో' (throw) సరిగ్గా ఇదే అర్థంలో ఉండటం కాకతాళీయమేనా?

నూకు అంటే నెట్టటం, దొబ్బు అంటే తొయ్యటం. ఈ నూకు ఉత్తరాంధ్రలోనూ, దొబ్బు కోస్తాలోనూ నానార్థాలతో వాడకంలో ఉన్నాయి. నెల్లూరుమండలంలో దొబ్బు పదానికి వాడుక ఎక్కువ. అశ్లీలార్థం దాన్ని ప్రయోగించే విధానంలో ఉంటుంది. కానీ, ఆ పదంలో లేదు.

బహుశా "దొబ్బగా అయ్యావు" అంటే లావుగా అయ్యావు, ఉత్తేజం పొందావు అనే అర్థాల వలన దొబ్బు అశ్లీలార్థంలోకి మళ్ళి ఉండవచ్చు. త్రోయటం, సంభోగించటం, అపహరించటం(దొబ్బాడు), తిట్టటం(దొబ్బులెట్టు), వెళ్ళిపోవటం (దొబ్బేశాడు) ఇలా అనేక అర్థాల్లో దొబ్బు కనిపిస్తుంది. దొబ్బులాట అంటే తోపులాట, గుద్దులాట. 'దొబ్బుడాయి' అంటే, అహంకరించి దొబ్బటం వలన కలిగే మదం లేదా గర్వం. 'తెలిమబ్బు వెలిదొబ్బటాన్ని సూర్యుడి వెలుగు రావటంగా వీరేశలింగంగారే వాడారు.

దొబ్బితే మంచి జరుగుతోందంటే, అది మంచిపదమే కదా! దొబ్బటం బూతు కాదు. జుగుప్సాకరంగా రాస్తేనే బూతు అవుతుంది.

# కొందలం

**“నా**కు నెల్లపక్షులకంటె జవాతిశయముగలదు, బహుయోజనము లయినను క్షణమాత్రములోఁ
గ్రుమ్మరి మరలి రానోపుదు, దానిఁ బట్టియేకదా లఘుపతనకుఁడని యన్వర్థసంజ్ఞఁ బడసియున్నాఁడను,
నీవు కొందలపడకుము, నే నిక్కబిడ నున్నట్లే యెంచుకొనుము”
చిన్నయసూరి మిత్రలాభంలోని పై వాక్యంలో “నీవు కొందలపడకుము” అనే ప్రయోగానికి అర్థం, దాని మూలాల గురించి కొంత వివరణ అవసరం. ఉండే ఊళ్లకు, తినేవంటకాలకు, వాడే వస్తువులకు, మాట్లాడే పదాలకు మన భాషలోనే మూలాలు వెదకాలి.

తెలుగు ‘కొందలం’(sorrow, perturbation), తమిళం ‘కొంతలం’ (confusion, perturbation, turmoil), కన్నడం ‘గొందల’ (bustle, confusion,) ఒకే అర్థంలో ఏర్పడ్డాయి. అచ్చతెలుగు పదాల కోసం తెలుగు ఎటిమాలజీ అనే నిఘంటువు ఆన్లైన్లో దొరుకుతోంది. ఇందులో, Proto-Telugu : kondal తెలుగు కొందలము అయ్యిందని పేర్కొంది. అచ్చమైన తెలుగు మాటిది. కొందరు భావించినట్టు సంస్కృత ‘గుందల’(మద్దెలమోత) లోంచి లేదా ప్రాకృత గొందల/గుందల(హర్షసూచక ధ్వని) లోంచి ఏర్పడలేదు.

కొందలపడు, కొందలపాటు, కొందలించు, లొగ్గిడిల్లు, తెరలు, దురపిల్లు, తలరు, కలగుండుగొను, కలంగు, కారాకూరము, తెగచు, పొలివోవు, కలఁతఁబడు, తరిపడు కలగంబారు ఇవి క్షోభపడటం అనే అర్థంలో ఉన్నాయని తూము రామదాసకవి ఆంధ్రపద నిధానము’ లో పేర్కొన్నారు. అక్కిలివడు, అట్టిట్టుపడు, అదవదపడు, అరవరయగు, అటిముటిపడు, అల్లలనాడు, ఉడ్డాడు, ఉత్తలపడు, కంగారువడు, కడవడించు, కలగబాటు, కలగుండుగొను, కలగూడునడు, కలవరవడు, కలుచపడు, కాద్పడు, క్రాలు, గగ్గోలుపడు, గజిబిజించు, చికాకుపడు,

చిడిముడుపడు, చుమ్మలుచుట్టు, చెదరు, తక్కలపడు, తత్తఱపడు, తటమటించు, తల్లడించు, తిరివెట్టు, తెగుచు, తెరలు, త్రెక్కొను, త్రిప్పికొలుపు, పల్లటిల్లు, వుల్లసిల్లు, మలగు, లొగ్గడిల్లు, సుడియు...ఇన్ని పదలు క్షోభ అనే అర్థంలో కనిపిస్తాయి.

'చోపిడు', 'చోపుడు పెట్టు', 'చోవువెట్టు' లాంటివి పశుపక్ష్యాదుల్ని హింసించడానికి వాడతారు. చోపిడి పెట్టటం అంటే చావగొట్టి చెవులు మూయటం అని! చక్కని తెలుగులో నోరారా పలికిన ప్రజల పదాలివి. వాడకం లోంచి పోవటానికి సంస్కృతాంగ్ల వ్యామోహాలే కారణం. వీటిలో దేని విశేషార్థం దానికుంది. వాటిని వదిలేసి, టార్చర్ పెడ్తున్నాడు, కన్ఫ్యూజన్లో ఉన్నాడు, బోర్ కొడ్తున్నాడు లాంటి మాటలతో సరిపెడ్తున్నాం. ఒక్కోపదాన్ని ఇలా చేజార్చుకుంటే భాష తరిగిపోయి మరణిస్తుంది. వాడకంలో పెడితే వికసిస్తుంది.

"తమ్ముడా! నాకాపదను శంకించి కొందలపడు జానకి గోచావరి కేగిన దని మాత్రమెటు తలంపనగును. అయిన నడువుము" అని చక్రావధానుల మాణిక్యశర్మగారి లంకా దహనము–నాటకంలో రాముడు లక్ష్మణుడితో అంటాడు.

"కొందఱు గలం డందురు నినుఁ గొందఱు లేడందు రతఁడు గుణిగాఁ డనుచుం, గొందఱు గలఁ డని లేఁడని, కొందల మందుదురు నిన్ను గూర్చి మహేశా" అని పోతనగారు భాగవతంలో దేవుడున్నాడోలేడో అని కొందరు కొందలమందుతా రంటారు పోతనగారు.

"గోవిందునిమందలెల్ల గొందల పెట్టన్" అని భాగవతంలో ప్రయోగం. "గొందలమందెం ద్రిదశేంద్రు పట్టనము పాతాళంబు ఘూర్ణిల్లె" అని తిక్కనగారి ప్రయోగం. "...గొందలమంది పాండువిభు కోడలు దవ్వుల నున్ననన్ను గోవిందుఁడ కావుమంచుఁ బలవించుట" అనేది కూడా ఉద్యోగపర్వంలో తిక్కనగారి ప్రయోగమే! "అప్పుడు పందికదుపుల నెనునెంటం దవిలి కొందలింపం జిందఱవందఱగాఁ జేసి యేసీ యట చనఁ జన..."అని ఉత్తర హరివంశంలో నాచనసోమన గారి ప్రయోగం. "కరము కొందలపెట్టక యెట్లుఁ" అనేదీ ఆయన ప్రయోగమే! కాళ్ళూ చేతులు వణుకుతున్నాయని! "కలఁగుచు నేయుపాయమును గానక నిన్నును నీతనూజుఁ గొందలమున విక్రయించు.." అని హరిశ్చంద్రుడు భార్యాబిడ్డల్ని

కొందలాన విక్రయిస్తున్నానంటాడు. “కొందలపడు సాధుకోటి కన్నీరు/యాదవీ మధురాధరామృతా స్వాద/ మేదుర రుచికన్న మిక్కిలి యగునె?” అని పుట్టపర్తి నారాయణాచార్యులుగారు పండరీభాగవతంలో కొందలపడే సాధుజనుల కన్నీరు గురించి ప్రస్తావిస్తారు.

కీచకవధ సందర్భంలో తిక్కనగారి గొప్ప పద్యం “అనుచుఁ గొందలపడు కోర్కెలగ్గలించి/చిట్టుముట్టాడుచుండ నచ్చెలువ చెలువు/ తగిలి తన యిచ్చఁబాఱు చిత్తంబు పజ్జ/నరిగి యిట్లనునక్కీచకాధముండు” కోర్కెలు కొందలపడటం వలన కీచకుడి చిత్తం ఇచ్చబారింది అంటే ఇష్టం వచ్చినట్టు వెళ్ళిందంటాడు. మనసు కొందలపడితే ఆ మనిషిలో పైశాచికత్వం చిట్టుముట్టాడుతుందట! ఇవి అచ్చతెలుగు మాటలు. ఒకప్పుడు జనం మాట్లాడినవే! రచయితలు తరచూ వాడుతుంటే మళ్ళీ వాడకంలో కొస్తాయి.

“కొందలపడితే పోయినవాళ్లు తిరిగొస్తారా? కొంచెం ఎంగిలిపడు” (దుఃఖం)

“కొందలపడి కుంగిపోయాడు” (విచారం)

“కొందలించి సాధించేదేముంది. ఆలోచించి అడుగేయాలి” (బాధ)

“అప్పుతీర్చటం కోసం ఉన్న ఇంటిని కొందలించి అమ్ముకొంటు న్నాను”(కొండంత వేదన)

“పచ్చచేను కనిపిస్తే చాలు, ఎప్పుడు కబ్జా చేద్దామా అని కొందలించిపోతాడు” (ఆరాటం)

“బాకీ తీర్చలేదని కొందలించి ఇల్లంతా చిందరవందర చేశారు”(ఆగ్రహం)

“మళ్లీ గాలివాన ఒస్తుందంటే జనం తె కొందలిస్తున్నారు” (భయం)

“బందిపోట్ల మంద నిన్న ఊరుమీదపడి కొందలించి దోచుకుపోయారు” (బెదిరింపు)

“అందలం ఎక్కినవాడు కొందలించే మనసుని మందగించుకోవాలి” (ఎగిరెగిరిపడు)

“పని అవుతుందో కాదోనని కొందలించిపోతున్నాడాయన” (సందేహం)

“కొందల మొకయింతలేక” అంటే ఓహరిసాహిరిగా సాగిపోవాలని!

(సందేహం)

"ఇంటికి ఆలస్యంగా వెడితే ఇంట్లో వాళ్లు కొందలపడతారు" (కంగారు)

ఎప్పుడూ ఏదోఒకటి కావాలంటూ పిల్లలు ఒకటే కొందలపెడ్తు న్నారు"(చికాకు)

"అనవసరంగా కొందలపడకు" (అత్యాశ)

"మనసు కొందల పెడ్తోంది" (ఆందోళన)

కొందలింపు పదానికి బదులుగా మనంవాడే 'కలత'అనే పదానికి ఇన్ని రకాల ప్రయోగా ల్లేవు. సూటిగా, స్పష్టంగా, సున్నితంగా, అందంగా రచన సాగాలంటే ఇలాంటి లోతైన పదాల వాడకం మనకు అలవాటై ఉండాలి.

కొందలం తెలుగు మాట. మన మాటని మనం నిలుపు కోవాలి!



# తీర్థకాకం

**లం**చం అడగటానికి అల్లు రామలింగయ్య చేత "ఆమ్యామ్యా" అంటూ నీళ్లు నములుతూ మాట్లాడించి చివరికి దాన్నొక ధ్వన్యకరణ పదంగా మార్చారు బాపూ రమణలు. ఆమ్యామ్యా అంటే లంచం అనే అర్థం అలా తెలుగు సాహిత్యంలో స్థిరపడిపోయింది.

కాకా పట్టడం కూడా ఇలాంటి పదమే! అనేక అర్థపర్యాయాలు, విపర్యాయాలు చెంది, పొగిడి పనులు చేయించుకునేవాడనే అర్థంలో స్థిరపడింది. దాని ప్రారంభం కాకితోనే జరిగింది. ఈ కాకి ఏకాకే! ఆశచేత నిలకడ లేకుండా తిరిగే కాకి. పిండాల కోసం తీర్థాల దగ్గర తిరిగే ఈ కాకిని 'తీర్థకాకి' అంటారు.

తీర్థం అంటే పుణ్యస్నానాలు చేసే పవిత్ర క్షేత్రం. అక్కడ పితృదేవతలకు తర్పణాల కోసం పిండాలు చేసి కాకులకు పెడతారు. ఇలా కాకులకు పెట్టే ఆచారం ఈజిప్షియన్లకూ ఉంది. వాళ్ల ప్రాచీనభాషలో 'కా' అంటే ఆత్మ. 'కా' అనే చక్రవర్తి (ఫారో-క్రీ.పూ. 3,200) తమ జాతికి ఆత్మ లాంటివాడని అతని పేరున ఆత్మని 'కా' అని పిలిచారు. ఈజిప్టు రాజవంశాల కంటే ఈ "కా" చక్రవర్తి చాలా పూర్వుడు. మనిషి మరణించినా, 'కా' ఆ వ్యక్తి శరీరాన్ని అంటిపెట్టుకునే ఉంటుందని ఫారో అనే చక్రవర్తులకు పిరమిడ్లు నిర్మించారు. 1902లో ఈజిప్టులో ఒక సమాధిని తవ్వితే అందులో ఓ స్థూపాకారపు పాత్రపైన 'కా' అనే పేరు కనిపించింది. ఆఫ్రికా పదాన్ని Af-rui-ka అని విడదీసి 'కా' అంటే మూల పురుషుల జన్మస్థలి అనే అర్థాన్ని సాధించారు. 'కా' అనే పేరుకి బహుశా మూలపురుషుడు అని అర్థం కావచ్చు.

కాకిని ఆహ్వానించి పిండప్రదానం చేసే ఆచారం మనకు లాగానే, ఈజిప్షియన్లకూ ఉంది. ఆఫ్రికన్ భాషల్లో 'కావర్' అనీ, సెమెటిక్ భాషల్లో 'కారి' అనీ, ఒమెటిక్ భాషల్లో 'కుర్' అనీ కాకిని వ్యవహరించేవారు. కాకి పితృదేవతల

స్వరూపం అయ్యింది. కాకి పిండాల కథలో ద్రావిడులూ పాత్రధారులే! ఆది నుండీ ఈ పిండప్రదానం మనకూ ఉండే ఉంటుంది. నిరూపించటానికి తగిన ఆధారాల్లేవు.

నిజానికి, క్రీ.పూ. 5వ శతాబ్ది దాకా సమాధులు నిర్మించే అలవాటు మనకూ ఉండేది! మనవాళ్లు పిరమిడ్లు కట్టకపోయినా సమాధులు కట్టారు. క్రీ.పూ. 2000 నుండీ 500 మధ్య కాలాలకు చెందిన కొన్ని సమాధులు తెలుగునాట కనిపించాయి. రాతిపేటికలో శవాన్ని, అతని వస్తువుల్ని, ఆభరణాల్ని ఉంచి, పైనబండరాళ్లతో మూసి పెద్ద గూడు కట్టేవాళ్లు. వీటిని రాక్షసగుళ్ళు, పాండవ గుళ్లు ఇలా పిలిచారు. ఆ సమాధులు అనాటి ప్రసిద్ధులవి కూడా కావచ్చు! మనం ఆ చరిత్రని పదిలపరచుకోలేదు. నైలూ నుండి కృష్ణదాకా వ్యాపించిన ప్రజలే తొలి ద్రావిడులనే సిద్ధాంతం ప్రకారం, 'కా' పేరున 'కా+కుళం' (కృష్ణానది) లాంటి పేర్లు ఇక్కడా వ్యాప్తి చెందాయి. కాకి పిండాల ఆచారం కూడా ఇలానే ఇక్కడా వ్యాప్తిలో కొచ్చిందని ఒక ఊహ చేయవచ్చు.

'కాకికి ఎంగిలి చెయ్యి కూడా విసరడు' అనే విమర్శకు తల్లిదండ్రులకు తద్దినం పెట్టడని భావం. సాధారణంగా పిండప్రదానాలు చెరువులు, కాలువలు లేదా నదుల వొడ్డున గానీ, శ్మశానంలో గానీ పెడతారు. పిండాల కోసం కాకులు అక్కడే ఎగుర్తుంటాయి. ఇలా పిండాలకోసం ఆశగా తీర్థాల దగ్గర ఎదురు చూసే కాకిని 'తీర్థకాకి' అంటారు. ఆహారాన్ని పసిగట్టి చేరగలిగే తెలివి కాకులకుంది. తీర్థాల దగ్గర కాకులే కాదు ఉచితంగా పొందేందుకు చాలా రకాల మనుషులు గుమిచేరి విసిగించి వేధిస్తుంటారు. వీళ్లని తీర్థకాకి అంటారు ఎగతాళిగా!

ఈ తీర్థకాకిని 'అదవ' అనికూడా పిలుస్తారు. అందమైన ఇలాంటి తెలుగు తిట్లు చాలా ఉన్నాయి. ఒకరి మోచేతి కింద నీళ్లు తాగే వాడు అదవ. వాడిది అదవ బతుకు. బహుశా సంస్కృత 'అధవః'కు ఇది వికృతి కావచ్చు. సారా కోసం నీచంగా దిగజారి అడుక్కొని తాగటాన్ని పాండురంగ మహాత్మ్యంలో తెనాలి రామకృష్ణుడు 'అదవతాగుడు' అన్నాడు. దీన్ని Niggar boozing అనీ, ఇలా తాగేవాణ్ణి Knave అనీ పిలుస్తారు. ఎవడో తాగిన గ్లాసులో అడుగూబొడుగూ

మిగిలిన సారాచుక్కల్ని తాగే 'అదవ' అని! కాల్చి పడేసిన సిగరెట్ పీకల్ని ఏరుకుని తాగేవాడూ ఇలాంటివాడే! సిగ్గు, ఆత్మాభిమానం అన్నీ వదిలేసి తన పని నెరవేరటంకోసం ఎంతనీచానికైనా దిగజారే అదవలు తీర్థకాకుల్లా మారుతుంటారు.

తీర్థకాకిలా ఎంగిలి మెతుకుల కోసం దిగజారటాన్ని తీర్థకాకం అంటారు. దీన్ని కాకా పట్టటం అంటున్నారు. కాకి కావుకావు అంటోందంటే ఏవీ శాశ్వతం కావంటోందని కరుణశ్రీ భాష్యం చెప్పారు. కా...కా అంటోందంటే అది కాకా పడ్తోందని అర్థం.

తైర్ కొట్టడం అంటే ఇదే! తైర్ లేదా తయిర్ అంటే పెరుగు అనీ, పొగడ్త అనీ రెండర్థాలూ ఉన్నాయి. తైరుకొట్టాడంటే అంటే పొగిడి కాకాపట్టాడని! పగలు చూస్తే రాత్రికి కల్లోకి వచ్చే భయంకరుణ్ణి సుందరాంగుడు అని పొగిడ్తే అది తైర్ కొట్టటం! తోమటం అనే ప్రయోగం కూడా ఉంది. ఎంత తోమితే అంత త్వరగా పని పూర్తవుతుంది! తోమించుకునే వాడికి వీడు తోముతున్నాడని తెలుసు. కాసేపు తోమించుకుని ఇద్దామనే ఆగాడన్నమాట! తాళంవేయటం, వంతపాడటం అని కూడా పిలుస్తారు.

ఎక్కడో ఎందుకో మొదలైన ఈ తీర్థకాకం జన వ్యవహారంలో ఇలా చిలవలుపలవలై కొత్త అర్థంలోకి మారిపోయింది. ఇలాంటి వ్యంగ్యవైభవాన్ని మరిచి పోతున్నామంటే సరసమూ, రసమూ, రసికతా కోల్పోయి, యాంత్రికంగా మారిపోతున్నామని అర్థం!



# కళారత్న, భాషాబ్జి, సభాసరస్వతి, తెలుగుపసిడి, వైద్యవిజ్ఞాన శౌరి

## డా॥ జి. వి. పూర్ణచందు

## సాహిత్య స్వర్ణోత్సవ ప్రస్థానం

రచయితగా తన యాభై యేళ్ల సాహితీ ప్రస్థానంలో, గ్రంథరచయితగా 44 యేళ్ళ కాలంలోమొత్తం 143 పుస్తకాలు వెలువరించి సాహితీ స్వర్ణోత్సవం జరుపుకుంటున్న సాహితీమూర్తి డా॥ జి వి పూర్ణచందు.

కాలమిష్టు, సంపాదకుడు, ఆయుర్వేద పట్టభద్రుడు, చిత్రకారుడు, తెలుగు భాష మూలాల్ని తవ్వి తీసిన భాషోద్యమ ప్రముఖుడు, మన ఆహార సంస్కృతి మూలాల్ని వెలుగులోకి తెచ్చిన పరిశోధకుడు, తెలుగువారి ఆహార చరిత్ర వ్రాసిన తొలి గ్రంథకర్త, ఐదు పర్యాయాలు ప్రపంచ తెలుగు రచయితల మహాసభల బాధ్యతలు వహించిన మహాకార్యదర్శి, తెలుగునాట బహుముఖీనమైన పాత్ర నిర్వహిస్తూ, ఉభయ రాష్ట్రాల్లోనూ పరిచయం అవసరంలేని సాహితీవేత్తగా చిరపరిచితుడు. 75కి పైగా పురస్కారాలు అందుకొని, రచయితగా తాను అత్యంత సంతృప్త జీవినని ప్రకటించుకున్న సాహితీ పరిపూర్ణజీవి డా॥జి. వి. పూర్ణచందు. 1970–71లకే, హైస్కూల్లో చదివే రోజుల్లోనే 'మేఘమాల' లిఖిత మాసపత్రిక సంపాదకత్వం వహించారు. మొగ్గ దశలోనే ఆయనలో సాహితీ పరిమళాలు వికసించాయని చెప్పాలి.

ఆంధ్రజ్యోతి ఆదివారం సంచికలో మన ఆహారసంస్కృతి మూలాల్ని తర్కిస్తూ "తినరా మైమరచి" శీర్షికన ఆయన వ్రాసే వ్యాసాలు, ఆంధ్రప్రభ, అమ్మనుడి, విశాలాక్షి, గ్రంథాలయసర్వస్వం మాసపత్రికల్లో చేస్తున్న సొగసైన తెలుగు మరుగుల విశ్లేషణలు పూర్ణచందు నిబద్ధతకు నిదర్శనాలు

వివిధపత్రికల్లో 40 వరకూ శీర్షికలు లేదా ధారావాహికలు నిర్వహించారు. 3,000 పైగా వ్యాసాలు, ఇతర రచనలు వ్రాశారు. కవితలు, కథలు, నవలలు, రేడియో నాటికలతోపాటు, విమర్శనా వ్యాసాలు, పరిశోధనా వ్యాసాలు, జీవిత

చరిత్రలు కూడా వ్రాశారు. "యూ ట్యూబు" ఛానల్స్ ద్వారా మెడికల్ ఇంటర్వ్యూలు, ప్రసంగాలు లక్షల సంఖ్యలో తెలుగు వీక్షకుల సందర్శనాన్నిపొందాయి. దేశవిదేశాల్లో వీరి వీడియోలకు అభిమాన సందోహం ఉంది.

35 పరిశోధనా బృహద్గ్రంథాలకు సంపాదకుడిగానో, సహసంపాదకుడిగానో వ్యవహరించారు.

తెలుగు భాషా సంస్కృతుల మూలాల్ని వెలికి తీసిన "తెలుగే ప్రాచీనం" "నైలు నుండి కృష్ణదాకా" గ్రంథాల ద్వారా భాషోద్యమ దీప్తి కలిగించారు. లండన్ నగరంలో జరిగిన తొలి ప్రపంచ తెలుగు చరిత్ర మహాసభల్లో తెలుగువారి ఆహారచరిత్రపైన ప్రసంగించారు.

పూర్వపు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీకి 1984లో జరిగిన ఎన్నికల్లో ఆంధ్ర–నాగార్జున విశ్వవిద్యాలయాల సాహితీ సంస్థల నియోజకవర్గం నుండి తన 26వ యేట సభ్యునిగా ఎన్నికయ్యారు.

విద్యార్థి దశలో ఉన్నప్పుడే 1979–80లలో ప్రారంభమైన మినీకవితా ఉద్యమంలో పూర్ణచందు ప్రముఖపాత్ర పోషించారు. అనేక ప్రాంతాల్లో మినీకవితా ప్రదర్శనలు ఏర్పాటు చేసి ఆ ప్రక్రియ ఉద్యమరూపం సంతరించుకోవటానికి కారకులయ్యారు. కవిత్వానికి ప్రదర్శన అనే ఆలోచన ఆయనదే!

తెలుగు భాషోద్యమ ప్రముఖుడిగా రచయితల పాదయాత్ర సహా వందలాది కార్యక్రమాలు, జాతీయ అంతర్జాతీయ సదస్సులు నిర్వహించారు. తెలుగు భాష, సంస్కృతుల ప్రాచీనతను నిరూపిస్తూ అనేక గ్రంథాలు వ్రాశారు.

కృష్ణా విశ్వవిద్యాలయం ఏర్పాటులోనూ, దానిలో తెలుగు శాఖ ప్రారంభించటంలోనూ విశేష కృషిచేశారు. తన స్వంత గ్రంథాలయం నుండి 1500 పుస్తకాల్ని, అలాగే కృష్ణాజిల్లా రచయితల సంఘం పక్షాన 6 బీరువాల్ని తెలుగు శాఖకు అందించారు.

శ్రీ కృష్ణదేవరాయ మహోత్సవాల నిర్వహణలో ముఖ్యపాత్ర వహించారు. పద్యకవితా బ్రహ్మోత్సవాలు, తెలుగు భాషా బ్రహ్మోత్సవాలు, జానపద సాహిత్య వైభవ సదస్సులకు సంచాలకుడిగా వ్యవహరించారు..

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ హంస పురస్కారం, తెలుగు విశ్వవిద్యాలయం

కీర్తి పురస్కారం, అధికార భాషాసంఘం భాషాభిజ్ఞ పురస్కారం, కాశీనాథుని నాగేశ్వరరావు ఫౌండేషన్ పురస్కారం, ఆరుద్ర సాహితీ పురస్కారం, సద్గురు శివానంద పురస్కారం, మారిషస్ ప్రధాని చేతుల మీదుగా ముంబై తెలుగు సమాఖ్య వారి జీవన సాఫల్య పురస్కారం, మద్రాస్ శ్రీకళాసుధ జాతీయ పురస్కారం, ఆంధ్ర సారస్వత సమితి పూర్ణకుంభ పురస్కారం, లత సాహితీ స్వర్ణవంశీ పురస్కారం, జానమద్ది హనుమచ్ఛాస్త్రి ప్రతిభా పురస్కారం, గోపీచంద్ సాహితీ పురస్కారం, మధునాపంతుల సూరయ్య ప్రతిభా పురస్కారం, ద్వా నా శాస్త్రి పురస్కారం, యర్రమిల్లి నర్సింహారావు పురస్కారం, కె. వి. సత్యనారాయణ పురస్కారం ఇలా 70కి పైగా అవార్డులు, విశిష్ట సత్కారాలు పొందారు. అనేక విశ్వవిద్యాలయాల జాతీయ సదస్సులలో కీలక ప్రసంగం చేశారు. కళారత్న, సభాసరస్వతి, భాషాభిజ్ఞ, తెలుగుపసిడి, వైద్యవిజ్ఞాన శౌరి బిరుదులు వీరిని వరించాయి.

ఆచార్య శరజ్జ్యోత్స్నారాణి జ్యోత్స్నకళాపీఠం పురస్కారాన్ని పూర్ణచందుకి అందించిన సభలో సినారె "తెలుగు ప్రాచీనుడు మన పూర్ణచందు" అన్నారు. బుద్ధప్రసాద్, లక్ష్మీప్రసాద్, గుత్తికొండసుబ్బారావు, పూర్ణచందు ఈ నలుగురూ భాషోద్యమానికి నాలుగు స్తంభాలని వ్యాఖ్యానించారు. సినారె వ్యాఖ్యలే అన్నింటికన్నా పెద్ద పురస్కారంగా భావిస్తాడు పూర్ణచందు.

**వ్యక్తిగతం:** డా॥జి వి పూర్ణచందు 1973-75 విజయవాడ శాతవాహన కళాశాలలో ఇంటర్మీడియట్, 1976-81 విజయవాడ నోరి రామశాస్త్రి ప్రభుత్వ ఆయుర్వేద కళాశాలలో ఆయుర్వేద వైద్యం చదివారు. 1982 నుండి సుశ్రుత ఆయుర్వేద ఆసుపత్రి నడుపుతున్నారు.

భార్య గంగరాజు అరుణాదేవి. ఆమె కూడా రచయిత్రి. నలుడి 'పాకదర్పణం', క్షేమశర్మ 'క్షేమకుతూహలం' గ్రంథాలకు వ్యాఖ్యానం వ్రాయటానికి పూర్ణచందుకు సహరచయితగా ఉన్నారు.

కుమార్తె లక్ష్మీ చేతన, అల్లుడు చక్కిలం శివరామ్ మల్లిక్. న్యూజెర్సీలో ఇద్దరూ సాఫ్ట్ వేర్ రంగంలో పనిచేస్తున్నారు. మనుమరాలు శ్రీ సాత్విక, మనుమడు సమన్యు.

కుమారుడు డా॥ మన్నో కార్తీక్ చెన్నై ఐఐటిలో పిహెచ్ డి, దక్షిణకొరియాలో పోస్ట్ డాక్ చేశారు. వారణాసి ఐ ఐటిలో అసిస్టెంట్ ప్రొఫెసర్ గా పనిచేస్తున్నారు. కోడలు సౌమ్య. మనుమరాలు పూర్ణసంహిత.

**డా॥జి. వి. పూర్ణచందు రచనలు**

**1. సంపాదకులు / సహసంపాదకులుగా (35)**

**కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురణలు (23)**

2. 2006: తెలుగు పసిడి, జాతీయ తెలుగు రచయితల మహాసభల సందర్భంగా పరిశోధనా వ్యాస సంపుటి
3. 2006: తెలుగు భాషోద్యమం-కరదీపిక
4. 2007: వజ్రభారతి: మొదటి ప్రపంచ తెలుగు రచయితల మహాసభల సందర్భంగా పరిశోధనా వ్యాస సంపుటి
5. 2007: స్వర్ణయానం, శ్రీ మండలి బుద్ధప్రసాద్ 50వ జన్మది ప్రత్యేక వ్యాస సంకలనం
6. 2008: తెలుగు భాష విశిష్ట ప్రాచీన సంపన్నత-జాతీయసదస్సు పరిశోధనా వ్యాస సంపుటి
7. 2010: తెలుగు మణిదీపాలు: తెలుగు ప్రముఖుల జీవనరేఖల వ్యాస సంపుటి
8. 2011: కృష్ణాజిల్లా చారిత్రక సర్వస్వం: పరిశోధనా వ్యాస సంపుటి
9. 2011: తెలుగు వ్యాసమండలి: పరిశోధనా వ్యాస సంపుటి
10. 2012: తరతరాల తెలుగు సంస్కృతి- తానా సహకారంతో పరిశోధనా వ్యాస సంపుటి
11. 2012: తెలుగు పున్నమి-2వ ప్రపంచ తెలుగు రచయితల మహాసభల సందర్భంగా పరిశోధనా వ్యాస సంపుటి
12. 2014: సేవాయానం- ఆంధ్రప్రదేశ్ శాసనసభ తొలి ఉపసభాపతి శ్రీ మండలి బుద్ధప్రసాద్ అభినందన సంచిక
13. 2015: తెలుగు యువత-3వ ప్రపంచ తెలుగు రచయితల మహాసభల సందర్భంగా పరిశోధనా వ్యాస సంపుటి
14. 2016: విశ్వనాథ సాహితీ విశ్వరూపం- పరిశోధనా వ్యాస సంపుటి
15. 2016: కథలు-గాథలు: వ్యాస సంపుటి
16. 2017: సినారే సాహిత్య వివేచన
17. 2019: పాటల పూజారి వేటూరి సుందరరామమూర్తి- శ్రీ భువనచంద్ర

రచన,

18. 2019: మహిళ (ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాక సౌజన్యంతో)
19. 2019: ఆంధ్ర రచయిత్రులు-లఘుపరిచయాల కరదీపిక
20. 2019: ప్రపంచతెలుగు వ్యాస సంపుటి, ప్రపంచ తెలుగు రచయితల సంఘం
21. 2021: పసిడి కృష్ణ (వ్యాససంపుటి) కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురణ
22. 2021: కృష్ణాజిల్లా రచయితల సంఘం స్వర్ణోత్సవ ప్రత్యేక సంచిక
23. 2022: గమనం-గమ్యం: 5వ ప్రపంచ తెలుగు రచయితల మహాసభల సందర్భంగా వ్యాస సంపుటి
24. 2023: అమృతభారతి: భారత స్వాతంత్ర్య అమృతోత్సవాల సందర్భంగా ప్రచురణ

**అఖిలభారత తెలుగు అకాడెమీ-బెంగుళూరు ప్రచురణ (1)**

1. 2022: నయనానందకారక తారకరాముడు శతజయంతి ప్రత్యేక సంచిక

**కృష్ణాడిస్ట్రిక్ట్ న్యూ మాన్యువల్ కమిటీ ప్రచురణలు (6)**

1. 2006: విజయవాడ డివిజన్
2. 2006: కృష్ణాజిల్లా శాసన స్రవంతి 1వ భాగం
3. 2006: కృష్ణాజిల్లా గ్రామదేవతలు
4. 2007: కృష్ణాజిల్లా శాసనస్రవంతి 2వ బాగం
5. 2007: కృష్ణాజిల్లా బ్రిటిష్ కైవసం
6. 2007: బెజవాడ చరిత్ర

**ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత మరియు సంస్కృతి సమితి ప్రచురణలు(4)**

1. 2016: కృష్ణాతీరం- కృష్ణాపుష్కరాల సందర్భంగా వెలువరించిన పరిశోధనా వ్యాస సంపుటి
2. 2017: పోలవరం-పట్టిసీమ ఆంధ్రుల ఆకాంక్షలు::ఆంధ్రకవుల కవితా సంపుటి
3. 2018: దేశభాషలందు తెలుగు లెస్స:: పరిశోధనా వ్యాస సంపుటి
4. 2019: జయంతి రామయ్య పంతులుగారి "శాసన పద్య మంజరి"

**గాంధీక్షేత్రం కమిటీ ప్రచురణ (1)**

1. 2018: ఆపద్బాంధవులు

**2. వైజ్ఞానిక రచనలు (5)**

1) 1980: అమలిన శృంగారం మొదటి పుస్తకం, శ్రీ మహాలక్ష్మీ బుక్ ఎంటర్ ప్రైజెస్ ప్రచురణ
2) 1980: రేపటి గ్రహణం-ప్రపంచ భవిష్యత్తు (లఘుగ్రంథం-శ్రీ మైత్రేయతో కలిసి)
3) 1982: మదము(ఆల్కాహాలిజం) వారధి పక్షపత్రిక అనుబంధ లఘు గ్రంథం
4) 1982: సిగ్గు::వారధి పక్షపత్రిక అనుబంధ లఘు గ్రంథం
5) 2014: Quest:Answers that you want to Question::Vijayawada Convents and Tutorials Association

**3. కవిత్వం(5)**

1) 1985: నిజం నిజం లయనిజం మాట (ఆల్కహాలిజం పై కూనలమ్మ పదాలు)
2) 1988: కాంతిస్వప్న: దీర్ఘకవిత, స్పందనసాహితీసమాఖ్య ప్రచురణ
3) 2010: వెలుగు రాగాలు: ఎమెస్కో ప్రచురణలు
4) 2017: ముక్కాలు: తెలుగు, ఆంగ్లం, హిందీ భాషలలో వెలువడిన కవితా సంపుటి
5) 2020: ముక్కాలు- తెలుగు, సంస్కృతం, హిందీ, ఆంగ్లం,. తమిళం, కన్నడం, మళయాళం

**4. నవలలు (3)**

1) 1991: సప్తసింధు(ఎమెస్కో ప్రచురణ)
2) 2017: తెలుగు ధీర: చిత్ర మాసపత్రికలో సిరియల్, శ్రీ మధులత ప్రచురణ
3) 2017: చిగురులు వేసిన కలలు-స్వాతి మాసపత్రిక అనుబంధం, శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ

**5. సాహిత్య విమర్శ (10)**

1. 2003: మాటల ముచ్చట్లు: మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
2. 2003: కొసమెరుపులు: శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ

3. 2004: శ్రీ గీతగోవిందం శృంగార వివేక తత్త్వ రచన- శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
4. 2006: తెలుగులో 5 మహా నాటకాలు వ్యాఖ్యానంతో: సూర్యా బుక్స్
5. 2006: రామాయణంలో విశేషాలు: సూర్యాబుక్స్
6. 2016: పద్యంలో మనం: శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
7. 2017: పద్యానుభవం: శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
8. 2020: పాణిని వ్యాకరణ సూత్రాలు, భాషా సంస్కరణలు
9. 2020: పద్యరాగాలు ఎమెస్కో ప్రచురణ
10. 2022: పూర్ణచంద్రోదయం: (పూర్ణచందు రచనలపై 70 మంది ప్రముఖుల విశ్లేషణ)

**6. చరిత్ర గ్రంథాలు (7)**

1) 2006: అలనాటి పట్టణాలు శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
2) 2006: బ్రిటిష్ యుగం: శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
3) 2006: కాలచక్ర తంత్రం-శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
4) 2006: బుద్ధదేవుని కథ-సూర్యా బుక్స్
5) 2009: గుండె తలుపులు తడుతున్న తెలుగు భాషోద్యమం (లఘు పరిచయ గ్రంథం)
6) 2013: కృష్ణాతీరం-మరోచూపు:: ఆం. ప్ర. హిష్టరీ కాంగ్రెస్ ప్రచురణ
7) 2015: భారతీయ సభా మర్యాదలు శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ

**7. భాషాసంస్కృతులు (9)**

1) 2008: తెలుగే ప్రాచీనం: ఆంధ్రప్రదేశ్ అధికార బాషాసంఘం
2) 2008: నైలూ నుండి కృష్ణదాకా- ద్రవిడ విశ్వవిద్యాలయం ప్రచురణ
3) 2018: తెలుగు కోసం, ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత సంస్కృతీ సమితి ప్రచురణ
4) 2018: తెలుగులో అతిథి పదాలు
5) 2019: మాతృభాష-మహాత్ముడి బాట శ్రీ మధులత పబ్లికేషన్స్
6) 2023 తాంబూలం: ఆరోగ్యం ఆనందం, మరో 100 విశేషాలు: (పరిశోధనా గ్రంథం) జాగృతి వారపత్రిక సీరియల్

7) 2023: గంగమ్మ: తెలుగు-గంగ పదబంధాలు
8) 2024: సొంపైన తెలుగు: తెలుగు నుడులసంచికట్టు
9) 2024: జయగాంధీయం: ( ఈ శతాబ్దానికి గాంధీయే అవసరం)

**8. ప్రముఖుల జీవిత చరిత్రలు (11)**

1. 1986: తెన్నేటి సూరి సాహితీ మహోదయం-శ్రీ మైత్రేయతో కలిసి, సుధ పబ్లికేషన్స్ ప్రచురణ
2. 1992: శ్రీ ముక్కామల నాగభూషణం జీవితము-రచనలు: కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురణ
3. 2000: దీనజనబాంధవుడు-శ్రీ వేముల కూర్మయ్య జీవిత చరిత్ర: శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
4. 2015: స్మృతి గీత-శ్రీమతి గుత్తికొండ రామరత్నం జీవితం, గుత్తికొండరామరత్నం చారిటబుల్ ట్రస్ట్ ప్రచురణ
5. 2016: గమనం-శ్రీ గుత్తికొండ సుబ్బారావు జీవిత చరిత్ర - గుత్తికొండ రామరత్నం చారిటబుల్ ట్రస్ట్ ప్రచురణ
6. 2020: హరహరమహాదేవ (శ్రీ అప్పయ్య దీక్షితుల జీవితచరిత్ర): శ్రీ రాఘవేంద్ర ప్రచురణలు
7. 2020: హరిచరణపరాయణ శ్రీ నారాయణ దీక్షితులు
8. 2020: తమిళ నేలపై వెలిగిన తెలుగు మణిదీపాలు-3 తిరుమల నాయకుడు (అచ్చులో)
9. 2020: మరో తెలుగు సూర్యుడు పీటర్ పెర్సివాల్
10. 2023: పరువు: సుబ్బారావు ం నేనుఏ50
11. 2023: 'పెరిమ' వన్నె కెక్కిన పెద్దల జీవనగాథలు

**9. వైద్య గ్రంథాలు (24)**

1. 1986: ఏమిటా రహస్యం? ప్రశ్నలు-సమాధానాలు, కీర్తి పబ్లికేషన్స్ ప్రచురణ
2. 1986: సెక్సులో అనాచారాలు- కీర్తి పబ్లికేషన్స్ ప్రచురణ
3. 1986: షుగర్ వ్యాధి చికిత్స: కీర్తి పబ్లికేషన్స్ ప్రచురణ
4. 1996: క్విక్ రెమెడీస్: శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ

5. 1996: దీర్ఘాయుష్మాన్ భవ– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
6. 1997: మీ వ్యాధులకు మీరే వ్యాధులు– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
7. 1998: చిరంజీవ! చిరంజీవ! సుఖీభవ! సుఖీభవ! శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
8. 1999: ఆరోగ్యామృతం– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
9. 2000: ఆరోగ్య భగవద్గీత– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
10. 2000: బి.పి వ్యాధి సులభ నివారణ: శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
11. 2001: షుగరు వ్యాధి సులభ నివారణ– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
12. 2002: జీర్ణకోశ వ్యాధులు సులభ నివారణ– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
13. 2002: ఆడవారికోసం ఆయుర్వేదం– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
14. 2003: ఆయుర్వేదంలో చమత్కారాలు– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
15. 2004: ఆయుర్వేదంలో సులభ చికిత్సలు– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
16. 2009: ఆయుర్వేదంలో వేగచికిత్సలు– పాపులర్ షూమార్ట్ వారి ప్రచురణ
17. 2010: కీళ్ళ వ్యాధులు సులభ నివారణ– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
18. 2010: ఆరోగ్య రహస్యాలు– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
19. 2010: ఎలర్జీ వ్యాధులు–సులబ నివారణ– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
20. 2013: చిటికలో చికిత్సలు: శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
21. 2014: షుగరు వ్యాధి సులభ చికిత్సలు– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
22. 2017: నిండు యవ్వనం– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
23. 2020: నవకరోనా నిజాలు శ్రీ రాఘవేంద్ర పబ్లికేషన్స్
24. 2020: కరోనా సంహారం: శాంతా వసంతా ఛారిటబుల్ ట్రస్ట్, హైదరాబాద్ ప్రచురణ

**10. ఆహార చరిత్ర–ఆరోగ్యప్రభావం (19)**

1. 1993: తల్లి వైద్యం–శ్రీ మహలక్ష్మి బుక్ ఎంటర్‘ప్రైజెస్
2. 1996: వంటైల్లే వైద్యశాల– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
3. 2003: భోజన భోగం– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ

4. 2003: అలనాటి ఆహారాలు– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
5. 2003: ఆరు రుచులతో ఆరోగ్యం– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
6. 2003: ఆయుర్వేదంలో పథ్యాలు–అపథ్యాలు– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
7. 2010: తరతరాల తెలుగు రుచులు–ఎమెస్కో ప్రచురణ
8. 2012బీ మన ఆహారం–తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ
9. 2014: ఆహారవేదం– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
10. 2017: ఆహారం–ఆరోగ్యం–సందేహాలు, సమాధానాలు శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
11. 2017: ఆరోగ్యం కోసం ఆహారం: శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
12. 2020: ఆహారోపనిషత్తు 1వ భాగం: జీర్ణక్రియలు, జీవన క్రియలు(Digestion and Metabolism in Ayurveda)
13. 2020: ఆహారోపనిషత్తు 2వభాగం (మన ఆహారం–ఆరోగ్యప్రభావం)
14. 2020: ఆహారోపనిషత్తు 3వ భాగం: ఆహార ద్రవ్యాలు–పోషక విలువలు (Food and Nutrition)
15. 2020: ఆహారోపనిషత్తు 4వ భాగం: తిళ్లు వత్తిళ్లు (Diseases & Foodulteration)
16. 2020: ఆహారోపనిషత్తు 5వ భాగం: ఆహార వైద్యం (Food as Medicine)
17. 2024: నలచక్రవర్తి పాకదర్పణం: గంగరాజు అరుణాదేవితో కలిసి: ఆంధ్రజ్యోతి దినపత్రికలో ధారావాహిక
18. 2024: తినరామైమరచి: ఆంధ్రజ్యోతి ఆదివారం సంచిక దారావాహిక
19. 2024: క్షేమశర్మ క్షేమకుతూహలం: గంగరాజు అరుణాదేవితోకలిసి

**11. సామాజిక రచనలు (10)**

1. 1997: లయనిజం విధి–విధానాలు – లయన్స్ క్లబ్ ఆఫ్ విజయవాడ మెగాసిటీ ప్రచురణ
2. 1998: ది ప్రెసిడెంట్– లయన్స్ డిష్ట్రిక్ట్ 324సి4 ప్రచురణ
3. 2000: ది సెక్రటరీ– లయన్స్ డిష్ట్రిక్ట్ 324సి4 ప్రచురణ

4. 2001: ది ట్రెజరర్– లయన్స్ డిస్ట్రిక్ట్ 324సి4 ప్రచురణ
5. 2003: అంతరంగం– లయన్స్ డిస్ట్రిక్ట్ 324సి4 ప్రచురణ
6. 2004: సేవాతరంగం– లయన్స్ డిస్ట్రిక్ట్ 324సి4 ప్రచురణ
7. 2006: పేరులోనే పెన్నిధి– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
8. 2006: సభాపర్వం– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
9. 2009: సేవా సామ్రాజ్యం–ఇమ్మిడిశెట్టి అక్కేశ్వరరావు ఛారిటబుల్ ట్రష్టు ప్రచురణ
10. 2012: జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ నివేదిక ఏం చెప్పిందీ? ఎందుకు చెప్పిందీ? విక్టరీ పబ్లికేషన్స్

**12. ఇతర భాషలలోకి అనువాదిత రచనలు (4)**

1. 2006: సులభచికిత్స పరిహారగళు (కన్నడ) అను: శ్రీ ఎం. ఎల్ రాఘవేంద్ర రావు
2. 2008: ఆయుర్వేద చమత్కారగళు (కన్నడ) అను: శ్రీ ఎం. ఎల్ రాఘవేంద్ర రావు
3. 2008: తెలుగు హీ ప్రాచీన్ హై (హిందీ) అను: డా. వెన్నా వల్లభరావు
4. 2017: Telugu Language and its antiquity: Trans: Dr. Turlapati Rajeswari, SrI N.S. Murty



డా॥ జి.వి.పూర్ణచందు

"డా॥ జి.వి.పూర్ణచందు–పరిచయం అక్కర్లేని ప్రసిద్ధినీ, ప్రాచుర్యాన్నీ పొందిన శతాధిక గ్రంథకర్త, నిత్యపరిశోధకుడు, వ్యాసకర్త, నవలాకారుడు, కథకుడు, 'ముక్కాలు' కవితా ప్రక్రియ సృజనకర్త. తెలుగువారికి 'ఆహారవేదం' అందించిన అపూర్వ యశస్వి. అలాగే, 50పైగా ఆరోగ్య విషయిక గ్రంథకర్త. వీటన్నిటికీ మించి, ప్రపంచ తెలుగు రచయితలకు ఆత్మీయుడైన కార్యకర్త, కార్యదర్శి, కార్యదక్షుడు. అతని మననధార అహరహమూ తెనుగు 'జాలు'నే వెల్లువెత్తుతూ వుంటుంది.

తన వ్యాఖ్యల్లో పూర్ణచందుకు 'శషభిష'లు లేవు. లక్ష్యశుద్ధి అతన్ని తెనుగు నుడి పర్యాప్తికి దోహదం చేసే ప్రతిపాదనల్ని చేయమని ప్రోత్సహిస్తుంది. అందువలన నూరుశాతం ఈ రచన ప్రయోజనం సాధించుకున్నది.

**తెనుగు నుడి పరంగా అతని కృషికీ, అతడు అందిస్తున్న అపూర్వ వ్యాస మణిహారానికి తెలుగుజాతి అతనికి ఋణపడి వుండాలి.**

వివేచనతో కూడిన, ప్రయోజనాత్మక, ప్రయోగాత్మక సాహిత్యవ్యాసం అంటే ఏమిటో ఒక నమూనాని మనముందుంచుతోంది ఈ సంపుటి. ఆ రచనానైపుణ్యం పూర్ణచందుకు ఎంత స్పష్టంగా, సమగ్రంగా వున్నదో కూడా తెలుపుతోంది.

ఇదొక అసాధారణమైన 'సంచికట్టు' మాత్రమే కాదు అపురూపమైన తెనుగు 'నుడిపట్టు' కూడా!! "

– విహారి